


"థియసాఫికల్ సొసైటి" యను నామమునఁ బ్రసిద్ధిఁ గాంచి లోకమునం దన్ని దేశముల యందును వ్యాపించి యుండు దివ్యజ్ఞాన సమాజమునకుఁ బ్రస్తుత మను గ్రాసనాధిపత్యము వహించి లోకమునకుఁ బెక్కువిధముల మహోపకారము చేయుచుఁ గీర్తి వహించి యుండు శ్రీమతి అనిబిసెంటు దొరసానిగారు హిందూదేశపు బాలుర యభివృద్ధిఁ గోరి శ్రీవారాణసీ క్షేత్రమున "సెంట్రల్ హిందూ కాలేజి" యనుపేర నొకగొప్ప కళాశాల నేర్పఱిచి యున్నవా రని యనేకులకుఁ దెలిసియే యుండును. ఆపాఠశాలను స్థాపించుటకు ముందు మనదేశమునం దెల్లెడల ననేకములగు పాఠశాలలు స్థాపింపఁబడి యాంగ్లేయభాషయు భౌతికశాస్త్రములును విశేషముగ బాలు రభ్యసించుచుండియు, నాపాఠశాలలయందుఁ బరమార్థవిషయములు కొంచెమైనను వారికి నేర్పకుండుటచేతను, కొన్నిపాఠశాలలయందు అన్యమతమునకు విరుద్ధములగు విషయములను బోధచేయుటచేతను, సామాన్యముగ హిందూబాలురకు మతాభిమానము లేకపోవుటయే గాక కొందఱకుఁ దమ మతమునందు ద్వేషబుద్ధియుంగూడఁ

బుట్టుటంజూచి యెంతయుఁ జింతించి బాలురకు తమతమ మతసారమును యుక్తియుక్తముగఁ జిన్నతనముననే బోధించక పోయినయెడలను, బాలురకు మంచి ధర్మములను గఱపి వారలచే వాని ననుష్ఠింపఁ జేయనియెడలను, మంచిస్వభావము, సౌశీల్యము, ఉదారగుణములును బాలురయందు దృఢపడుట యసాధ్యమని యెంచి యప్పటి విద్యాభ్యాస పద్ధతులయందుండు నీలోపమును నివరించు నుద్దేశ్యముతో నీపాఠశాల బహుప్రయత్నముతో నేర్పాటు చేసిరి.

అందుఁ దక్కిన గొప్ప కళాశాలలయందు విద్య నేర్పు రీతిని నాంగ్లేయభాషయందును, పాశ్చాత్యుల పద్ధతుల ననుసరించి యనేక ప్రకృతిశాస్త్రములయందును విద్య బాహుళ్యముగ నేర్పుటయేగాక సంస్కృత భాషయును సనాతన ధర్మము అనఁగా హిందూమత సిద్ధాంతములును, కర్మములును, ఆచారములును, వానికి మూలములగు కారణములును బాలురకుఁ జక్కఁగ నేర్పఁబడుచున్నవి.

మఱియు నా సనాతనధర్మములు బాలురకు బోధచేయుటలోఁ దమతమ యాచారములను, దమతమ సిద్ధాంతములను దామవలంబించుచు నితరులయాచారములను

గాని సిద్ధాంతములను గాని ద్వేషించక యాదరించవల యు నని నొక్కి చెప్పుచు మతవైషమ్య మనునది వాసన గూడ లేకుండఁజేయుచున్నారు. అందులను భగవద్భక్తి, రాజభక్తి, పెద్దలయందు గురుత్వము, తోడి వారలయం దనురాగము, చిన్నలయందును, బీదలయందును గరుణ యుఁ, బరోపకారబుద్ధియు, భూతదయయు నభ్యసించుచు దేశాభిమానము, మతాభిమానమును వృద్ధిచేసికొనుచుఁ బెద్దవారలైనపుడు దేశాభివృద్ధి కొఱకుఁ బాటుపడుటకు యోగ్యులగుటకుఁ బ్రయత్నపడుచున్నవారు.

ఇంతియగాక హిందువులచేఁ బవిత్రములని యెంచఁ బడు నితిహాసగ్రంథములగు శ్రీమ ద్రామాయణ మహా భారతములనుండియు నాచారవ్యవహారములం దెల్పు నిత రగ్రంథములనుండియు సారమంతయు గ్రహించి బాలుర మనంబుల వికసింపఁజేయునటుల, వారలయందు దేశాభి మానము, మతాభిమానము, సదాచారము, సద్ధర్మాను ష్ఠానము లోనగునవి వృద్ధిచేయునటుల, అనిబెసెంటు దొర సానిగారు పైని పేర్కొనఁబడిన విషయములను వేఱువే ఱుగ బాలుర కుపన్యసించియున్నారు. ఆగ్రంథములయంద లి విషయములు బాలురకు మాత్రము గాదు. బాలురకు వృద్ధులకు స్త్రీలకుఁ బురుషులకును విశేష జ్ఞానదాయక ములై వెలయుచున్నవి. అందు శ్రీమహాభారత విషయ

మును గుఱించి వారిచ్చినయుపన్యాసము లాంధ్రభాష
లో "భారతసార" మనుపేర మున్దే ప్రకటింపఁబడియు
న్నది. రాజశ్రేష్ఠుఁ డగు శ్రీరామచంద్రుని చరిత్రము
నుండి తెలియఁదగు నుత్తమధర్మములను వెల్లడిచేయుచు
శ్రీమద్వాల్మీక రామాయణము ననుసరించి యీమె యి
చ్చిన యుపన్యాసములను దెలిఁగించిన నాంధ్ర దేశజనుల
కెల్ల నత్యంతోపయోగముగ నుండు నను నమ్మకమున
నిపుడీగ్రంథమును బ్రచురించుచున్నారము. అందలి కథా
స్వారస్యము మాత్రము గాక యందలి నీతులను సయిత
మెల్లరు చక్కఁగ గమనించి యందలిధర్మములను అభ్య
సించి చదువరు లందఱు మేలు పొందుదురు గాక.

శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ పరమేశ్వరాయ నమః

శుభమస్తు.

# శ్రీ రామాయణ సారము

## అవతారిక.



క. శ్రీలీలాభావితమై
మూలప్రకృతి పరిణామముల నేడింటం,
గీలుపడు ప్రపంచములోఁ
గ్రాలుచిదానందసత్ప్రకాశు స్మరింతున్.

చ. మలినముగానిభక్తిగరిమన్ గురునాథునివిఘ్ననాథునిన్
నలువసరస్వతిం గమలనాభునిలక్ష్మి మహేశుఁ బార్వతిన్
దెలచి పరాపరజ్ఞులగు దివ్యజగద్గురులం దలంచి మం
గళకర కావ్యకన్యకలఁగన్న కవీంద్రుల నెంచి కూరిమిన్.

ఆ-వె. అనివసంతమాంబ యాంగ్లేయ భాషలో
భరతవర్షబాల బాలికలకుఁ,
దెలివియును గుణంబు - సలర రామాయణ
సార మొత్తి పలికె జనులు నవ్వ.

ఆ-వె. విశరకారణముల విలసిల్లియాపుస్త
కమునఁ దేఱి తోఁచు విమలబుద్ధిఁ
జెలుఁగుచిన్నవారు తెలియంగనడుపంగ
వ్రాయువాఁడ దాని వచనసరణి.

శ్రీకాశీక్షేత్రమున నార్యబాలికల కొక్కకలాపాఠశాల కలదు. దాని నవివసంతమాంబ యనునాంగ్లేయ స్త్రీరత్నము స్థాపించెను. అందు భారతవర్ష బాలురకు నైహికాముష్మికఫలములఁ బొందించు విద్యగఱపిన నేర్చి సంతుష్టహృదయులై పిల్లవాం డ్రుల్లసిల్లుదురు. కరుణానిధియు విద్యానిధియు నగునాయుపాధ్యాయ పెనుచుచుండఁ బెరిగిపెద్దలై బిడ్డలు దృఢశరీరములఁ జెలువారుచుఁ జక్కనిగుణముల సాగియుచుందురు.

శిష్యులు తన్నుఁజుట్టుకొని కూరుచుండియుండ నొక్క సమయమున నవివసంతమాంబ వారికి భారతసారమును దెలిపి యందలి తత్త్వార్థముల వారిమనసుల కలవియగు నట్లు కొన్నింటిని విశదముగా నెఱింగించిన నక్కథవిని బాలురు ప్రమదమునఁ గ్రాలిరి. ఆమీఁద రెండుసంవత్సరములు గడచిన రామాయణమునందలి సారాంశములఁ గఱపెను. తత్క్రమం బెట్టిదనిన.

# ఉపోద్ఘాతము.



వత్సలారా! రెండుసంవత్సరములకుఁ బూర్వము లోకమునందలి యుత్తమగ్రంథములలో నొక్కటియగు మహాభారతమును బఠించితిమి. ఇఁక నిప్పుడు రామాయణమును జదువుదము. ఇది యార్యావర్తమునందలి యితిహాస పురాణములలో రెండవది. ఈరెండుగ్రంథములును బండితులు రచించిన యితరార్యగ్రంథములకంటె నుత్తమములై మేలుబంతులన స్పష్టముగఁ దోఁచుచుండును. వేదములును మనుధర్మశాస్త్రమును బండితులకు నత్యుత్కృష్టములగు ప్రామాణిక గ్రంథములయ్యు సామాన్యజనులకుఁ దమంతటఁ దా ముపయుక్తములుగావు. పండితముఖ్యులకే ప్రయోజకములగును. అట్లుగాక రామాయణమహాభారతములు భరతఖండమున నెల్లరకుఁ బ్రమాణములు. అవిరెండును స్త్రీపురుషులయు, బాలవృద్ధులయు నడవడికలందుఁ బెనఁగియుండును. వారివర్తనములం బొంది పొసఁగియుండును. తల్లులీకథల బిడ్డల కెఱిఁగింతురు. గురువులు శిష్యులకుఁ గఱపుదురు. పెద్దవారు చిన్నవారికి నేర్పుదురు. పిల్లలందఱు బాల్యమునుండి యీకథానా

మును. పుస్తకమంతయు నాధునిక నాటక మట్లుండును. అందు నెందును మేలుగీడులు గలిసి యుండును. దాని యందు నకలంక చరిత్రుండగు భీష్ముఁడొక్కరుండు దక్కఁ దక్కిన వారలలో నొక్కఁడేనియు సత్పురుషలక్షణములకు సంపూర్ణమగు నిదర్శనముగఁ జెప్పఁడు. వారిలో నమానుషమగు కృష్ణావతారమును జేర్పరాదు. కృష్ణుఁడు మహానీయుఁడు. శ్రీకృష్ణుని వేఱుపఱుప వలయును. మిగిలిన వారందఱియందును సుగుణదుర్గుణములు గలిసియుండును. కావున మహాభారతము బుద్ధికుశలత గలిగి పాపమునకును దానివలని దుఃఖమునకును సంబంధము తెలిసికొననేర్చిన వివేకవంతులకే యుచితమగు కావ్యము.

3. రామాయణ మట్టిదిగాదు. ఇది చిక్కులఁ బొరయదు. కుటిలవర్తనులుగాని వీరుల వ్యాపారములఁ బోలి చదువరులకుఁ దెల్లమగుచుండు నిందుదహరించిన స్త్రీపురుషుల లక్షణములు స్పష్టములు. ఒక్కనిచారిత్రమనుసరింపఁ దగియుండు. వేఱొక్కని నడవడి నింద్యమై చేయరానిదై యుండు. ఇందు వేఱుపడి మేలు మేలేయగును. కీడు కీడేయగును. సితాసితములు ప్రత్యేకించి కనఁబడును. గుణసంకరములు లేవు. ధర్మాధర్మములు మూర్తీభవించి మహాశక్తిమంతులఁ జేరియుండును. బాలుర కొక్కనిరుసి

చరిత్రము మనోజ్ఞమయి యభ్యాసమునకుఁ దగి యుత్సా-
హమును గలిగించును. వేఱొక్కనిచరిత్ర మనుసరణీయము [illegible]
ట్రానిదై యుండును. పంకజముఖియగు సీతవంటి సాధ్వి-
డుగ నింపును సొంపును గల కోమల స్త్రీరత్నమును భగవ-
ఖండ స్త్రీలకు నొండెడ దొరకునే. రాజ్యమును సంతసముగా
రాఘవుని యేలుబడిఁగడవ నార్యరాజుల కలవియే. లక్ష్మ-
ణుఁడు రాముని యందు నిలిపిన భ్రాతృభక్తి వంటి [illegible]
యి తమ్ములు నడచుకొనఁదగు ధర్మము భరత[illegible]
సోదరులకుఁ గనఁబడునే. ఇంతయేల యీ పేరులఁ బలికి-
నంతన యీయార్యజనులు పులకితగాత్రులు [illegible]
రే. తన్నామోచ్చారణమే శ్రుతిగాఁ దచ్చరిత్రములు
శ్రవణానందగానములుగా స్ఫురించి జనులమనస్సులకుఁ
బ్రియంబులగును. ఇట్లు రామాయణమును జదివి సులభ-
ముగఁ దెలిసికొని యా తెలివి నలవాటునకుఁ దేవచ్చు.

3. జను లభ్యసింపఁ దగు ధర్మముల నేర్పుటయే
గాక యీగ్రంథములవలన వేఱొక్కప్రయోజనము
గలదు. దానిని మఱువరాదు. పూర్వకాలమున భరతఖండ-
మునందలి నాగరికావిషయములం జూడఁగోరువారికి
యీయుత్తమకావ్యములే ముఖ్యములగు నాధారములు.
వీనిలో నప్పటి దేశములస్థితియు, జనులయోగక్షేమము-
లును, గృహధర్మములు, జనులయాచారములును, సాం-

రాముఁడను రాజకుమారుఁడు. ఆభూకాంతుఁడు క్షమా వంతుఁడు. నియతాత్ముఁడు. వివేకభూషణుఁడు. విపులక ల్యాణవిగ్రహుఁడు. మహాబలశాలి. రణమున శౌర్యనిధి యయ్యు లోకరక్షణమున శాంతనిధి. పరిజన ప్రేమానప్పుఁడు. అని కొనియాడి సంక్షేపముగ రామచరితము నెఱింగించి వారకాలమునఁ బ్రజలకుఁ దాఁ దృష్టాయి బిలిచి న్యాయమునను గనికరమునను రాజ్యము పాలించిన విధ మును వర్ణించెను.

౭. అప్పుడు దేశమునఁ గఱవులును, వ్యాధులును లేవు. వహ్నిబాధలు, వఱదబాధలు గన్పట్టవు. బిడ్డల చావులు తలిదండ్రులెఱుంగరు. పతులమరణములు సతు లెఱుంగరు. ధనధాన్యము లెల్లయెడల సంపన్నములై యుండుఁగావున క్షుద్భయంబును జోరభయంబును లేవు. అని శ్రీరామచంద్రుని రాజ్యస్థితిని నారదుండు మొలుగా రువర్ణనల వర్ణించెను. ఇదియుత్తమరాజ్యముల భాగ్యము. వానియందు రాజులు ప్రజలును ధర్మమునకుఁ గట్టుపడి సర్వజనసౌఖ్యమున శ్రద్ధగలిగి వర్తింతురు. ధర్మము వర్ధిల్లిన నర్థమువర్ధిల్లును. అర్థసంపద దేవతానుగ్రహమునఁ గలుగు. ధర్మపరాయణులై యుదారచిత్తముల నడుచు జనులుండుదేశమునందట్టి దేవతానుగ్రహము గలుగును. అట్లులేనిచో దేశము క్షీణించును. అన్యదేశములతోఁ

ములందూఁగనేరదు. ఆక్షీణతకు జనులే కారణము. మరల నాదేశ ముత్తమపదవికి రావలయుననిన జనులు ధర్మమున నడువవలయు. ధర్మమునందే భాగ్యలక్ష్మి నిలిచివర్ధిల్లును. వేఱొక్కచోట నిలువనోపదు. కావున భారతకుమారులారా! భరతఖండమునకు నభివృద్ధిగలుగునేని మీామూలముననే కావలయును. మీారు పెరుగను బెరుగను ఉదారవర్తనులై ధర్మమున సహితులేని మీాకును దేశమునకు నభివృద్ధియగును. అంతట మీాదేశమును ఇతరదేశములతో సంపత్తున సమానమగును.

ర. అట్లు నారదుఁడు వర్ణించిన రాజోత్తము రాజ్యమునందలి మహిమలచే నిండారుమనంబుతో వాల్మీకి యిచ్చవచ్చిన చొప్పున చనువాఁడెందును సౌందర్యములనె చూచె. మనము రమణీయమయ్యె. కన్నులకుఁ బంధువులై మృగంబులు క్రీడించె. పక్షులు సంతోషమునఁ గలరవములఁ గూయుచుండె. ఇట్లు మనోహరవిషయముల ననుభవించుచు సంతసించుచుఁ జనియె. అందొక్కచోట క్రౌంచమిథునము వేడుకగాఁ గ్రీడించుచుండఁ గనియె. నిరపరాధములగు నాపక్షులలో గండుఁబులుఁగు నొక్కమ్మున నొక్కబోయ గూలనేసిన దానికి మరణమాసన్నమయ్యె. పెంటి శోకంబున మగనివలగొని తిరుగుచు విలపించె. కనికరము సత్పురుషుల లక్షణముగావున వాల్మీకి

పక్షిని గరుణించి చూచి క్రూరవర్తనమును వెంటనాడితె దుఃఖము వచ్చునని యెఱింగి వేటకాని నిట్లని శపించె.

కం. ముదమొప్ప నాటలాడఁగ
నదయుఁడవై యమ్ముఁబఱపి యండజమును గూ,
ల్చెదవా నిషాద యేసం,
పదయును నీకెన్నఁడేని పొల్పడకుండున్.

ఆ శాపవచనములు గానార్హమును శ్రావ్యమునునగు శ్లోకముగఁ గుదిరె. అంత బ్రహ్మ ప్రత్యక్షముగ వచ్చి, ఋషివరా! నీవు రామచరిత్రమును జెవులకింపగు ఛందస్సునఁ గీర్తింపుము. నీకావ్యము పర్వతములు సముద్రములు నుండు నంతకాలము నిలిచి లోకులకుఁ బ్రియమై యుండు. ఇట్లు కరుణావాత్సల్యరసభరితమగు ఋషిమనంబున నుదయించిన గానామృతము రామాయణము. ఆ కావ్యముఁ బఠించునప్పుడెల్లెడలఁ బ్రేమయుఁ గరుణయుఁ బుట్టుచుండును.

౯. వాల్మీకి కావ్యమునకిట్లు ఛందస్సు కుదిరినది. ఛందస్సొక్కటియే చాలదు. కావ్యవిషయములను గూడ సమకూర్చవలయును. అందులకై యతండు కూరుచుండి సమాహితచిత్తుఁడై తపంబొనరించె. కొంతకాలమునకు నంతర్దృష్టి వికసించినఁ దన యెదుట నున్నట్టులు సీతా

రామలక్ష్మణాదశరథులను, కౌసల్యాసుమిత్రా కైకలను, రాజ్యమునఁ దక్కుంగలవారిని గనియె. ఒక్కొక్క రు నిక్కంబున నెట్టులుండెనో అట్టులునవచ్చు, మాటలాడుచుఁ దమతమ విగ్రహములతోఁ గనఁబడిరి. అట్లు కనఁబడిన కథాంశముల వాల్మీకి చక్కఁగ గమనించె. ఎల్లవిధంబుల జరిగినది జరిగినట్లు తోఁచె. అది యెట్లనిన నింద్రియగోచరములగు స్థూలపదార్థముల నెల్లనిండి యంతర్భూతమై వానికి వెలుపలను గొంత వ్యాపించి సూక్ష్మమగు నాకాశముగలదు. ఆయాకాశమందు సూక్ష్మములుగ నేర్పడి ప్రపంచములో జరుగుసంగతులెల్ల నిలిచి యెల్లప్పుడుండును. ఆసూక్ష్మరూపములుగ నున్న రామాయణచిత్రములను వాల్మీకిచూచెను.

౧౧. జ్ఞానోదయమునకు రెండుమార్గములుండు. గ్రంథపఠన మొకటి. ఎఱుకగలవారు సేకరించిన జ్ఞానమును వారుగ్రంథరూపముగ రచించి యెఱుకలేనివారికుపయోగ్యముగఁ జేయుదురు. ఆగ్రంథములంజదివి జనులు జ్ఞానము నంపాదింపనగు. జ్ఞాననేత్రపరిపాకము రెండవమార్గము. మనము నేత్రేంద్రియముచే గోచరములగు వస్తువులను జూచి వానిస్వరూపమును గ్రహించువిధమున జ్ఞాననేత్రమును వికసింపఁ జేసికొని మనము కోరువిషయముల నన్నింటిని స్వతంత్రముగ గ్రహింపవచ్చును. రెండవమార్గ

మెంతయో కష్టతరమయ్యెను నదియు రెండింటిలో మేలైనది. రెండవదానికి మొదటిమార్గము త్రోవ. పుస్తకములఁ జదివి కొంత తెలివిని సంపాదించిన పిమ్మట జ్ఞానదృష్టిపరిపాకము కొఱకుఁ బాటుపడి దానిని సాధింపవలయును. ఉజ్జ్వలమతులైన పండితులుచూచి యనుభవించి మనకుఁ జెప్పియిచ్చిన జ్ఞానమును మనము నేర్చి యనుభవించినఁగాని ప్రయత్నపూర్వకముగ ద్వితీయమార్గమున నడువ నేరము. ఇట్లు నడువ నడువ నంతరింద్రియము వికసించును. సర్వమును నెఱుంగ నేర్తుము. అంతట గ్రంథములసహాయముఁ గోర నక్కఱ లేదు.

౧౧. ఇవ్విధమున యోగదృష్టిచే రామకథను జూచి ఛందస్సును గుదుర్చుకొని వాల్మీకి రామాయణమును రచించె. దానికథ నిరువదినాలుగువేల శ్లోకములుగ రచించి వానినేనూఱు సర్గములుగ భాగించి యేడుకాండములుగఁ జేరిచి గ్రంథమును ముగించెను.

౧౨. గ్రంథము ముగించియు నది జగముల వెలయుటెట్లు? లోకప్రకటనమున కుపకరణము లెవ్వియని వితర్కించెను. ఇప్పుడు చేతవ్రాసియు నచ్చొత్తించియు గ్రంథములఁ బ్రకటించిన వానిని గన్నులఁజూచి చదివి విద్యను గ్రహింతురు. అప్పు డట్లుకాదు. పండితుల ముఖంబుల

నుండి వెలువడి విద్య పామరుల చెవుల సోఁకఁగా వారు విద్యనేర్చుచుండిరి. కావున వాల్మీకి సజ్జనుల సభలయందు నీకావ్యము నెవ్వరుపఠించి పాడి ప్రచురముచేయుదురో యని తలపోయుచో నిద్దఱు మునికుమారులు వచ్చి యమ్ముని పాదంబులకు మ్రొక్కిరి. వారు కుశలవులు. వారన్నదమ్ములు. వారు రాముని కుమారులయ్యు నాసంగతి నెఱుఁగరు. ఈవింత యెట్లు కలిగె? దీనికిం గారణమేమి? అనిన దాని నుత్తరకాండమునఁ దెలిసికొనియెదము. వారు సంగీతవిద్యాకుశలులు. మధురస్వరముగలవారు. కావున నామునివరుఁడు తనచేసిన యద్భుతకావ్యమును వారికిఁ గఱపెను. ఆసోదరులు చనిచని మునిజనసభలను, బ్రాహ్మణగోష్ఠులను, సజ్జనసంఘములను రామాయణమును బాడిరి. ఇట్లు క్రమమొప్పఁ బాడుచు నయోధ్యను జేరి పురవీథులఁ బోవుచుండ నాపురంబును నుజ్జ్వలవైభవంబున నేలుచుండిన శ్రీరామచంద్రుఁ డాయమడబిడ్డలం గనియె. కనిసంతన గోమలసుందరాకారులును, వినయాలంకారులును నగు నాకుమారులయందు రాముని హృదయంబు చిక్కె. రాజవరుండు వారలం గొలువునకు రప్పించి వారిగానమును వినఁగోరిన వారు పాడిరి. రాముని జననంబును, రమణీయచరితంబును వానిపొందిన దుఃఖములును, వానికిం జేపడిన యలజడులును పాటల

యందుఁ బాడిరి. సీతా లక్ష్మణ భ[illegible]
గానము సేసిరి. ధానాయకులగు [illegible]
ల నిట్లు పాడిన విని యయ్యద్భుత[illegible]
ఆశ్చర్యము [illegible]
కుమారు లయ్యు రాజచిహ్నము[illegible]
సభ్యులు తలఁచి వింతపడిరి.

౧౩. ఆకుమారులు రాజసభలోఁ బాడిన రామాయ
ణమును వినుటకుఁ బూర్వము [illegible]
కుఁ గారణములను, నాకారణములను [illegible]
మును గొంతవిచారించి చూతము. శ్రీరాము[illegible]
మున కేమి కారణము? ఆకాలము [illegible]
యుండెనో యనియును గూడ [illegible].

౧౪. శ్రీరాముఁడు త్రేతాయుగమున [illegible]
పాలనము చేసెను. ప్రపంచసృష్టి మొదలు [illegible]
దనుక వ్యాపించు కాలపరిమాణమును గాని దేశము [illegible]
యము మొదలు దాని [illegible] దాఁక నగు కాలపరిమాణ
మును గాని నాలుగు భాగములుగ భాగించిన నవి నాలుగు
యుగము లగును. వానికి సత్య త్రేతా ద్వాపర కలియుగము
లని పేరులు. భారతఖండమునందు సత్యయుగము [illegible]
రువాతఁ ద్రేతాయుగమున నాలుగవపాదమున [illegible]

సహ్రసు భూమి నేలెను. రాముని నిర్యాణము కాఁగా ద్వాపరం బారంభించె. అమ్మెయి ద్వాపర యుగాంతమునఁ గృష్ణుం డవతరించె. కృష్ణుఁడు భూలోకమున నుండి వెడలినప్పుడు కలియుగంబు ప్రారంభ మయ్యె.

౧౫. ఇఁక శ్రీరాముఁ డెవఁడని విచారించవలయును. రామచంద్రుఁడు వీరేంద్రుఁడు. రాజేంద్రుఁడు. అంతియగాదు. భగవంతుని యవతారము. సంపూర్ణ భగవదైశ్వర్యముగల శ్రేష్ఠుఁడయినవాఁడు. మనుష్యులందఱు భగవదంశసంభవులే. సర్వజనుల హృదయములందుఁ బరమాత్మ నిలిచియున్నాఁడు. హృదయస్థుఁ డగు పరమాత్మయే మన లంబుగఁ గొలిపి యభివృద్ధి చెందఁదగును. పరిపక్వస్థితికై ప్రేరేపించుచుండును. ఆపరమాత్మ చోదనమునకు లోఁబడినచో మన భాగ్యవంతులమే యగుదుము. ఇది సకలజీవాత్ములకు సమానముగు ధర్మము. అవతారపూరుషు లంతకధికులు. అవతారములయందు భగవంతుఁడు మానవశరీరములఁ దాలిచి మఱుఁగుపడి యుండియు నాపురుషుల మహిమలచేఁ దన మహిమల వెలుఁగఁ జేయుచుండును. అస్మదాదులయందు నీశ్వరుని యంశము బీజమునఁ జెట్టుండునట్లు లగాఁగియుండు. అవతారపూరుషులయందు నీశ్వరుఁ డవతరించి తన్నుఁదానే మానవనికాయమునకుఁ గనఁబఱచుకొనును. తన దివ్యగుణములఁ బ్రకటించును.

౧౬. ఇట్లు మనుష్యశరీరము నొంది యీశ్వరుండవతరించుటకుఁ బ్రబలకారణములుండును. లోకపరిపాలనమునకుఁ దోడుపడునవి ధర్మములు. వానికిఁ బ్రతికూలములగునవి యధర్మములు. ధర్మముఁ బ్రబలము చేయ నధర్మమును దుర్బలము చేయ నీశ్వరుఁడవతరించుట కొక కారణము.

యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచదుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

గీత. ౪ అ. ౭-౮ శ్లో.

క. ధర్మము దుర్బలమయిన న
ధర్మము మించినను దుష్కృతము లడఁపఁగ స
త్కర్మముల మనుప నిలుపఁగ
ధర్మముఁ బ్రతియుగముఁ బుట్టుదను నేన సదా.

సాధారణముగనిది యవతారములకు ముఖ్యకారణమగును.

౧౭. దోషములను ఖండించుకొనుటకు స్వామి యవతారముల ధరించుచుండెనని. ఇవ్విషయమునం దొక సంశయము కలుగవచ్చును. సంసారప్రవర్తనమునకు రెండు పరస్పరవిరుద్ధములుగఁ దోఁచు శక్తులుగలవు. పరమేశ్వరు నుండి ప్రపంచమున వెలువడిన జీవులందుండు [illegible]

లన్నియుఁ బరిపక్వములు గావలయును. భూమిలో వి త్తన
ముల నాఁటిన నవి మొలకలై పెరిగి చెట్లులై పూచియు
నప్పూవ్వులనుండి కాయలుగాచియుఁ బండ్లు పండించునట్లు
ప్రకృతియం దీశ్వరాంశమను వి త్తనము మొలిచి ప్రపంచ
పాదపమై వ్యాపించి మానవ ప్రసూనములఁ బ్రసవిం
చును. అందుండి యీశ్వరసమానములనఁదగు చైతన్య
ము లనుఫలంబులు పరిపక్వములగును. కావున మన
మెల్లరము నీశ్వరస్వరూపులమే. అనఁగాఁ గ్రమక్రమముగ
నీశ్వరులుగఁ బరిణమించఁ గలవారము.

౧౭. పరిణామమునఁ జక్కఁగ సాగవలయుననిన
రెండుశక్తు లవశ్యములు. పైచూపున కీ రెండును బరస్ప
ర విరుద్ధములుగఁ దోఁచును. ఒకటి యనుకూలమై పరి
పాకమునకుఁ దోడ్పడి లోకమును నడుపును. వేఱొకటి ప్రతి
కూలమై యడ్డుచేయునట్లు గనఁబడును. కానియ ట్లది ప్రతి
కూలము గాదు. ఇది సిద్ధము. ప్రపంచ పరిణామమునకు
ననుకూల ప్రతికూలశక్తులు రెండు సమముగ సార్థకము
లు. ఎట్లనిన నిదర్శనములచేఁ దెలిపెద. బండిచక్రమొ
క్కదానిఁ జూతము. అది భూమినంటక యుండిన దానిని
సులభముగ గిఱగిఱఁ ద్రిప్పవచ్చునుగాని యాభ్రమణ
మున బండికి గమనము కలుగదు. చక్రము భూమిపై
నిలువఁగా భూనిరోధము గలిగినంగాని చక్రభ్రమణమున

నష్టముల మించి దేహదార్ఢ్యమును బెంతురు. అట్లు గాక యుత్సాహము లేక సోమరి తనమున నూరకున్న బలవంతులగుదురే. దేహశ్రమంబుననే దేహశక్తి మించును. ఈవిధమునఁ బరిశ్రమంబునఁ బోరాడి పాపములకు లోఁబడక కడచిన నంతరాత్మ శక్తి వర్ధిల్లును. అధర్మమునకు లోఁబడిన నది మనుజుని క్రిందికి దిగఁద్రొక్కును. అధర్మము నెదిర్చినప్పుడు దాని విరోధముననే ధర్మము మీఱి జనుల యభివృద్ధికి సాధనమగు.

౨౦. అధర్మములకు జనులు లోఁబడిన నవి బలవంతములై పెరిగి నిర్భరము లగుచు లోకయాత్రను మరలింపఁ బ్రయత్నించు. ఆసమయముల ధర్మాధర్మముల న్యూనాధిక్యముల నెఱిఁగి సరిచేయ నీశ్వరుఁడవతరించు. రెండియు నట్టివేళల సాధారణముగ సకలదుర్గుణము లొక్కచోటఁ జేరి మూర్తీభవించు నట్లొక్కని నాశ్రయించి యున్నత దశయందుండును. అతఁడే యవతార పురుషునకు విరోధియై పోరును. రామాయణకథయందు రామచంద్రుఁడు ధర్మస్వరూపుఁడుగను, రాక్షసేంద్రుఁడధర్మస్వరూపుఁడుగను నేర్పడి యొకరితో నొకరు పోరిరి. ఇట్లు ధర్మాధర్మ స్వరూపు లొకరితో నొకరు పోరఁగా యుద్ధమున శ్రీరాముఁడు జయముగనెను. ఇట్లు ధర్మపక్షము జయించిన నసత్తగు నధర్మము నీశ్వరునంద పుట్టెనని తేటపడె

నో యనునట్లు రాముని చేత ప్రాణములఁ గోలుపోయి రా
వణుఁడు వైకుంఠమును జేరెను.

౨౧. ఇట్లు ధర్మసంస్థాపన మీశ్వరావతారముల
కొక్కముఖ్యకారణముగాని యితరకారణములును గలవు.
కొన్ని యెడల నీశ్వరుఁడు గురుఁడై యవతరించి జ్ఞానోదయము
గావించును. శ్రీకృష్ణావతారమున గురువై భగవద్గీతల ను
పదేశముగావించె. ఆగీతాశాస్త్రమెంతయు వింతయై యి
ప్పటికిని లోకమున వెలయుచున్నది. మఱికొన్ని యవతా
రముల నీశ్వరుఁడు సద్గుణనిధియై లోకములకుఁ బ్రత్యక్ష
మగు విధివిధాన స్వరూపుఁడై దీపించును. రామావతా
ర మిట్టిది. రామునిచరిత్రము విజనప్రదేశముల నొంటరిగ
నుండు యోగులకును సన్న్యాసులకును దృష్టాంతము గా
మగాసి గృహస్థులై యుండి సద్గతినిగోరి ధర్మమార్గమున
నిశ్చలముగ నిలువఁ బ్రయత్నించువారికి నైహిక సంబంధ
ములందుఁ బుత్త్రుఁడై, భ్రాతయై, పతియై, ప్రభువై, యు
ద్ధవీరుఁడై చరింపఁదలంచు వానికి వారి వారి ధర్మముల ని
రూపణము సేయు దృష్టాంతముగ నిలిచి రామచంద్రుఁ
డొక్కొక్క సంబంధము నందలి మేలు తెఱంగు గఱపిం
చును. ఆమహానుభావుఁడు పరాక్రమమందును లోకపా
లన క్రమమునందు నుత్తముఁడై యెట్లులొప్పెనో యట్లే
యింటి వ్యవహారములందును బౌరసాంఘిక వ్యవహారము

లందును మెప్పులఁబడసి ప్రకాశించును. అన్యోన్య దార
గుణాను బద్ధులగు వంశ సంభవులంగను, దెగవారియందు
ను, నైకమత్యము తాండవమాడును. భారత వర్షమునం
దుఁ బురాణ ప్రసిద్ధులైన మహాపురుషులలో రామునిమీ
అఁజాలునతఁడు లేఁడు. లౌకికవర్తనంబుల మేలుబంతియై
రాముఁడౌదార్యమును బ్రకటించె. సద్గుణంబులందు రా
మునిమించువారు లేరు. మానవదశయందున్నతదశ యెట్టి
దని రాముఁడే నిరూపించెను. సంసారము నందేయుండియు
దివ్య జ్ఞానము తోడ లోకమునఁ జరింపఁదగు మార్గ
మిట్టిదని వెల్లడిగఁ బ్రచురించిన దివ్యావతారము శ్రీరా
మావతారము.

౨౨. ఇట్లెల్లరకు దృష్టాంతమయ్యు ముఖ్యముగ
క్షత్రియ నిదర్శనముగ నుండ రాముఁ డవతరించెను. దా
నికిం గారణమొయ్యుఁడు. తెలిపెదను. క్షత్రియులు తమ
బలశౌర్యములఁ బెడత్రోవలఁ బ్రయోగించి దొరతన
ము చేయు యోగ్యతను బోఁగొట్టుకొనిరి. సామాన్య బల
వంతులు లోకులఁ బీడించుట సహజమగునట్లు క్షత్రి
యులును లోకులఁ బీడించుచుండిరి. బాహుబలంబున
జగద్రక్షణము చేయక జగముల బాధపెట్టుచుండిరి. ఒరు
లమేలు పాటించి యుపయోగింపఁదగు స్వశక్తిని స్వప్ర
యోజనమున కుపయోగించిరి. "దుర్బలస్య బలంరాజా"

యనుట శక్తిమంతులగు రాజుల నీతి. బలహీనులను రక్షించుటయే బలవంతులకొప్పును. అదియే వారికిం గర్తవ్యము. అదియే వారికి ధర్మము. అబలులం బీడించుట యొప్పనిపని. ఇట్లు బాలురందును, ధృఢగాత్రులు దుర్బలులకుం జెఱుపు రానీయక వారిని గాచుట మేలు తెలుంగు. కుఱ్ఱవానిం గొట్టు పెద్దవాఁడు శూరుఁడగునే? కాఁడు. పిఱికియే యగును. ధీరులగు బాలురు వానిని నీచునిగ భావింతురు.

౨౩. అట్లు బాహుబల దుర్వినియోగముచేఁ జెడిన రాజవంశములఁ బరశురాముఁడు శిక్షించి మొదలంట నఱికి నాశము చేసెను. ఈక్షత్రియకుల నాశముచేతఁ దమ బాహుబలంబుల దుర్బలులఁ బీడించి వధించు బలవంతులు దమ్ముమించు బలవంతులచేఁ జచ్చువారని పరశురాముఁడు క్షత్రియులకు బుద్ధికఱపెను. ఇట్లు పరశురాముఁడు నిష్ఠుర శిక్షణంబున నేర్పిన పిమ్మట శ్రీరామచంద్రుఁడు క్షత్రియ ధర్మమూర్తియై పూనికతో నాధర్మముల మరలస్థాపింప నవతరించెను.

౨౪. ఇట్లు రామునందు నచ్చుపడిన ధర్మము రామాయణమును జదివి గ్రహింపవచ్చును. బాలకులారా! అచ్చటచ్చట దానిని నేను మీకుఁ దెలిపెదను. ఐనను ఆ ధర్మ మిప్పుడు భరతఖండమున క్షీణించి యున్నదనియు

దానిని మరల లేవనెత్తి స్థిరముగ నిలుపుట యావశ్యకము
నియు నీప్రథమోపన్యాసమునఁ జెప్పకతీరదు. ధైర్యము
దేహదార్ఢ్యముఁ దాలిమియు, సహనము, శిష్టరక్షణము
న శ్రద్ధయు, దుష్టశిక్షణమునఁ జొరవయుఁ జుఱుకుఁదన
ము, గుండెపట్టు మొదలగు గుణములీదేశము నుద్ధరింప
నవశ్యకములు. ఈగుణంబులు రామాయణమున లెస్సగఁ
దేఱి కనఁబడును. ఈపౌరుషగుణములు పూర్వము వీరు
లందుఁ జనితార్థములై స్పష్టముగఁ బ్రకాశించుచుండె. ఇ
ప్పుడవి కొఱఁతపడినవి. దక్షులకుండఁ దగిన యీగుణము
ల జాఱవిడిచినవారును, వారిదేశమును ఉన్నత దశకు
రాఁజాలరు. కావున నీ గుణంబుల భరతఖండమునఁ జ
న్నవారియందు మరల నెలకొల్పవలయు.

౨౬. తఱచుగ నిట్టిదక్షులు పౌరుషముతోఁ బరు
లఁ దిరస్కరింతురు. అట్టిపోలని పనియని మీరు గ్రహిం
పవలయును. శ్రీరాముఁ డొరులఁ దెగడఁడు. కఱకులాడఁ
డు. ఎల్లప్పుడును గరుణతోడను, మార్దవముతోడను ప
రులగారవించుచు సభ్యుఁడై పొలుపొందె. తల్లిదండ్రుల
భక్తిరసార్ద్రహృదయుఁడై పూజించెను. పెద్దల గారవిం
చెను. ఎఱుకగలవారి నట్లు మన్నించెను. రామునట్లు మీ
రు పరుల యెడ మార్దవమును గౌరవమును గలిగి ధైర్య
మును వృద్ధిచేసికొనుచు మానమును గాపాడుకొనుఁడు.

అట్లు చేయుటకు లేని యకళంక పౌరుషమున నొప్పి బలవంతులును దయావంతులు నగుదురు.

౨౬. వయఃకులాది సంపదల నధికు లగువారిని గని భయపడకుండు. తండ్రికి నుపాధ్యాయునకు జడియరాదు. వారు పూజింపఁ దగినవారు కాని భయావహులుగారు. వారు మీయందు వాత్సల్యముగలవారు. దీనిని గట్టిగ నమ్మి వారలయందు శ్రద్ధా భక్తులతో వర్తింపుఁడు. మీరు ధీరులై కుటిలమార్గములంబోవక సభ్యులై యార్జవమున నడతురేని పెద్దలు మిమ్ముఁ బ్రేమించి చేరఁదీసి నమ్ముదురు. ధైర్యవంతులు పౌరుషవంతుల గౌరవింతురు. నీచభావమున నటించుట నిష్టపడరు. ఇట్టి పౌరుష సద్గుణంబులకు నిధియై రాముఁడు రాజ్యమేలెను.

౨౭. ఇఁక నాకథఁజెప్పనారంభించెద. రామాయణమున మొదట నయోధ్యాపుర వర్ణనమున్నది. అది రాముని జన్మభూమి. కోసల దేశమునకు రాజధాని. అయోధ్యయనఁగా గెలువరాని దనియర్థము. దానిని మహా మహిమోన్నతి రాజిల్లుచు నిక్ష్వాకు కులమున జనించిన దశరథుఁడేలు. మనోహరమగు సరయువు జలంబులు పాఱుటచేఁ బొలములు చక్కఁగ ఫలించును. దేశము సంపదలఁ బెంపొందు. అయోధ్యాపుర వర్ణన మింపులు గులుకుచు మనోహర మయ్యెడు. అందుఁ బేర్కొనిన యంశ

ములచే నాగరికత యాకాలమున మిగుల వృద్ధియై యుం డెనని తోఁచును. రాజవీథులు విశాలములు. వాడ లందు దుమ్ము లేఁగక చక్కఁగ నీరుచల్లి సువాసనగల పూవుల వెదఁ జల్లుచురు. నానావిధ సంభార భరితము లగునంగళ్లుంగలవు. అందు నానా శిల్పకళా కోవిదులును, వర్తకులు నుందురు. జనోపకారకముగ నాటక శాల లు, దివ్య హర్మ్య సదనములు, నుద్యానములుఁ గ్రీడావే దికలునుల్లసిల్లు. అస్త్రవిద్యానిపుణులు, యుద్ధ ధర్మకో విదులు నగువారు పింభటులుగా నియోగింపఁ బడుదురు. వారు కాఱడవులఁ దిరుగుచుఁ జెలరేఁగినపందులను, బెబ్బులుల సింహములఁ జంప నోపుదురు గాని యనాథల ను, విగత ప్రాణులను, దాఁగిన వారలను, వెన్నిచ్చిపా ఱువారలను జెనక నోడుదురు. దుష్టమృగ దుర్జన బాధ లు లేక సుఖంబుండ జనులను రక్షింతురు. అప్పురి విప్రు లు ధర్మపరాయణులును, బుణ్యశీలురు, జ్ఞానవంతులు, సత్యసంధులు, నుదారచిత్తులు, మహార్షి సన్నిభులు.

౨౮. ఇవ్విధమున నుత్తమగుణములచే నావ్వారి ప్రజలు యోగక్షేమములఁ బెంపొందిరి. అది స్వభావసి ద్ధము. జనులెల్లరుఁ దమ తమ భాగ్యములఁ దనియుదురు. అందు దరిద్రుఁ డేని చదువులేని వాఁడేని యొక్కరుఁడు లేఁడు.

౨౯. ఇప్పుడు నల్లెల్లరు విద్యావంతులై రేని హృదయరంజకముగా నుండదే. అట్లు గాక కొందఱే విద్యావంతులుగ నుండఁ దెక్కండ్రు విద్యావిహీనులై వెనుక నిలుతురు. సౌఖ్యమునకు సంతుష్టియే ముఖ్యసాధనమయ్యు నది యిప్పుడెల్లయెడలఁ గానరాదు. ధనము, పదవి మొదలగువానివలన సంతృప్తి గలుగును. అది చిత్తవృత్తి ననుసరించి యుండును. ఉల్లమున నుల్లసిల్లునదిగాని బాహ్యసందర్భములవలనఁ గలుగునదికాదు. దరిద్రులయ్యు ననేకులు దమకుండు స్వల్పభాగ్యములఁ దనియుదురు. ధనికులయ్యు ననేకులు దమకుండు భూరిభాగ్యములఁ దనియరు. మనస్సే సంతుష్టికి మూలకారణము.

౩౦. వెండియు నానగరమునఁ బౌరులెల్లరు సుశీలురు. విమలాత్ములు. విమలాంగులు గావునఁ జొక్కపుఁ జక్కఁదనంబున మక్కువయును లేని మానినినిగాని, మానవునిగాని యందుఁజూడము. అదియట్టిదె. ప్రసన్నశీలాచారముల ననుసరించియే దేహసౌందర్య మాధుర్యములొనగూడుట సిద్ధము.

౩౧. ప్రజాసౌఖ్యమునకు మఱియు నొక్కకారణము రాజుగుణములు. ఆనగరమేలు భూపాలుఁడు దశరథుఁడు. సద్గుణముల పోగ్రిదియై యక్కజముగా నేలును. వివేకమునఁ జక్కఁగఁ బరీక్షించి మంత్రుల నియమించును. ఆమంత్రులు

భక్తితోఁ దమరాజుమేలు పాటించువారనియుఁ జదువరుల నియు వినయాలంకారులనియు, నీతికోవిదులనియు, నియతాత్ములనియు, సతతోద్యోగులనియు, మంజుభాషణుల నియుఁ, గామక్రోధ లోభమోహములఁజిక్కి యెన్నఁడే ని యనృతములలోఁ గూలరనియు వాల్మీకి వర్ణించెను. అట్టి రాజు నట్టిసచివులు పాలించినఁ బ్రజ లెంతయు సుఖింతు రనుటకు సందియ మేల?

౩౨. ఇట్లారాజ్యము సకలకల్యాణముల నుల్లసిల్లు చుండియు నం దా సౌఖ్యసంపదల కన్నింటి కప్రియంబుఁ గూర్చునదియై యొకకొఱంత వ్యాపించియుండెను. రాజునకు బిడ్డలు లేరు. ముదిమియుఁ బ్రాప్తించెను. తన వెనుక సింహాసనమునఁ గూర్చుండఁగల కొడుకునకై రాజు వాచియుండెను. ప్రజలు నట్లేకోరిరి. పుత్త్రప్రాప్తికై పుడమిఱేఁడు జన్నము లొనరించె. దేవతలఁ బ్రార్థించె. తుట్టతుద కశ్వమేధయాగము సలుప విద్యాయశోనిధియగు ఋష్యశృంగ మునినాథుని వరించి యధ్వర్యునిగఁ జేసెను. దానికొఱకు నెల్లపనులు సిద్ధముకాఁగా రాజును రాజపత్నులును యజ్ఞదీక్షను వహించిరి. ఆయజ్ఞమున వేదవేదాంగవేత్తలును, పండితశ్రేష్ఠులును, ఆడినమాట తప్పనివారును దక్షిణదక్షిణవారిని యాజకులుగఁ జేకొనరైరి. సదస్యులు వాదకుశలులైయుండిరి. మేలగు నాకాలమున

నజ్ఞానియు విద్యావిహీనుఁడు నగు బ్రాహ్మణుఁడు బ్రాహ్మ
ణుఁడనిపించుకొనఁడు. మనుస్మృతిలోని యీ వాక్యము
లమోఘములై చెల్లును.

“యథా కాష్ఠమయో హస్తీ యథా చర్మమయో మృగః,
యశ్చ విప్రోఽనధీయానస్త్రయస్తే నామధారకాః” 157.

“కొయ్యయేనుఁగు, తోలుజింకపగిది విద్యలేనివిప్రుఁడు
నామమాత్రుఁడగు.” ఋత్విజుఁడగు పురోహితుఁడు
విద్యావిశారదుఁడు గాఁడేని యజ్ఞమును సఫలముగా
నేరదు. సత్యజ్ఞానశౌచములు లేనివారు ఋత్విజులై యుచ్చ
రించు మంత్రములు సురలఁ జేరవు. అట్టివారొల్ల [illegible]
రు. వేలుపులు చేరనికర్మములు నిష్ప్రయోజనములగును.
చక్కఁగ యజించిన కర్మములందు [illegible]
యనుగ్రహింతురు.

33. ఆమహాధ్వరమునకు భూసురులును, భూపాల
లును, సామంతులును, వీరవరులును వచ్చిరి. ఎల్లవారును
జూచుచుండ నప్పుడు దశరథుని పట్టపుదేవియగు కౌసల్య
ముఖ్యనిర్వాహకురా లగుటయే విశేషము. పురాతన
భారతస్త్రీలు ప్రాభవమున వెలయుచుండిరి. ప్రాచీనకాల
మునఁ జెల్లుచుండి యిపుడు నశించిన యమూల్యసంప్రదాయము
లలో నిదియొకటి. స్త్రీలప్పు డున్నతపదవి నుండిరి. అట్లేయిప్పు
డు వారుండవలయు. బాలురయభివృద్ధికి సాధనంబుగాఁ

చెల్లులు కారణంబులు. బిడ్డలను వారు సన్మార్గమున నడు
పఁగలరు గావున నాఁడువారి నున్నతదశకుఁ గొనితేవల
యును. ఇది భారతవర్షోద్ధారణమునకు నవశ్యకమగు
సంగము.

38. అశ్వమేధంబుఁగావించి భూవరుండు పుత్త్రికా
మేష్టిని జేసె. అట్టియెడ దేవతలు పితామహుని జేరి "దేవా,
రావణవధోపాయము చేయుము. ఆమహారాక్షసుఁడు
నీయొసంగిన వరప్రాభవమున ముజ్జగమ్ములఁ గడగండ్ల
ముంచెఁడు. సూర్యుఁడు వానికివోడి వానిపై వేఁడిమి నెఱ
పఁడు. గాలియు వీవ భయపడు. అన్నిశాచరునిగన్న సము
ద్రుఁ డలలను నేరముగ ధరించియుండియుఁ గదలవెఱచు
ను. అట్టి త్రిలోకకంటకుని జంపింపుమా." అని వేఁడిన బ్ర
హ్మ వారి కిట్లనియె. దశవదనుఁడు నరులచేఁ జచ్చును గాని
యొరులచేఁ జావఁడు. మనుష్యేతరులచే మరణంబురాని
యట్లు నేనిచ్చిన వరంబులు వానినిఁగాచు. మదాంధుఁడై
మనుజులనరకు సేయక వారు దన్నెదుర్కొన నేరరని తలంచి
వరంబడుగునప్పుడు వారిని జేర్పఁడయ్యె. కావున
మానవులు వానిని జంప వలయునని పలుకుచుండ విష్ణు
మూర్తి శంఖచక్రగదాధారియై ప్రత్యక్షమయ్యె.

39. శంఖచక్రగదలు విష్ణుమూర్తికి చిహ్నము
లు. ఈచిహ్నములను విష్ణుదేవాలయము లందు మీరు

చూతురు. వాని యర్థముల మీారరయ వలయు. ఈవ స్తుత్రయంబు లోకరక్షకుండగు పుండరీకాక్షుని విగ్రహ ములందు హస్తముల నిరంతరముండును. ఇవినిరర్థకము లుగావు. అవియీాశ్వర శక్తిసూచకములు. శంఖము శబ్ద సూచకము. శబ్దము రూపముల సృజించుశక్తి. శబ్దము చేఁ బ్రకృతి రూపముల గ్రహించును. చక్రము సంహార సూచకము. జగంబులఁ బగులఁ జేయు మండలస్పందన శక్తి. గద యధికారసూచకము. ప్రపంచముల రక్షిం చుచుఁ బ్రపంచా ధారముగ నుండి దానిని గాపాడుశక్తి.

౩౬. ఇట్లు ప్రసన్నుఁడై కనఁబడి విష్ణువు దేవతలంగని నేనులోకమున మానిసినై పుట్టి రావణుని జంపెద. దశ రథరాజునకు నలుగురు కొమరులుగఁ బొడమెద. అని యభయంబిచ్చి తిరోహితుండయ్యె.

౩౭. అట యజ్ఞప్రణీతాగ్నినుండి దేదీప్యమాన విగ్ర హుఁ డొకఁడు దివ్యపాయసపూరిత కనకపాత్రమును హస్తమునధరించి వెలువడి రాజున కిట్లనియె. ఏను ప్రజాపతి పంపినదూతను. ఈపాయసము నీసతులకు ము ద్దారకిమ్ము. అని యంతర్ధానము నొందిన నానంద భరి తుఁడై ధరణీకాంతుఁడు నిజకాంతాత్రయంబునకు దానిని బంచి యిచ్చిన వారుం బరిగ్రహించి గర్భములఁ దాల్చిరి.

౩౮. మఱియు దేవతలా విష్ణుమూర్తి యవతార మునకు సహాయముగ రావణ వధోపాయములఁ బన్నిరి. రామరావణ యుద్ధములకు సంగములనేర్పాటుచేసిరి. దానిచే దేవాంశసంభూతులైన నానావిధ భూతములుజనించె. అవి దేవతాశక్తులు గలిగి మృగరూపములను ధరించిన భల్లూకములు, కోఁతులు. వాని శక్తిలోకమందలి సాధారణ జంతుశక్తుల మించినది. అవి కామరూపములు. భువర్లోకభూతములు భూలోకమునఁ బుట్టె. వారిలో వాలిని వాసవుఁడు సృజించె. సూర్యుఁడు సుగ్రీవునిఁ బుట్టించె. వాలి సుగ్రీవులు వానరరాజులు. వారికథలను మనము చదువుదము. దేవశిల్పియగు విశ్వకర్మ వలన నలుఁడుదయించెను. నలుఁడే వనరాశికి సేతువు కట్టినవాఁడు. వాయువు వలన హనుమంతుఁడు గలిగె. హనుమంతుఁడు కీర్తిమంతుఁడు. వారు బ్రహ్మచే నప్పుడు పడసిన వరంబున వానరము లిప్పుడును నీదేశమున దేవాలయములందును, నుద్యానము లందును స్వేచ్ఛావృత్తి విహరించుచుండును.

౩౯. ఇట్లు రాముని రాకకై సర్వప్రయత్నములు సిద్ధములయ్యె. అనిన నంతేవాసిగణంబు లనంతర కథాక్రమం బెఱింగింపు మని వేఁడుటయు నని వసంతమాంబ వారి కిట్లనియె.

మ. లలిత శ్యామల నీరద ప్రియతనూ లావణ్య సౌంద
[ర్యుఁ డు
జ్వలత్పీతాంబరధారి సర్వజగదావాసుండు శ్రీవత్సనా
గళచిహ్నాంకుఁడు కౌస్తుభాభరణుఁడుక్ గామోదకీ
[ప్రాంచద్జ
న్య లసత్ఖడ్గ ధనుస్సుదర్శన ధరుం డావాసుదేవుం
[డాగెన్.

---

# బాలకాండము.

## రెండవ యధ్యాయము.

క. శ్రీవరుఁడు బ్రహ్మగురుఁడును
దేవ గణ శిరః కిరీట దీపిత పాదుం
డీవరుఁడు క్షమాగత నా
నావిధ నిబిడాఘభార నాశంకరుఁడున్.

౨౦. వసుంధరామనోహరుఁ డగువిష్ణువు భూమి పై నవతరించు నని కౌతుకమున లోకులెల్లరును, గొడుకులంగను తమిచే నెదురుచూచుచు దశరథుండును నయోధ్యలో సుఖంబుండిరి. తాను యెల్లెడల నిండి యుండియుఁ దాను సర్వమునకు రక్షకుఁ డయ్యు దశరథుని రాణుల గర్భముల నెలకొని యుండు కుమారులందుఁ దన చైతన్యమును నెఱపి తన్నిదర్శనమున లోకాభివృద్ధిని జేయ నారాయణునకుఁ బ్రియమయ్యె.

౨౧. క్రమంబున నెలలు నిండె. అంత సూర్యుండు మేషమందును, చంద్రుండును గురుండును గర్కాటకమునందును, అంగారకుండు మకరమందును, శుక్రుండు మీన

మందును, శని తులయందు నుండఁ గౌసల్యకు దివ్య
తేజోబల సౌందర్య సుకుమారుండగు కుమారుండు జనా
ర్దను నర్ధాంశమునఁ బుట్టె. అంతఁ గైకకొక్క కొడుకును,
సుమిత్రకుఁ బుత్త్రద్వయంబు నుదయించిరి. పురుషోత్త
ము ధర్మసత్య విశ్వాస శౌర్యము లనుగుణచతుష్టయంబు
నాల్గురూపంబులం దాల్చిన ట్లాయన్నదమ్ములు నలుగురు
నొప్పిరి. వసిష్ఠుండు వారికి యథావిధిగ నామకరణంబు
సేసె. కౌసల్యాసూనుఁడు రామాభిధానుఁ డయ్యె. కైక
సుతుఁడు భరతుం డనంబరఁగె. సుమిత్రాపుత్త్రయుగళం
బునకు లక్ష్మణ శత్రుఘ్ను లను నామంబు లిడిరి.

౨౨. అయోధ్యానగరం బప్పు డానందముల వెల్లి
విరిసె. రాజమార్గములం దెల్లెడల నృత్యములు సల్పిరి.
ఆటలాడిరి. పుడమిఱేఁడు ప్రజల నెల్లర భోజనమ్ములం ద
నిపె. బ్రాహ్మణులకు నగణ్యధనములు దానము లిచ్చె.
రమణీయక్రీడావినోదు లై యప్సరోగంధర్వు లాటలు
నానందకర మగు గానము చేసిరి. జయార్భటుల చేతను నవ్వు
ల చేతను నాకాశంబు నిండె. శ్రీరాముఁడు తాను దమ్ము
లతో జనియించె నని నరులు సురలు సర్వభూతములు
సంతసించిరి.

౨౩. మహానీయులగు పురుషశ్రేష్ఠులు భూమియం
దుఁ బుట్టుచో ముజ్జగముల వారు నేకీభవించి సంతోషిం

తురు. ఇది యార్యావర్త దేశమునకు విశేషము గాదు. లోకమునందు, నానామతగ్రంథములయందిట్లగునని యిదియె గానంబడుచున్నది. మాయాదేవికి బుద్ధుఁడుదయించుతఱి దేవతలు గాన మొనరించిరి. మేరి కడుపున జీససుద్భవించినపుడు నివ్విధంబున వారామోదించిరి. పరలోకములు మనకు దూరమున నుండునవి గావు. అవి భూలోకము నావరించియే యుండును. కొన్ని వేళల నిహపరలోకముల మధ్యముననుండు తెఱ విచ్చిన పరలోకవాసులు మనతోఁ గలిసి మెలసి యుందురు.

౨౨. ఆకుమారులు వర్ధిల్లుచుండ వారికిఁ గాలక్రమంబున నెల్ల విద్యలఁ గఱపిరి. ఆవిద్యాభ్యాసబలంబున వారు పెద్ద పెరిగినప్పుడు దేశమునకు మేలు చేయఁజాలిరి. ఆవిద్యావిధానమును గమనించితిమేని యక్కాలమున మనదేశమున నెట్టి విద్యలు లోకయాత్ర కనుకూలము లని గ్రహించిరో మన మెఱుంగుదుము. ఆవిద్య నేర్చిన వారు రాజకుమారులు గాని వానప్రస్థులు గారు. సన్న్యాసులును గారు. వారు గృహస్థులై వర్తింపఁ గలవారు. జగన్నాటకమున నాడఁగలవారు. అట్టివారికి శిక్షించిన విద్యలవలన బాలురను, మంచి గృహస్థులుగఁ జేయుక్రమ మిట్టిదని తేటపడును. ఆకాలమున నన్నిటికి మున్నుగ సదాచారములు నాముష్మికధర్మములును బోధిం

చుట ముఖ్యమని పాటించిరి. ఆ రాజకుమారులును వేద పారంగతులైరి. ఎల్లప్పుడు మెలఁకువతోఁ బనులను జే యాచరించవలయుననియు నేర్చిరి. మఱియును సమస్తకళ లందును జక్కఁగ శిక్షితులైరి. అస్త్ర శస్త్ర ప్రయోగో పసంహారక్రమంబునను సారథ్యమందును నశ్వారోహణము నందును బారీణులైరి. సంపూర్ణవిద్య నాలుగు భాగంబు లుగ నెలయును. అవి వరుసగాఁ బారమార్థిక జ్ఞానసాధ నము, సదాచారాభ్యాసము, బుద్ధికౌశల్యాభివృద్ధియు, శరీరదార్ఢ్యసంపాదనము ననునవి. ఈ నలుఁదెఱఁగుల నేర్చి రాజనందనులు సర్వజనానందాస్పదులై జన్మ మున మేటిమగలై వెలసిరి. దశరథుఁడు సుతులం గని హృదయమున నతులానంద మందుచుండెను.

౮౫. ఈనాలుగు శిక్షలలో దేహారోగ్య సంపాద నము ముఖ్యమని ప్రాచీనగ్రంథములు నొక్కి ఘోషించు చున్నవి. దీనియం దిక్కాలమున నశ్రద్ధ చేసిరి. బాలునకు బుద్ధియెట్లు కుదురవలయునో యట్లు దేహమును దృఢ ముగఁ గుదురవలయును. శరీరమారోగ్యవంతమును బలి ష్ఠమును సౌష్ఠవమును నై యుండినం గాని నరున కొండెలు సత్కార్యసాధనము గాదు. శరీరము దుర్బలమైన బుద్ధి కుశలతయు లోపించును. శరీరము మనకు లోఁబడి మనసు నియమించు పనుల మెలఁగవలయు. దీని నెల్లరంగీకరించ

లున్నతస్థితికి రానేర రనియు నీపాఠశాలాధ్యక్షు లెఱిఁగి యే మీకు ధర్మగ్రంథముల నేర్పుదురు. మఱియు నీపాఠశాలయందు సదాచారములఁ గఱపియు బుద్ధికుశలతఁ గలిగించుమార్గములందును బాలుర శిక్షింతురు. ఇంతియ కాదు. అట్లు సామును నేర్పి విద్యార్థుల దేహములఁ దీర్తురు. ఇట్టి చతుర్విధవిద్యల నేర్పి పూర్వఖ్యాతివహించు సజ్జనులు భరతఖండమున నెగడుదురు గాక.

౪౭. దశరథుఁడు నలుగురుకొడుకుల యభివృద్ధిఁ గాంచి మనంబున నతులానందమందుచు వారిని గారవించి చూచుచుండియు వారలలో సద్గుణము లుత్తమోత్తమముగఁ [illegible] రామునియందుఁ గడుఁగూరిమితో వర్తించుచుండెను. అన్నలును దమ్ములు జతలుగఁ గూడి రామలక్ష్మణు లొక్కటిగ, భరతశత్రుఘ్ను లొక్కటిగఁ గలిసి [illegible]తురు. లక్ష్మణుఁడు రాముని బహిఃప్రాణముగ నా[illegible] మన స్సెఱింగి యెల్లప్పుడు శ్రద్ధతో వర్తించును. తాన సౌఖ్యముల నరకుసేయఁడు. రాముని విడిచి నిద్రపోఁడు. రాముఁడు తిననిరుచిగల భక్ష్యముల భుజింపఁడు. రాముఁడు గుఱ్ఱమెక్కి వేటకై వెలువడిన లక్ష్మణుండును గ[illegible] వెనువెంటఁ దగిలి విల్లుంబూని వానిని గాచుచుండును. ఆతెఱంగున లక్ష్మణుని సోదరుఁడు శత్రుఘ్నుఁడు భరతునియెడ వర్తించి తన ప్రాణములకంటె నెక్కుడు ప్రియంబునఁ గొలిచి యుండును.

౭౮. వాల్మీకి రామాయణమందు లేని రామచంద్రుని కథ యొకటి తెలియ వచ్చెడి. చదువు లెల్లఁ గ్రమంబునఁ జదివిన వెనుక రాజ్య వైభవమును యౌవన ప్రమదంబును ననుభవింపఁ దగిన సమయమున రామునికిఁ బెను వైరాగ్యము తోఁచి మార్దవము, ఇంపితము, అణఁకువయుఁ గలవాఁ డయ్యె నెక్కడా సినేని నరకు సేయక యెందును బ్రియంబందక సర్వతో విముఖుఁడై యుండె. అన్నింటియం దుదాసీనత వహించును. లోకమునందలి రమణీయవస్తువులం బాటింపక విసికి కన్నుల మరలించును. తండ్రియుఁ దమ్ములు వాని కుత్సాహంబుఁ గుదుర్ప నమకట్టి వానిఁ బ్రమోల నలుఁగెలంకుల వినోదములఁ గూర్చిన నవి యెల్ల వ్యర్థములయ్యె. ఉపాధ్యాయులు, సహవాసులు వాని కక్కఱ గీలుపఱుపఁగడఁగిరి గాని వారి ప్రయత్నములు నిష్ఫలములయ్యె. రాముఁడు వివిక్తదేశమున నొంటరిగఁ గూర్చుండును. చూపుల జాఱవిడుచు. తలవ్రేల విడుచు. ఇట్లు రాముండు వైరాగ్యమున మునింగియసత్తు ననిత్యమునగు ననాత్మయందు వెగటుపడియె. నిత్యసత్య తత్త్వము నెఱుంగ నువ్విళ్లూరుచుండె. నిస్పృహాయను సముద్రమునుండి యుద్ధరించి ఋషిశ్రేష్ఠుఁడగు వసిష్ఠుఁడు రాముని నిత్యతత్త్వజ్ఞానమను రమణీయారామమునందు

విహరింపఁ జేసెను. ఇదియంతయు యోగరహస్య సారమ యగు యోగవాసిష్ఠమున నున్నది. దీనిని ముముక్షు వారై చదువవలయును. ఎట్టకేలకు రాముఁడు మేలుకొని విషయలోలుఁడు గాక జ్ఞానియును జ్ఞానస్వరూపుఁడునై లౌకికవ్యాపారములలోఁ దండ్రికిఁ దోడుపడుచుండెను. ఈ మెలఁకువకుఁ గారణమా ముని యొద్ద శ్రీరాముఁడు బ్రహ్మాత్మవిద్యను సాధించి శాంతినొందుటయే. ఆత్మజ్ఞానము సంపూర్ణమయి నప్పుడు విషయములన్నియు నిరర్థకములనియు సుఖదాయకములు గావనియు జ్ఞాని చక్కఁగ నెఱింగినవాఁడయ్యెఁ బామరులకు విషయసుఖములును క్రమక్రమముగ జ్ఞానసాధనము లగునని తెలిసి పామరులకంటె నెక్కుడు శ్రద్ధతో లౌకికకార్యముల నెల్ల నెఱపెను. తనకై ఫలాపేక్ష కొంచెమైన లేక యాత్మయందే యాత్మానానంద మందును.

౪౯. అన్నివిధముల నిట్లు రాముఁడు సర్వజ్ఞుఁడై యుండి నంతన లోకోపకారము చేయు సమయ మాసన్నమయ్యెను.

౫౦. అంత నొక్కనాఁడు మనుజేశ్వరుఁడు మంత్రులు గొలువుండి రాముని పెండ్లిమాటల మాటలాడుచుండ సంయమీశ్వరుఁడగు విశ్వామిత్రుఁడు రాజద్వారమును జేరవచ్చి ద్వారపాలకులఁ బిలిచి మీ రేగి నా

రాకను రాజునకుఁ దెలుపుఁ డనిపుత్తెంచిన వారట్లు గావిం
చిరి. ఆతపసి చరిత్రమును * ముందు మీ రెఱుంగుదురు
గాక.

౫౦. సంయమి సమాగమమునకు సంతసించి యు
పాధ్యాయసహిత సంభ్రమమునఁ బ్రత్యుత్థానముసేసి య
మ్మహాసీయునకు విధివిధానమున నర్ఘ్యాది పూజలను
గావించి సదనములోనికిం దోడుకొనివచ్చి యుచితాసన
మునఁ గూర్చుండఁబెట్టి యుక్కలిలో నిట్లనియె. మహాత్మా!
నీరాకఁ గడలుకొను భక్తి కేటపడ నిన్నెట్లు పచరింతు?
నీయభీష్టం బెయ్యది? నీ కేనేమి యొనరింతును? ఎల్ల
విధంబుల నీకోరికలఁ దీర్చెద. నీవే నాకు దైవమ వని
కొంకు లేక యాలోచనయు లేక మాట యిచ్చెను.

౫౧. దానిని విని చిఱునగవు మొగమునఁ జిగురొత్త
విశ్వామిత్రుండు భూకళత్రున కిట్లనియె. "రాజేంద్రా!
నోటిమాటలఁ జాలకనంగఁ బలికితివి. అట్లు కార్యము వెను
దీయక నీవు నెఱవేర్తువుగాక. నారాకకుం గతంబు వినుము.
ఏనొక్క జన్న మొనరించువాఁడ. దాని నే నారంభించి
నప్పుడెల్ల రాక్షసులిద్దఱు మారీచసుబాహు లనువారు
యజ్ఞకుండమున రక్తమాంసములఁ గురియుచు దాని నప
విత్రము గావించుచు నది పూర్తి కాకుండ బాధించు

* ఈ శతానందుఁడను మునివరుండు రామున కెఱింగించు ఘట్టమునందు.

చున్నారు. కావున భూవరా! నాకుఁ దోడుగ నీ పెద్ద కుమారుని రాముని బంపుము. రాముం డున్కృ దలిర్ప వారిని జంపును. రాముఁడు తప్పఁ దక్కొరు లీపనికి జాలరు. పదిప్రొద్దు లాయాగరక్షకై యున్నఁ జాలు. అంతలో జన్నము ముగియు. ఎల్లరకు మే లగు. రాముండు యుక్తవయస్కుఁడు. ఊర్జిత తేజస్కుఁడు. అట్లుగాన మానవాధీశ్వరా! రాముని నా కిమ్ము."

౫౩. అని మునివరుం డిట్లుకోరికఁ దెలుపఁ బలికిన నమ్మాటలు చెవులసోఁకఁగ భూకాంతుం డదరిపడి కొంతవడి మాటలాడనేరక యూరకుండి మనంబున నిట్లు తలపోసెను. వైరు లట్టిబల్లిదులఁట. పోరట్టి యసాయకమఁట. రాముని బంపుదునఁట. హా! నా రాముఁడు. నా తొలికూన. ఎలప్రాయంపు బాలుఁడు. ఇది నాదుఁ బని? అని మనంబునఁ గొంకి తొట్రుపాటున డగ్గుత్తికతో నిట్లనియె. ఓసంయమివరేణ్యా! నేనే చనుదెంచువాఁడ. నా సేనను దోడు తెచ్చెద. ఓకరుణానిధీ! ముదిమిమునింగి మద్దుకుమారులం గంటిని. వారిలో రాముఁడు నాహృదయమున కెంతయుఁ బ్రేమఁగూర్చును. కావున నాముద్దుపట్టి నెడఁబాయనోప. గాధేయా! "యా రాక్షసు లెవ్వరు! వారికిఁ బ్రాపెవ్వరు?" అని మనుజనాథుం డడిగిన మునినాథుండు రాముండు వినుచుండ నిట్లనియె. విశ్రవస

సుతుండును, రాక్షసకులనాథుండును, త్రిలోకవిజయుండు నగు రావణుండీ నాయజ్ఞభంగము తనకీర్తిని జిన్నఁబుచ్చునని దాని నాదరించక మారీచసుబాహువుల నందులకు నిర్ణయించెను. అనిచెప్పిన అన్నన్నా ! రావణుని మార్కొని పోరనేనోప. యుద్ధమున నారాక్షసుని నెదిర్చి నిలువనెవ్వరికి నసాధ్యము. దశముఖుని ముఖములవలోకించి యెవండు బ్రదుకనోపు. కటకటా ! రాముఁడా ! వేలుపుల చందమున నందము, బలమును గలవాఁడయ్యుఁ బసిపాపఁడు. నాకొడుకును నేవిడనాడనోపను.

౫౮. అనిన దశరథునితోడ విశ్వామిత్రుఁడు కఠినోక్తులతో నిట్లనియె. "తొలుత నాడియు నాడినమాట విడనాడెదు. రఘుకులసంభవుల కిది యనుచితంబు. దీనిచే నీయింటికిఁ జేటువాటిల్లు. ఇదె తొలఁగిపోయెదఁజుమీ. జనపాలా ! నీ వనృతమాడితివి. నీవు నీమిత్రులతో సుఖముగ నుండుము. అని పలికెను.

౫౯. బలవంతుఁడగు విశ్వామిత్రు నుగ్రకోపమునకు సభనున్న మునులు వడఁకిరి. లోకము లదరిపడెను. మహాత్ముల కోరికలను ఱచ్చపుచ్చిన నెగ్గులఁదెచ్చుఁగదా! వారు గోరునవి తమకై తాము గోరరు. లోకులమేలు దలంచియే కోరుదురు. వారి వాంఛితములు శ్రేయస్కరములు. అట్లగుటం జేసి వసిష్ఠుండు రాజును వారించి యు

ట్లనియె. "చేసినబాస త్రెంపరాదనుట మఱవకుము. నీ పుత్త్రుని విశ్వామిత్రున కొసంగుము. రాముని మేలు దలంచియే వాని నడిగెంగాని వలయునన్న ముని తనయజ్ఞమును గాపాడనోపు.

౫౬. అని యూరడిలంబలికినఁ బురోహితు వచనంబులఁ జేకొని దశరథుండు రాఘవుని విశ్వామిత్రున కప్పగించెను. అమ్మహానీయుఁడు పురంబు వెడలి చనుచు రామలక్ష్మణు లనుగమించి యనేకదినములు త్రోవ నడిచిరి. మార్గమునఁ జిన్నికుమారులు నిత్యకృత్యముల నొనరించుచు నుచితవిధంబుల మునినాథు నుపచరించి సంయమీంద్రు సంభాషణముల విని యానందించుచుండిరి.

౫౭. మార్గమున రాముండు మారీచుని తల్లియగు తాటకయను ఘోరరాక్షసిని దునిమె. విశ్వామిత్రునివలన ననేకదివ్యాస్త్రముల రహస్యమంత్రములతో గ్రహించెను. ఇట్లు నడిచి తుదకు సంయమీంద్రు నాశ్రమమును జేరిరి. విశ్రుతకీర్తియగు వామనమూర్తి యాశ్రమంబగు దానిమాహాత్మ్యంబును మునివర్ణించి రాఘవా! యిదె వైరులతో నీవు పోరాడవలయు నని యెఱింగించి యజ్ఞమారంభించిన రాక్షసులు పొడసూప మారీచునిపై నొక్కయమ్మునుబఱపిన నది వానివ్రాదయంబునఁ జక్కఁగ నాటి వాని మూర్ఛావివశునిం జేసి కనఁబడకయుండ సము

ద్రములోఁ బడవైచెను. మారీచుం డట్లు మరణమును ద
ప్పించుకొని భావికాలమున రామున కెగ్గొనరించును. అట్టి
సుబాహువు శూరకుమారుదాడికి నిలువక వానిమ్రోల
నేలంగూలెను. తక్కుంగల రాక్షసాధములు మడిసిరి.
అంత నధ్వరము సంపూర్ణమయ్యెను.

౧౮. జన్నము ముగిసిన మఱునాఁడు అందలి ముని
వరులు మిథిలాధిపుఁ డొక్కమహాక్రతు వొనరించెడు.
అందులకుం బోవుదమని నిశ్చయించి యామహీపతి కొక్క
మహాధనుస్సుగల దదియెంతయు నబ్బురం బని ప్రశంసించి
పలికిరి. గాధిసుతప్రముఖు లై మునులు మిథిలకుం దరల
రామ లక్ష్మణులు వారి ననుగమించి చనిరి. పోవుచో నం
దందు విశ్రమించు నెడ నాతాపసవరేణ్యులచే భూప
కుమారులు బహుకథల వినిరి. త్రోవలోని పుణ్యస్థలముల
చరిత్రములును, విడిదిచేయు నాశ్రమంబుల మహిమలను
దెలియుచు వెండియు మహాదేవు శిరస్సున గంగ యవత
రించుటయు, సగరోపాఖ్యానంబును, సగరకుమారచారి
త్రంబును, సాగరమథనంబును, నందుశివుండు విషమును
ద్రాగుటయు నెఱింగిరి. మిథిలాపురి దరియవచ్చుచో నిర్జ
నాశ్రమము నొండు గనిరి. అయ్యది పూర్వము గౌతమ
ముని తపోనిలయము. అం దమ్మునిభార్య యహల్యయను
నది దుర్వృత్తిఁ బ్రవర్తిల్లి యప్పాపమునకుఁగా శాప

మంది యదృశ్యయై రామునిరాకచేఁ దనశాపము విమోచన మగునని నిరీక్షించియుండె. శ్రీరాముఁ డాచోటు చేరిన నాకీమణి తొల్లిటిచందమున దేహమంది క్రమ్మఱ నిజనాథునిం గూడి సుఖంబుండె. పదంపడి తపోధనులు దాశరథులు మిథిలాపురిని ప్రవేశింప జనకుండు వారల స్వాగతం బడిగి పూజించిన మార్గమున రామ లక్ష్మణు లొనరించిన వీరకృత్యములఁ బ్రకటించి పలికి విశ్వామిత్రుండు అద్భుతగుణముగు ధనుస్సును రాముండు చూడఁ గోరెనని తెలియఁజెప్పె.

గో. అప్పుడు మిథిలలోనుండిన గౌతమ మునీంద్ర నందనుఁడు శతానందుఁడు నిజ జననీజనకులు క్రమ్మఱఁ గూడిరని విని యానందించి రామలక్ష్మణులకు విశ్వామిత్రుని మహామహిమము నెఱిఁగించె. కౌశికచరిత్రము చేఁ దెలియఁదగిన యంశము లనేకములుగలవు. జీవుఁడు సంసారయాత్రలోఁ దన్నుఁ దా నుద్ధరించుకొనఁ బట్టుదలతోఁ బూనెనేని తప్పక పరమపదమును జెందునని యామునివరుని కథచేఁ దెలియఁదగును. విశ్వామిత్రుఁడు క్షత్రియకుల సంభవుఁడు. గాధికుమారుండు. తండ్రిపిదప రాజ్యభారము వహించి గద్దియ నెక్కెను. రాజ్యము చిరకాలము పాలించునెడ నొక్కనాఁడు సేనయుఁ దానును బురంబు వెలువడి వసిష్ఠు నాశ్రమంబును జేరిన నమ్మునిశ్వ

రుఁడు మనుజేశ్వరు నాదరించి స్వాగతంబడిగి కొంతవడి సంతసమున సంభాషించి ధరణీశా! నేఁడు నీవు నీసైన్యము తోడ నిందు నాతిథ్యంబును గ్రహింపవలయునని వేఁడఁగా వసుధాధిపుండు మునినాథా! కనికరమునఁ దీపారు నీవచనంబుల నాకర్ణించి యాతిథ్యంబు గ్రహించినట్లే సంతుష్టహృదయుఁడనైతి నని పోవందలంచిన వసిష్ఠుండు నిలుమని నొక్కిపలికి యియ్యకొలిపె. వారల యాతిథ్యంబునకు వలయుభోజనాదివస్తువు లెల్ల శబలయను కామధేనువు గలిగించిన నాశ్చర్యమున వారందఱు విందారగించిరి. ఇట్టియావు రు జూచి విశ్వామిత్రుఁ డోర్వఁజాలక దానిని బడయఁగోరి వేలకొలఁది ధనంబు లిత్తునని చెప్పినను వసిష్ఠుండు తనకుఁ బెన్నిధియగు నాయావు నెడఁబాయ నోపఁడయ్యె. అంత మానవేశ్వరుఁడు ధేనువుపైనున్న యాశచే నధర్మమునకుఁ గడంగి దానిని బలిమి నైఁగొనిపోయిన నది విడిపించుకొని నిజస్వామిని జేరి అంకె వేసిన నారవమున ననేక భూతంబు లుద్భవిల్లి భూవల్లభు దండు నుద్దండపరాక్రమంబునఁ జెండాడిన సేనలో నందఱు మ్రిందిరి. సైన్యంబు శూన్యంబైనఁ గనిసి కౌశికుతనయులు నూఱుగురు వసిష్ఠునిపైఁ బడఁగా సమ్ముని నిమేషంబున వారినీఱుగావించె. అట్టిబ్రహ్మర్షి మహిమకు దిగ్భ్రమమంది యారాజెట్టకేలకుఁ బురంబునకుఁ గ్రమ్మఱి చని మనంబున వితర్కించి వసిష్ఠు

నోడించుపొంటెఁ దపంబొనరింపఁబూనె. వసిష్ఠుండును నిజ దండంబున బ్రహ్మతేజోబలంబు పొందించి భూపతి తపమ్ము వమ్ముచేసె. ఇట్లు తనక్షత్రియ బలంబు బెండుపడిన విన్నఁ బోయి మగిడి నిజనగరంబునకు గాధేయుండు పోయె.

౬౦. ఆవలికథ నట్లుండ నిండు. తొలుత సంకల్ప మాత్రమున వస్తువుల సృజించువిషయము నెఱింగించెద వినుండు. మనస్సును నియమించి సంకల్పించినచో మనము కోరువస్తువుల సృజింపఁగలము. సామాన్య వ్యవహారము లందును దొలుత మనస్సున భావించియే పనులొనరింతుము. కోరినపని మనస్సునఁ దీర్చుకొనియే పనులు చేయుదురు. వడ్లవాఁడు బల్లనొక్కటి చేయక మునుపు దాని రూపమును మనస్సున నేర్చుకొనియే చేయును. కొయ్యఁ గొని బల్ల చేయువడ్లంగికిని వస్తువులేకయే బల్లను జేయు వడ్లంగికిని నెంతయు నంతరమున్నదని తోఁచును. ఏమియు లేనిచో నెవ్వం డేదియుఁ జేయనేరఁడు. సహజముగ నేండ్లకొలఁది పట్టుపని నతఁడు సూక్ష్మకాలమున నొనరించును. దీని నుదాహరణముతో వివరించి చెప్పెదను. చెట్టులోని యాఁకులు గాలిని లోనికిఁ బీల్చి స్థూలము లగు రేణువుల నిలిపికొని మిగత భాగమును దొలఁగఁ ద్రోయును. ఈస్థూల రేణువులు చేరుచుఁ గ్రమక్రమముగ కొయ్య యెదిగి ముదురును. సహజముగ నింత కాలముగ

నింతకాలము పట్టుచుండ సంకల్ప సిద్ధి గలపురుషుఁడు బాహ్య ప్రపంచమందలి నైసర్గిక శక్తులను వశపఱచుకొని తాను సృజింపఁగోరు వస్తువునకు వలయు స్థూలరేణువుల గాలినుండి గైకొని వాని నన్నింటిని నిచ్ఛామాత్రమున సృజింపనోపును. తొలుతఁ దాను జేయనోపు వస్తురూపమును మనస్సున స్థిరముగ నిలుపుకొని దాని యందుఁ దాను సంకల్పశక్తిచేఁ జేర్చిన స్థూలరేణువుల నిమిడ్చి తాఁ గోరువస్తువును సృజించును. ఇట్టిపనులు పూర్వకాలమందు వలె నిప్పుడును సాధ్యములు. దీనిని నే నెఱుంగుదు. ప్రాచీనగ్రంథములందు నిట్టి సిద్ధుల వర్ణించియుండఁ జదివి వానిని నమ్మక నవ్వువారలు తమ యజ్ఞానము దాము ప్రకటింతురు. ఎఱుకలేనివారు నవ్విన మీరు భయంపడకుఁడు. మనస్సుల దార్ఢ్యము గలిగి వారిని సరకు గొనకుఁడు.

## విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షి యగుట.

౾౧. ఇఁకఁ గథ వినుఁడు. అట్లు విశ్వామిత్రుఁడు బ్రాహ్మణముని శ్వరునకుఁ గ్రిందుపడి బ్రహ్మతేజస్సును సాధించెదఁగాక బ్రాహ్మణుఁడ నయ్యెదఁ గాక యనినిశ్చయించి యింద్రియముల నిగ్రహించి తపంబునకు సమకట్టె. చిరకాలమునకు బ్రహ్మ వాని పూనికమెచ్చి రాజ

బడసె. పెనుఁకువగలిగి యెడతెగని ప్రయత్నములఁ జేసి జీవుఁ డాత్మసాఫల్యమును ద్వారలోఁబడయు ననుట కితని చరిత్రము యెల్లప్పటి కుదాహరణము.

౬౨. జాతికి నైజము లగున ధర్మములఁ దనశీలములఁ బ్రకటించునతండే యాజాతిని యథార్థమున నుండనోపు. బ్రాహ్మణకులమున నూఱుపుట్టుకలఁ బుట్టియు నరుఁడు విషయాభిలాషు లనుశృంఖలములఁ దెగనఱకఁడేని, కోపవచనముల విడనాడఁడేని, వాని శీలము పరిశుద్ధము కాఁడేని, బుద్ధి వానియందు వికసింపదేని వాఁడు బ్రాహ్మణుఁడు కానేరఁడు. బ్రాహ్మణకులమున జన్మించక యుండియు నాజాతి గుణములు కలవాఁడు బ్రాహ్మణుఁడగును. జాతిధర్మములు లేనిచోఁ గులమును మాత్రము మహాత్ములు గణింపరు. తాత్త్వికముగ విచారించినచోఁ జాతుర్వర్ణ్యవిభాగము సూక్ష్మదేహమునకుఁ గాని స్థూలదేహమునకుఁ గాదు. స్థూలసూక్ష్మదేహములు రెండును వర్ణమునకు జతపడియుండిన నతండు సుఖయోగు పుణ్యపురుషుఁ డనఁదగు. అట్లారెండును జేసుచో గుణములు లేక యుత్తమకులమునఁ బుట్టువాని కంటెను గుణముల నుత్తముఁడై తక్కువకులమునఁ బుట్టినవాఁడు మేలగును. అట్లు శతానందుఁడు రామునకు విశ్వామిత్రు మహిమలం దెలిపిన నతఁ డానందించెను.

౬౩. మిథిలానగరమున రాముసకుఁ బెండ్లియగును. న రునకు వివాహ మెంతయు సంతోషసమయము. అట్టిసం తోషకాలము రామున కాసన్నమయియుండునది. అతఁ డు వివాహమున కర్హుఁడు. విద్యాభ్యాసము సమావర్తన మున ముగిసె. దేహపటుత్వము పౌరుషలక్షణమును రా కుసులలయందునఁ గన్పడెను. ఇట్లు మెఱయువాఁడు పత్ని ని జేకొనిగృహస్థుఁడై పౌరుషధర్మములఁబూనుటొప్పు. పురా తనకాలమున నిదియే విధిగా నుండెను. అప్పుడు విద్య నే ర్చుకొను ప్రాయమున బాలునికి వివాహమును జేయరు. బ్రహ్మచర్యవ్రతంబుననే యతండుండవలసె. చదువరికి నస్థలితవటువృత్తియే నిర్ణీతము. ఇదియే మార్గమని సర్వ శాస్త్రసమ్మతములగు యుక్తులచే స్థాపింపనగును. బాలుని దేహము కోమలము. విద్యాభ్యాసమును బూనికతోఁ జే యుటయు, దాంపత్య ధర్మాచరణము ననుసరించును రెండను విధముల దేహాయాసమును గలుగఁజేయును. ఈరెంటికి నో ర్చుకొనుటకు వాని దేహము తాళదు. ఇప్పుడా న్యాయము నతిక్రమించుచున్నారు. కావున నీరెండుభారముల నేకకాల మున వహింపఁ జేయుటచే వారు యౌవనమున దుర్బలు లగుదురు. వారికి ముదిమి శీఘ్రమునఁ బ్రాప్తించుచున్నది. ఇదియెల్లరకుం దెల్లము. లోకానుభవసిద్ధములగు నైసర్గిక ధర్మములు శాస్త్రరహస్యములవలె నీశ్వరానుశాసితము

లు గావున వానిని నిరాకరించియుసుఖంబున నుండఁ జెల్లు
నే. ఇప్పుడరయ భరతఖండమునందు నించుమ్రాయమున
నుండుమనుజులు దుర్బలు లగుటనుజూడఁగా "విద్యార్థిబ్ర
హ్మచర్యవ్రతము నుల్లంఘింపఁగూడదను సనాతనసద్ధర్మ
మును నిరాకరించిన దుష్కర్మమువలనిఫలములఁ జూపె
దఁ జూడుఁడీ" యని వారి దుష్కర్మము ఘోషించి విశ
దీకరించెదునని తోఁచెడి.

౬౮. మఱునాఁడు జనక జనపతి యతిథిపూజలఁ జేయ
వచ్చినవేళ గాధేయుండు మహావిశ్రుతిం గాంచిన మహా
దేవుని యాశ్చర్యకరమగు శరాసనముం బ్రశంసించి రాజా!
రామునకు దానిని జూపవేయని వేఁడినఁ బుడమిఱేఁ
డిట్లనియె. ఇదిశివునివిల్లు. శివుఁ డీధనూరాజమును దక్షుని
యజ్ఞకాలమున దేవతలకొసంగెను. దానిని దేవతలు నా
వంశమునఁ బుట్టినదేవరాతున కిచ్చిరి. అదిమొదలుగ నా
మేటికోదండము మాయింట నున్నది. అంత నేనొక్క
నాఁడు యజ్ఞభూమి విశుద్ధ్యర్థము దున్నుచుండఁ జాలు
నుండి యనుంగుఁ గన్నియ పొడసూపె. అదియ సీత.
నాతనయఁగఁ బెంచెద. శివుని విల్లు నెక్కుపెట్ట నోపు
బల్లిదుఁడు సీతఁ బెండ్లియాడఁ గలఁడని నిశ్చయించిన
వాఁడ. రాజులు రాజకుమారులు పెక్కండ్రు ఆపనికిం

బూని విగతాశులైరి. అని జనకుండు పలికిన మునివరుండును
సంశయింపక యాయుద్దండ కోదండమును రామునకుం
జూపు మని కోరిన జనకు నాజ్ఞచే నావిల్లును బుష్పమాలా
లంకారసుందరమగు మందసమున్న దానిం బెక్కురు నిడికొని
తెచ్చిరి. తెచ్చినం గౌశికుండు రామునింగని " రామా !
యీమహాధనుస్సును జూడు " మనిన నందనుండు ప్రేమతోడ
విశదవికచారవిందనయనములం జూచి " విల్లును జేకొందు
మునా " యని యడిగెను. జనపతియు మునిపతియు సరే
యనిరి. రాఘవుండు పెట్టెనుండి కోదండమును గ్రక్కున
తప్పక యెక్కుపెట్టి నారిలాగుచో విల్లు పెటపెట విఱు
గుచు విఱిగె. ఆచప్పుడు మేఘనాదంబు చందంబున మిన్ను
నెగడి యొప్పె. ఇతరులు చేతుల నెత్తనోపని యట్టి దా
ను చాపంబును దునుమనోపిన పసి పాపని శక్తికి సర్వజనులు
వెఱగందిరి. అందఱాశ్చర్యమునం దోఁగి యుండ భూపాలుఁడు
మునికిట్లనియె. నాయనుంగుఁగూఁతు సీత విల్లెక్కు వం
చిన వాని సొమ్ము. వేవేగ దశరథుని రామ వివాహమును
నడిపి వధూవరుల నాశీర్వదింపంగ రప్పింపుము. అని మహా
త్ముండై పలికినం దగువారట్లు లేఖలం గొని చనిరి.

౬౫. జనకనరపాలుని శుభలేఖను దశరథనరపా
లుండు సంతుష్ట హృదయుండై యాదరించి మంత్రు

కన్నియ కీర్తితో వఱలుఁ గావుత మన్న నరేంద్రుమాట
[లలుక,
విన్ననువొప్పఁ జెల్లె రఘువీరుకతంబున గారవంబునన్.

ఉ. అంతటఁ దోడఁబుట్టువులు మహావిభవాఢ్యులు కోసల
[లావనీ,
కాంతుకుమారు లాత్మ కరకంజములన్ సుకుమారకన్యకా,
కాంత కరాంబుజాతములఁ గైకొని భక్తిని నగ్నిహోత్రున,
త్యంతముదంబు దోఁపఁగఁ బ్రదక్షిణముం బొనరించుచుండఁగన్.

ఉ. ఇందిర లోకమాత జనియించెను సీతగ భూమి నాజగ
త్సుందరియున్ ముకుందుఁడు వసుంధరయందు వివాహబాంధవా,
నందముఁ బొంది పొందిక మనంగలరంచు నిలింపబృందములన్,
దుందుభిమ్రోఁతచేసి విరితుంపరఁ జేసి సుఖించిరత్తఱిన్.

౬౬. ఇట్లుద్వాహము లెలమిని సంపూర్ణమయిన మఱునాఁడు పెండ్లి వియ్యాకులు నూతనదంపతులు మహోత్సవంబున నయోధ్యాపురమార్గముంబట్టి ప్రయాణమయిరి. త్రోవలో నబ్బురంబొప్ప నొక్కయెడ నలుఁ

గెలంకులఁగలఁతలు గలిగించు శకునములు తోఁచె. సుడి
గాలిభయంకరముగ వీచె. నేలకంపించె. సూర్యబింబము
నఁ జీఁకట్లు కప్పె. ఆకాశమున భస్మవర్షముగురిసె. ఎల్ల
వారు త్తలపాటొందిరి. అంతఁ బరశురాముఁడు భీమాకా
రమునఁ గ్రాలుచు మహాకార్ముకమును జేతఁ బూని మూ
పురమున గ్రొడ్డలిమోపి వచ్చినఁ గోపదీపితుఁ డగువానిని
బురోగమను లగు మునివరులు పూజించిరి. జామదగ్న్యయు
రామునిఁ జేరఁడి పిలిచి యిట్లనియె. "రామా! నీవావిల్లుం
దునిమితివని వింటిని. ఇదినావిల్లు. దానిజత. దీనినెక్కు పె
ట్టుము. తొల్లి దేవశిల్పి యగువిశ్వకర్మ రెండు కోదండా
బులనిర్మించి యుమాపతికిరమాపతికి నిచ్చె. విష్ణువు తన
గానయమ్మును భృగు తనయున కొసంగె. నాఁటంగోలె
మాకొలముననుండి నన్నుం జెందినది. శైవ చాపమును
ద్రుంచినట్లురామా! యీయుద్దండ వైష్ణవకోదండమును
సంధింపనోపుదే. అట్లేని నితోఁబవరంబున నేఁ బోరెద.
నావుడు రాఘవుఁ డామహాధనుస్సును గ్రహించి నారి
నెక్కిడి శరసంధానముచేసి యంతలో భార్గవుఁడు బ్రా
హ్మణుఁడుగదా, పోరికిఁజీరినను విప్రునిఁ జంపరాదని
చింతించి రఘురాముఁడు భృగురాముని నిశ్చలదృష్టి
తోఁ జూచియిట్లనియె. మునినాథా! నీదగువాయుగమన
శక్తిని దునుమాడుదునా, కాదేని నీవు తపోమహి

ముచేఁ బడసిన యూర్ధ్వలోకవాసమునకు భంగముం గలి గింతునాయని పరవశమందుచుండె. అప్పుడు కుమార రాముని నిశువాలుఁ జూపులు పరశురామునికడిఁది బలంబును జూఱలాడిన వృద్ధరాముఁడు తనబలనాశనమగని యాచిన్నికుమారునకు నమ్రతతోఁ బ్రెమొక్కి— దేవ దేవా! భువనత్రయనాయకా, నీవు నాయందవతరించిన పనిముగిసె. విష్ణుమూర్తి తొల్లింటియవతారమునందు నా యందు నెలకొల్పినశక్తిని గ్రమ్మఱ నాకర్షించెను. నీకే నె ట్టినాటి రామా, నీవే మేటివని యనేకవిధంబులం సంస్తుతిం చి తపంబున కేగె.

౬౭. పరశురాముఁ డోడి యేగిన వినువీథి సూర్యరశ్మి కనఁబడెను. అందఱు సంతసించిరి. భూవల్లభుఁ డు సపరివారముగఁ దరలి యయోధ్యానగరమును జేరె ను. పురలక్ష్మి లలితాలంకారముల వెలుంగుచు నావధూ వరులకు స్వాగతమిచ్చుచున్నంచె. కౌసల్యా కైకేయీ సుమిత్రలు వీరమాతలు గారవమునఁ గుమారులను ముద్దు గోడండ్రను సంతోషములఁ జేరఁదీసి ప్రేమతో విందులు గావించిరి. రాజమందిరమున నమందానందంబిట్లు చిందు వాఱె. అప్పుడు రాముఁడు స్వధర్మము నాచరించుచు నె ల్లచోట్లఁ బ్రేమను గడించుచుండె. వానిమనస్సులో నెమ్మది నాటి నిల్వఁగా సీతతోడ నతులసౌఖ్యములతో నహో

ధ్యయుం డుండె. ఏమనుజుఁడు రామమూ ర్తికి నప్పుడు సౌఖ్యసంపదలయందు సమానుఁ డగును? వార లట్లు కొన్ని దినంబులు సుఖింతురు గాక. అక్కటా! మబ్బులు త్వరలోఁ బైకొని వానికమనీయభాస్కర రశ్మినిగప్పె. ఇప్పుడు వారు సుఖింతురు గాక.

అనిన నది యెట్లు వినవలతుమని బాలురు వేఁడిన నని వసంతమాంబ యిట్లనియె.

చ. అనఘవసిష్ఠ బోధితనిరంతర నిత్యసుఖాభిలాషునిన్
ఘనతరగాధినందనమఖప్రియ రక్షణ దక్షకార్ముకున్
జనకవసుంధరాధిపతి సంస్తవపాత్రశుభాంగునిం ద్రిలో
చనవరచాపఖండనయశఃపరిపూరితు బ్రహ్మచర్యునిన్.

శ్రీ. శ్రీ. శ్రీ.

---

# అయోధ్యాకాండము.

## మూఁడవ యధ్యాయము.



క. శ్రీ లక్ష్మీదేవీ భా
గ్యాలంకృతజానకీహృ దారామ శ్రీ
డాలోలుఁ బరశురామా
భీలమదగ్రహణఖేలుఁ బృథులక్ష్మపాళున్.

ఉర. శ్రీరాముని లక్ష్మణుని విడిచి భరతుఁడు తన మేనమామ యగునశ్వపతి పొంతఁ గొన్నిదినంబులుండ శత్రుఘ్నునితోనరిగె. రాముఁడు యౌవన తేజంబుల నున్నతస్థితిఁ గ్రాలుచు శీలమున లోకోత్తరుండై యసాధారణస్వప్రకాశమున వెలిఁగెను. రాముఁడు నిర్మలాత్ముఁడు. మృదుభాషణుఁడు. నిష్ఠురవచనములకు మాఱుగ్గా నిష్ఠురములాడఁడు. ఉపకారమొక్కటియైన తనకొనరించినవారియెడఁ గృతజ్ఞతను జూపును. అపకారములు నూఱుచేసినను వానిని బొత్తిగ మఱచును. ఆపుణ్యవర్తనుఁడు పుణ్యశీలురను, వివేక వంతులను వెదకి వారితోఁ బొందొనరించును. బలధైర్యముల యుద్ధతిచే గర్వింపఁడు. రామచంద్రుఁడు సత్యసాంద్రుఁడు. పెద్దలను గౌరవించును. పితృప్రజలఁ గని

కరమునఁ బలికించును. దీనులఁ గరుణించును. దుష్టులఁ బ
రుషదృష్టిని జూచును. తగని మాటల రోయును. తగని
పనులఁ బాయును. లోపలవెలుపల శుచియై యుండును.
ఎంతయు నెక్కుడుగ సమయస్ఫూర్తియు వివేకమును గల
వాఁడు. శ్రద్ధాళువు. వెరవరియై పనుల యోగ్యత నరయును.
యుక్తకాలమునఁ బనులాచరించును. రాముఁడు వేదపారం
గతుఁడు. సంస్కృతప్రాకృతభాషావిశారదుఁడు. ఆకాలము
నఁ గలవిద్యలలోనెల్ల నిపుణుఁడు. ఇంతియే గాదు. రాముఁడు
కరితురగముల నడిపి శిక్షించును. శస్త్రవిద్యావిశారదుఁడు.
ధీరుఁడు. శూరుఁడు. సామర్థ్యమున దండనిపుణుఁడు. ఇట్టి
మహాభాగుఁడు దశరథరాజమానసానందుఁడయ్యె. ప్రజల
కుత్సాహహేతువు. రాజ్యమునకుఁ గొలపట్టు.

## దశరథుఁడు రాముని యువరాజుగఁ జేయనెంచుట.

౬౯. రాముఁ డిట్టియతులగుణంబు రాశి యగుటచే
దశరథుఁడు తలఁచి యువరాజుగ నభిషిక్తునిఁ జేయఁ గోరెను.
ఇది సహజముగాదే. కావునఁ దనకోరికను దెలుపఁ గోరి
కొలువునఁ దొరలును, సామంతరాజులును గొలిచియుం
డ వారలతో నిట్లనియె. నేను వృద్ధుఁడను. రాజ్యభారము
మోసిమోసి యలసితిని. ఇఁక విరమించుట ప్రియంబ
య్యెను. రామునకుం బట్టమును గట్టెద. రాజ్యకార్యములు
వాఁడు నడుప నేను విశ్రమించెద. రాముఁడు ప్రభుత్వ

ర్థుఁడు. విశ్వాసపాత్రుఁడు. ఇఁక మీచిత్తంబులలోని యభిప్రాయముల నేర్పడఁ దెలుపుఁడు. నాచెప్పినది సమ్మతమగునో కాదో యోజింపుఁడు. పుత్త్రవాత్సల్యముచే నా వివేకము మఱుఁగుపడి యుండనోపును. అట్లని ఇంతకంటె మేలైనమార్గ మొక్కటి మీకుం దోఁచినదియా? తోఁచినచో దాని నాకుం దెల్పుఁడీ యని వేఁడెను.

౨౦. పూర్వకాలమునఁ జక్రవర్తియగువాఁడు తన సామంతరాజులయెడలను దన ప్రజలయెడలను ఎట్లు వర్తించుచుండెనో ఆకొలువున జరగినచర్యచేఁ దేటపడియెను. అట్లుపలికిన దశరథుని వచనముల విని సభనున్న ద్విజప్రజాసేనాధిపప్రముఖులేకీభవించి యాలోచించి యేకగ్రీవముగ రాముని యౌవరాజ్యమునకుఁ బట్టము గట్టుమని రాజును బ్రార్థించిరి. దానికి మనంబున సందియముండి నాప్రీతికై యిట్లాడితిరే యని జనపతి యడుగ వారలట్లు కాదనిపలికి రామచంద్రు సద్గుణంబులు ప్రశంసించి తుద కిట్లనిరి. రాముఁడు దేవదేవున కెనవచ్చువాఁడు. ఉదారగుణాభిరాముఁడు. రాజ్యక్షేమమునిచ్చలు గోరువాఁడు. ఇట్టిసుకుమారుని వేవేగ గద్దియపైఁగూరుచుండఁబెట్టుము.

౨౧. అని యెల్లరొక్కముఖంబునఁ బలికిన రాజీయకొని పట్టాభిషేకమునకు సర్వసంభారముల సిద్ధముచేయ

నియమించిన జయజయాదిసంతోషార్భటులు సెలంగ నెల్లెడ
లం గార్యముల నుపక్రమించిరి. ఇట్లు ప్రజలానందసంరంభ
మున నుండ దశరథుండు నిజనందనునిం బిలువం బనిచె.
రాముండు నిండుమనంబున గంభీరముగం బూర్ణశశాంక
మనోజ్ఞముఖంబు గ్రాల జనులు గుమిగూడి జయజయ
శబ్దంబులు చేయుచుండ వచ్చి తండ్రికిం జేతులు మోడ్చి
సాగిలి పాదములకు భక్తితో మ్రొక్కినం దండ్రి లేవనెత్తి
ముద్దాడి యిట్లనియె. సభ్యులు నేనుంగూడి నిన్ను రాజ్య
మునకు యువరాజుగ నియమింప నిశ్చయించితిమని యెఱిం
గించి మఱియు గాదిలిసుతున కిట్లని బుద్ధులు గఱపెను.
పుణ్యశీలములు నీకు స్వాభావిక శిరోభూషణము లయ్యు
వత్సా! వాత్సల్యమున నీ మేలుగోరి నే నెఱింగించునది
వినుము. నానాంటికి వినయము వర్ధిల్లం జేయుము. ఏమఱక
యెల్లప్పుడింద్రియముల నిగ్రహింపుము. మోహలోభ
ములం గలుగు కీడులం బాఱందోలుము. భాండాగారము
నాయుధశాలయు నిండియుండున ట్లుంచు చుండవలయు.
నీవ చూచియుండెడి నోరులవలన నరసియుండెడి రాజ్య
స్థితిని జక్కంగాం దెలియవలయును. న్యాయమును బాలిం
చుచు సామంతులయుం బ్రజలయుం బ్రేమను సాధింపుము.
ప్రజలు సంతసిల్లంగా రాజ్యముచేయు ఱేనింగని వాని

నెచ్చెలులు నిర్జరు లమృతపానమున హర్షించునట్లు హర్షింతురు. కావున నాపట్టీ! యాత్మనిగ్రహ మొనరించి రాజ్య పరిపాలనముచేసి తేజంబున రాజిల్లుమనియె. బాలురారా! మానవుఁడే, దశరథుఁడు రాజ్యవైభవమును, మహిమను గుఱించి యొకమాటయైనను జెప్పఁడు. రాజ్యాధికారమును బెంపును బ్రశంసించి గర్వమునకుఁ బురికొల్పఁడు. వినయము, నాత్మశిక్షణము, నింద్రియ నిగ్రహము ధర్మాచరణశ్రద్ధను గఱపెను. ఇదియే ప్రాచీనకాలమున భరతఖండ చక్రవర్తుల పద్ధతి.

౭౨. అంత నభిషేకమహోత్సవమునకు సమస్త కార్యములు సిద్ధమైనఁ గొండొకపరి నరనాథుఁడు రాముసిఁ బిలిపించి యెల్లిపట్టబంధనకల్యాణము గావున నేఁటిరేయి సీతతోఁ బుణ్యోపవాసంబునఁ గడుపవలయు నని యాన తిచ్చిన రాముఁ డట్లుగావించె. సంతోషమున నుప్పొంగి యయోధ్యయం దెల్లరుఁ దనియుని విందులఁ దేలుచుఁ బున్నమనాఁటి సముద్రఘోషమున కెనయగు జయజయ శబ్దములు సేయుచుండ రామసదన మొక్కటి యుపవాస దీక్షచే నిశ్శబ్దముగను శాంతముగను నుండె. అందు రాజనందనుఁడు నిజసుందరియుం దానును రాజ్యభారమును మోయ నాయత్తపడుచుండెను.

23. ఇట్లుండియు రాజాగారమున ననర్థసూచకము లగు కలకలములు పుట్టుచుండెను. ఇది యెంతయు నాశ్చర్యమయ్యెడు. పౌరులెల్లరు మరలఁ గ్రొత్తసింగారములఁ దళుకొత్తఁజేసి మార్గముల నలువారఁ బూవులతోరణములఁగట్టుచు ద్వారముల గవాక్షములఁ జిత్రపుఁబట్టుతో నమరించియుండఁ బురమెల్లను బూలపడుపువలె విలసిల్లె. సుగంధిధూపమున నంతటను గుమగుమ లాడుచుండె. ఎల్లకెలంకుల హర్షగానము వీనులకు విందుకొలిపె. గీతవాద్యము లెల్లెడల వినఁబడెను. రాముఁడు రాజగును. శ్రీరాముఁడు రాజగు నను జయస్వరంబులు శ్రావ్యములయ్యె. అట్లుండ నెవ్వని యానతిచే నీ యానందసందోహము గలిగెనో యా ఱేనిమందిరమున మబ్బుగ్రమ్మి లోకాపకారహేతువగు గుబగుబలు పుట్టనేల? దానిని వినుండు.

24. ఇట్టి సన్నాహములను గని కైకేయీమందిరమున నుండు మందరయను నొకగూనిచెలికత్తె యాసన్నాహములకుఁ గారణము వేఁడి యువరాజుగ రాముని గద్దియపయి నిలుపువారని విని వేగంబునఁ దన రాణికడకు నరిగి చిన్ననాఁటనుండియుఁ గైకచెంతఁ బెరిగినది గావున నోర్వలేని తనముచేఁ బక్షపాతముచే ధర్మమును వివేకమును లేక యత్యంతమోహమునఁ గోప ముట్టిపడ రాముని

పట్టాభిషేకమహోత్సవము జరగు. నీకు సీతనయునకు ముప్పు చొప్పడు ననిపలుచనలచెను. ఆసువార్తకు రాణి సంతోషించి యట్టి హృద్యంబగు వార్తను దెలిపెనని దానిని మెచ్చుకొని యొకదివ్యాభరణమును దానికి నొసంగి యిట్లనియె. నీవార్తలు నాకెంతయు సంతసంబుఁ గావించు చున్నవి. నాకరయ రామభరతుల కేమియుభేదము దోఁపదు. యౌవరాజ్యమునకు రాముని రాజు నియోగించెను నన ముదమయ్యెడు ననితెలియఁబలికె. ఇట్లు ముగ్గురు తల్లుల యుల్లములకు శ్రీరాముఁడు ముద్దులుగూర్చువాఁడు. వాఁడు ముగ్గురి నొక్కతీరునఁ దల్లియని ప్రియమారఁ బిలుచును. కన్నతల్లిని గారవించు వడువున ముగ్గురిని బ్రియగౌరవముల మన్నించుచుండును.

౭౫. మందర యాసువర్ణాభరణమును బాఱవైచి కైక నిట్లుదూరెను. నీవు నీసుతుని హితమును జూడవు. రాము నివైభవమున భరతునకుఁ గీడు మూఁడును. నీవును గౌసల్యకు దాసివయ్యెదవు. అని బిట్టుగఁదిట్టిన దానిమాటలను వినక కైక యత్యంతోత్సాహమున రామునిఁగొనియాడి రాముఁడు పెద్దవాఁడుగదా. రాజ్యము వానిది సుమ్మి. ప్రేమదలిర్పఁ బ్రాణములరీతిని దమ్ములఁ గాచు వాఁడు. ఇదినిశ్చయమనిన నామాటలఁ బాటింపక చల మునఁ గంకణముగట్టుకొని కుటిలమార్గమునుబూని క్రమ

క్రమంబుగ వాదించియు బెదరించియు బుజ్జగించియుఁ గైకహృదయము మరలునట్లు బోధించెను. తుదకు నిరప రాధియగు రామునిపైఁ గైకకు విరోధము గాఢమయిన భరతునకు రాజ్యమునుబొందింప గట్టిగఁ బూనుకొనియె. అయిన నిట్టి విపరీతమెట్లుసమకూరు? దానికి మార్గమెద్ది?

౭౬. అని చింతించుచుండ మందర నీకేనుపాయంబుఁ జెప్పెద. వినుము. దాని నీవు మఱచితివి. అదియెట్లంటివే ని బహుకాలమునకుఁ బూర్వము సంగరరంగమున నీపెని మిటి గాఢముగ నొచ్చిన నీవు ప్రియంబునఁ బరిరక్షించు టఁజేసి తెప్పిరిల్లి కృతజ్ఞతతోడ మనుజేశ్వరుండు రెండు వరంబులిచ్చిన వాని నింకను నడుగకయున్నదానవు. ఇది యే యిప్పటిసిబలము. వరముల నిప్పుడిమ్మనుము. ఒక్కవ రంబున భరతునకుఁ బట్టముగట్టుమనుము. వేఱొక్కవరం బున వనంబునకు రామునిఁ బదునాలుగేఁడులు పంపుమ నుము.అట్లైని భరతుండు రాజ్యంబున దృఢముగ నెలకొని జీవితకాలమంతయు రాజ్యమేలును. ఇదియే తగునుపా యము. నీవు కోపగృహంబునకుఁ జనుము. నీకై రాజువ చ్చుడు దుఃఖంబున వెక్కివెక్కి యేడ్చుచుండుము. నిన్నుం గని జనపతిచిత్తంబు మెత్తఁబడునందాఁక నూరకుండు ము. పదంపడి నాఁడొసంగిన రెండువరంబుల నేఁడు నాకి మ్మనుము. రాజు వల్లెయని యొడంబడి బాసచేసినంగాని

వానిని జేర్కొనకుము. తదనంతరము వరంబులఁ దెలుపు-
టొప్పు. అని మందర చెడుబుద్ధులను గఱపినఁ గైకయు న
క్కటా! యీర్ష్యాసంశయములు మల్లడిగొని యుల్లంబొ
ఱియ నాయుపాయమ్మునకు సమ్మతించి శోచనీయమగు
నానాటకము నాడఁబూని కోపగృహంబుసొచ్చె. మణిమ
య హేమాభరణముల నలుదిక్కులఁ బాఱవైచెను. అ
మూల్యదుకూలములను దిగవిడిచెను. మలినాంబరములఁ
గప్పెను. దుఃఖాక్రాంతయగు తుప్రకాంత చందంబున నం
దము డిందుపఱచె. కఱకునేలపైఁ గూలి చాపకట్టుగఁ బ
రుండె. ఇట్లు నటించుచు రాజురాకకై వేచియుండెను.

## కైకవరము లడుగుట.

22. అట దశరథుండు రాముని పట్టాభిషేకమున
కు సకల సంభారముల జతపఱచి యెల్లపనుల సమకూర్చి,
తన ముఖ్యప్రియురాలగు కైకం దలంచి యీమహోత్సవ
మును నేన ముద్దరాలికిఁ దెలిపెదనని ప్రియంబున వచ్చెను.
తన ప్రియకాంతను గానక యరయుచు నొక్క దాసి వల
నఁ గోపాగారమును బ్రవేశించెనని యెఱింగి కలవిల పా
టొంది తానాయింటఁ బ్రవేశించి భూమిపైఁ బరుండిన
దానిని, దుఃఖించు దానిని దన మోహనాంగిని జూచి
మచ్చికతోఁ బ్రియురాలిపై వ్రాలె. మార్దవమున దాని
దేహమును స్పృశించి బుజ్జగించును. చింతకు గతంబేమి-

యని యడుగు. అంతకంత కగ్గలంబగు కామ తాపంబున
వెఱ్ఱి వింతలుగ వ్యాఖ్యానములు చేయు. నిరపరాధి నెవ్వ
నిని జంపవలయు. అపరాధి నెవ్వనిం గాపాడ వలయు.
ఏనిఱుపేదను ధనవంతునిగం జేయవలయు. ఏధనికుని దరి
ద్రునిగం జేయవలయు. వసుంధరలో సారవంతము లగు
భూములు నేనేలువాండ. నాధనప్రాభవంబు లెయ్యదియొ
నంగు నయ్యది నీయదియ కాదే. ఇట్లు చెలువపయుని వల
పునం గన్నులు గానక పలికె. తనముగ్గురు భార్యలలోం
గైక సొగసుంగత్తియ యని యతిమోహంబున దానిని
వలచి యుండును. మోహంబునం జేటు దెచ్చుకొనియె.
నిగ్రహము లేక తనకనర్థమును సంపాదించు కొనియె. కై
కయు సమయము వేచి రాజునకు సందియక చక్కంగ బం
ధించు నదియై కుటిలముగ నిట్లనియె. "దేవా! ఏనొక్క
యేర్పాటును జేయంగోరి యున్నదానను. దానిని నీచే సా
ధింప వలయునని మనం బువ్విళ్లూరెడు. నాకోరునది చే
యుదువేని మాటయిమ్ము. ఏమ్మాట నీకుం దెలుపుదుననిన
రాజు గొంకక యాపెకోరిన్నను నిజాంకతలంబున నునిచి
కొని నాకుస్త్రీమోహాస్తమ ప్రియుండగు రాముని తోడుగ
శపథంబు చేసెన. నీకిచ్చవచ్చిన కార్యంబు తెలుపుప
డం గావించెదనని రామునిపైని ఒట్టుపెట్టుకొని వానిని వ
నయాత్రకుం బాల్పడం జేసెను. ఇట్టురిలోం దగిలిన జిం

కనుబోలె మగని బిగియంబట్టి వాని వాగ్దానమునకు దేవ-
తలను సాక్షులం జేసి శోచనీయమగు తన వాంఛితముల-
నిట్లు పలికెను. ప్రాణేశ్వరా! తొల్లి రణంబున రెండువరం-
బుల నొసంగితివి. మఱచితివే. వాని నిప్పుడు కోరెద. నీవు-
ను గావించెద నని నమ్మంబలికితివి. రామునియభిషేకము-
నకని సమకూర్చిన సకలద్రవ్యములం గొని భరతునకుం బ-
ట్టముం గట్టుము. ఇదియొకవరము. రేపే కృష్ణాజినమును
గట్టి రాముండడవుల కరిగి యందు భిక్షాటనమునం బదు-
నాలుగేండ్లుండవలయు. ఇది రెండవది. బాస యిచ్చితివి.
మాటను జెల్లింపు మని యడిగె.

౭౮. ఆదారుణ వాక్యములను విని భూరమణుండును
విస్మయమందెను. డెందమవిసిపడియె. కొంతవడి మూర్ఛి-
తుండయ్యె. తెలిసికూర్చుండె. పశ్చాత్తాపమునం గుందె.
కాముకుండనై మరులునం జిక్కితినని చింతించె. బేలనై
చావునోడికట్టుకొనిన విధముగ మాట యిచ్చితి నని
లోనడలెను. మైమఱచి నేలంగూలె. భీభత్సశోకంబులచే
విస్మృతింగనె. ఎట్టకేలకుం బట్టరానికోపవశంబునం గైకను
గఱకులాడి తిట్టెను. వెండియు నడలునం జిక్కి దీనుండై
దుర్బలుండై యబలను బ్రార్థించెను. దేవీ, సూర్యుని బా-
సి భూమి యున్నను రాముని బాసి నేబ్రదుకను. రాజ్యాం-
తరములనెల్లం దొలంగుదుం గాని రాముని గుణరత్నము-

ను నేవిడువను. కేకయరాజపుత్త్రీ! నాయుత్తమాంగము
నీ పదారవిందముల సోఁక మ్రొక్కెద. నన్నుం గరుణింపు
ము. అని మనోవేదనచే నొచ్చి దీనాలాపములతో వెండి
యు నిట్లని విలపించెను. ఏను వృద్ధుఁడను. చావ నున్న
వాఁడ. నన్నుఁ గనికరమునఁ జూడుమా. కైకా, నీకుఁ
మ్రొక్కెద. నీపాదములకుఁ బ్రణమిల్లెద. రామునికి రక్ష
కురాలవు గమ్ము. పాపదూషితునిగ నన్నుఁ జేయకు
ము. అనిపలుకుచుఁ దనపరువును బడమును మఱచి వృద్ధ
రాజు నిజాంగన పాదముల పయింబడి పెలుచ శోకించెను.
కాని కైక యెడమీయదు. ఎన్నియోమాఱు లడిగించు
కొనియుఁ జేసినబాస చెల్లింపు మని మోకరించి నిలిచె.
నిలిచిన రాజిట్లు పనివి దుఃఖించెను. అయ్యో! నే నెట్లిఁ
కఁ గౌసల్యం జూతును. అది మెత్తనిచిత్తంబున శ్రద్ధతో
నన్ను నిత్యమును గొలుచుచుండును. ఈకైకసొగసులకుఁ
జిక్కి దాని కెగ్గుసేసితిని. దాని నోల్లనైతిని. ఎట్లుగృహసౌ
ఖ్యముల రాముఁడు విడనాడు. వనవాసాయాసముల నెట్లు
ఓర్చును. అయ్యో, నాయనుంగుఁగోడలు సుకుమారి
సీత మగని సంతతాదరములేక యేయిడుమలఁ బడునో,
రాముఁడో యవశ్యము నామాటలకుఁ గట్టువడును. నేఁ
బోఁజాలనని నామాట కెదురైన నాడువాఁడు కాఁడే. వాఁ
డు పితృభక్తుఁడు. ఈకైక, యీకులనాశని, ఈవిపత్తులకు

మూలము, నాకపఖ్యాతికి హేతువైనది. భార్యావశవర్తనుండై కన్నకొడుకునకు నిరపరాధికిఁ జేటుగావించెనను మాటఁ దెచ్చిపెట్టినది. ఇట్లెన్నివిధముల మొఱ్ఱపెట్టినను కఠినురాలామెయొద్ద నిష్ప్రయోజకములయ్యె. ఆమె చలమునఁ బట్టినపట్టు వదలక చేసినబాసఁ జెల్లింపుమని పెనుఁగులాడుచుండఁగ రాత్రిగడచెను. మఱునాఁడు వఱువాఁత వసిష్ఠుఁడు పంప సారథియగు సుమంత్రుఁడు నరపాలు వాకిటదెంచి రాజా! ప్రయత్నము సిద్ధమైనది. రామునిఁ బట్టాభిషేకమునకుఁ బిలిపింపఁదగుననిన వినియు దశరథుఁడు మిన్నకుండె. కైకయు సాహసవృత్తితోడ నీవేగి రాముని నిచ్చటికిఁ దోడితెమ్మని యాజ్ఞాపించిన సుమంత్రుఁడు రాజాజ్ఞ నిరీక్షించి నిలిచియుండ రాజు రాముని సద్గుణాభిరాముని నిటకుఁదోడుకొనిరమ్ము. వానిఁజూడ వలతునని పనిచిన సారథి కార్యగతు లెఱుంగక వల్లెయని సంతోషముతోఁ జనియె.

౭౯. అట రాముని ధామమునఁ బండుగవేడుకలు నింపి వెలసె. మహోత్సవము బయలువెడలుటకు సిద్ధమగుచుండె. ఆయింటిలోఁ బ్రవేశించి సుమంత్రుఁడు సీతాదేవి చేరువనిలిచియుండఁగా సుఖాసీనుఁడై యున్న రాముని గని తండ్రియానతిఁ దెలిపెను. దానిని విని యతిసంభ్రమమున రాముఁడు లేచి పయనమయ్యెను. జానకియుఁ

సలవాకిటికి వెంటవచ్చి భర్తక్షేమములఁ గోరుచు వెనుక
కుం బోయెను. సిద్ధమైయున్న తేరెక్కి యెప్పటియట్ల లక్ష్మ
ణుఁడు వెంటరా రాముఁడు దశరథునిజూడ వెడలెను. రాజ
మార్గమున రామచంద్రునిగని జనులుగుంపై జయజయ
ధ్వనులు సేసిరి. రాముఁడు నా రాజ్యభారమును వహించు
ను. రాముఁడు రాజ్యముసేయుటచే నెల్లయెడల శుభమ
గును. అని గంభీరధ్వనులు సేసిరి. రాముఁడు రాజసదన
మును జేరి తేరుదిగి జనకునిఁజూచెఁగఁ జెచ్చెఱనేగి భక్తి
తోఁ దండ్రికిం బ్రణమిల్లె. తండ్రి దీనవదనుండై గద్గదస్వ
రుండై రామాయని యొక్కమాటనే పలికి వేఱొండుప
లుకకుండిన రాముఁడు భయంబంది తొట్రుపాటునఁ గైక
నిట్లని యడిగె. తల్లీ, యేవిషయమునందైనను దప్పుచేసితి
నా. అజ్ఞానంబునఁ దండ్రిమనసు నొప్పించితినాయని య
డిగిన రాణి కనికరములేక యిట్లనియె. "మీతండ్రి నీచే నహి
తంబుఁ బొరయఁడు. ప్రియతమకుమారుండవగు నీకు నప్రి
యంబని తనమనోభావంబును బలుకఁడు. మీతండ్రి బా
సంబిచ్చియు నిప్పుడు నెఱవేర్ప నోడెఁడు. మాటనిలుపుట
నీకుఁ గర్తవ్యము. తండ్రిమాట నడుపుటకు సమ్మతించితి
వేని నీకు నేనంతయు నెఱిఁగించుదాన. భూనాయకుఁడు
దాను బలుకనేరఁడు" దీనిని విని మనంబున రాముఁడు
తండ్రియభిమతంబుల నేనొనరింపనేమో యను సందియ

ము వచ్చెఁగదా యని కడునొచ్చి చెచ్చెఱ నిట్లు ప్రత్యుత్తరం బిచ్చె.

క. గురుఁడును రాజును జనకుఁడుఁ
బరికింపఁగ నితఁడ యితఁడు పనిచినఁ దల్లీ
గరళంబేఁ గొనియెద సా
గరమునఁజొత్తుఁ జొత్తుఁగా శిఖినైనన్.

కావున రాజుకోరికను దెలుపుమా. దానిని నేనొనర్చెదఁగాని మరలను. నేనెన్నఁడు నాడి బొంకను.

౮౦. అనిరాముఁడు ప్రతిజ్ఞచేసిన మోమోట లేక కైకవానికిట్లనియె. "మున్నొక్కయెడ సంగ్రామంబున భూనాయకుఁడు పోరుచు గాయమునంది కడు నొచ్చిన నే నతని మచ్చికతోఁ బరిరక్షించితిని. దానికిన్ మెచ్చి భూపాలుండు రెండు వరంబులనిచ్చె. ఆరెండు వరములు నాకిప్పు డిమ్మని యడిగితిని. అవియేవనిన భరతునిపట్టాభిషేక మొకటి. నీకుఁ బదునాలుగేఁడుల వనవాస మొకటి. కాఁబట్టి రామా! నీకని సమకూర్చిన సంభారములతోడ భరతుని యౌవరాజ్యమునకుం బట్టము గట్టవలయు. భరతుఁ డాభరణాలంకృతుఁడై మహీతలము నేలుచుండ నీవు జడదారివై నారచీరలంగట్టి యడవి కరుగవలయు. ఇవియ నాకోరిన వరంబులు. నీవు పితృవాక్య పరి

పాలనమును జేయుము. చేసిన బాసఁ జెల్లింపఁ డనునవజ్ఞ రానీయక రాజును గావుము."

౮౧. భళిరా! కైక పల్కిన యీాకఠిన వాక్యము లు చెవిసోఁకినపుడు రాముని శాంతముఖము వికారమొం దదు. సహజమగు నిశ్చల సంతోషము వికసించియుండె. రాముఁడు మంజుల వచనంబుల నీవు చెప్పినట్లేయగుఁగాక యని జననికి వెండియు నిట్లనియె. తండ్రిమాటను శిర సావహించు నాయెడ రాజునకుఁ దూష్యింభావమేల? ఇది నేనెఱుఁగఁగోరెద. భరతునకు రాజ్యమొక్కటియేగాదు. ఏదియైనను సంతోషమున నిచ్చెద. కన్నతండ్రి యిచ్చ గించిన జెల్ల నాకు హితం బగును. తండ్రిని సేవించు టయు సతఁడు పనిచినపనిని జేయుటయు ననుపమ ధర్మంబులు. ఇంతయేల ? నీయానతియే నన్ను వనముల కనుపనోపును. నీయాజ్ఞయు నా కనుల్లంఘనీయము. ఇదె పోయి తల్లియనుజ్ఞఁబడసి సీత నూరడించి నేఁడే యరణ్య ముల కరిగెద. అనుచు నల్లన నయ్యకుఁ బ్రణామిల్లి లక్ష్మ ణుఁడును దానును వెడలెను. రాముండు ఇంతకుఁ జనుచుండ సౌమిత్రివదనంబు నీలమేఘమువలెఁ గప్పువాఱెను గాని రామచంద్రుని ముఖబింబమునఁ గళంకమొకింతయుఁ బోఁడదు. రాముఁ డీరీతిని ఆకస్మికంబుగ గద్దియనుండి యడవికిఁ ద్రోయఁబడెను. రాజ్యముడిగి తిరిప మడుగ

వలసెను. అత్యంతౌన్నత్యమున వెలసియు నతికష్ట దశకుఁ బాల్పడియె. ఇటులయ్యు రాముఁడు శాంతిని దిట్టతనము నెడఁబాయఁడు. వసిష్ఠుని యుపదేశమును రాముఁడు బాగుగ గ్రహించి యుండెను. ఐహికసుఖములు కేవల నిస్సారములని పరమవైరాగ్యము మనస్సునగట్టిగ నాఁటి యుండెనుగావున రాముని మనశ్శాంతియుఁ దొలఁగదు. ఐనను సీత కీవార్తఁ దెలిసిన నెట్లు దూలునో తల్లి యేమనునో యనిచింతించెను.

౨౩. రాముఁ డేగుతఱిఁ గౌసల్య యిష్టదేవతలం బూజించుచుండెను. రాముఁడు తెచ్చిన దుఃఖవార్తవినియు నతివిషాదంబునఁ బొక్కి ఘోరముగ విలపించెను. పుత్త్రా! విభుఁడు కైకయాందలిప్రేమచే నాయెడ విముఖుఁడయ్యెను. నీయాశతో బ్రదికి యుంటిని. నన్ను నెడఁ బాసిన నాకేమిదిక్కు. అని విలపించినఁ దల్లి వగకును నన్నకుఁ జేకూరిన యపకృతికిని గినిసి లక్ష్మణుఁడు కోపమున మండిపడుచు నిట్లనియెను. రాముఁడు రాజ్యభ్రష్టుఁ డుగానేరఁడు. దశరథుఁడు ముదిమిని మదిఁదప్పి యాఁడి మాటల వినువాఁడు. రాముఁ డుద్ధతిమైసింహాసనమును గ్రహింపుఁగాక. నేనెదిరించిన వారినెల్లరఁ బోరి చంపువాఁడ. అనియెను. తల్లియు నన్నెట్లు వాసి వనవాసమునకుఁ బోకుము. నిన్నుఁబాసి ప్రాణంబుల దక్కించుకొందునే

యని పలవించెను. ఇట్లు తల్లి యొక్క శోకవచనము విని రామచం ద్రుఁడేమిచేయఁదగును. ధర్మమరసి మెత్తనిమాటల నమ్మ కిట్లనియెను. అమ్మా! అయ్యపనుపు నతిక్రమింప నాక లవియే. నీకింతయు వినయంబున మ్రొక్కెద. నేనడవి క నుఁగవలెను. ఇట్లు పలుకుచుఁ గోపదీపితుండగు లక్ష్మ ణు ననునయించుచుఁ దల్లియనుమతి నొందఁగోరి యల్ల న మఱియు నిట్లనియెను. దేవీ! నేను తండ్రివచనంబులఁ జె ల్లించి క్రమ్మఱ వచ్చెదను. నన్నుఁబోనిమ్ము. నిన్ను నే కా ర్యమును బూన్చె నని కైకేయిపై నలుగకుము. ఆయమ్మను మన్నింపుము. నాగమనమునకు సమ్మతింపుము. అనిసారె సారెకుఁ దండ్రి యాజ్ఞానుసారముగఁ బోయివచ్చెదననుజ్ఞ యిమ్మని ప్రార్థించెను. దానికిఁ గౌసల్యయిట్లనియెను. నా ముద్దుపట్టీ! దూడ వెంబడిననుగు నావువలె నీవెచటికరి గిన నచ్చటికి నీతోడవచ్చెద. అనుడు దయార్ద్రహృదయుఁ డగు రాముఁడు తల్లి కిట్లనియెను. పతిసేవ సతులకు మఱువఁ దగునే. పతి పెద్దకుమారుని యెడఁబాటునకు దుఃఖించెడు. గృహము పాడుపడునని శోకించెడు. ఆర్తుఁడగుపతిని వి డుచుట ధర్మము గాదని ధర్మమెఱిఁగి కౌసల్యయు నొ డంబడి తండ్రీ! జనకుని మాట పొందుపఱిచి వనవాస స మయాబ్దంబులు గడిపి క్రమ్మఱ క్షేమంబున రమ్మని వా నిని బుత్తెంచెను.

53. తల్లిని సమ్మతపఱచి రాముఁడు సీతకడ కేగెను. సీతతోఁ జెప్పికదా రాముఁ డడవులకరుగును. ఆపని నెట్లు నిర్వహింప నోపును? దుఃఖమునఁ దల్లియుఁ గోపమునఁ దమ్ముఁడును విలవిలపడుచుండఁ జూచి ఆయువుపట్టులు దాఁకినట్టులు వేదననొందియు ధీరస్వాంతుఁడై రాముఁడు చంచలింపక నిలుకడగా నిలిచె. ఆగంతుమగనిగుండియలు మనోనాయిక మనఃఖేదమునఁ దూగాడక యోర్చి యుండవలసె. రాముఁడు రాజ్యాభిషిక్తుఁడై మరలివచ్చు నని సీత యువ్విళ్ళూరుచుండ నాతఁడు గంభీరముననె యేడియుంబలుకక యరుదెంచుచుండ సీతచూచి దుఃఖము రానైయున్నదని యూహించి చిత్తంబు గుంద రామునిఁ జేరి యెన్నియేని ప్రశ్నలనడిగె. రామా! నీకేదీ రాజచిహ్నమగు శ్వేతచ్ఛత్రము? పరివారమెక్కడ? గాయకులెక్కడ? ద్విజులేరీ? ప్రజలేరీ? రాజవైభవచిహ్నములగు పట్టపేనుంగులేవి? అని యనేకవిధంబులనడిగెను. సీతమనోదార్ఢ్యమెఱుంగుదు గావున రాముఁడు వేఱుమాటలు చెప్పక గంభీరంబుగ నిట్లనియె. సీతా! మహనీయకుల సంజాతా! ధర్మజ్ఞా! వివేకవతీ! పుణ్యకర్మవర్తినీ! అరణ్యమునకుఁ దండ్రినన్ననిచె. రాజుమున్నుకైకకు రెండు వరముల నిచ్చియుండెను. దానింబట్టి భరతుఁడు రాజు గావలెననియు, నేనడవులకుఁ బోవలెననియుఁ గైకకోరె

ను. కావున నేవనముల నుండునంతదాఁక నీవింట శాంత హృదయు వైయుండి నాతల్లిదండ్రులకుం దక్కంగలతల్లుల కును భక్తిశ్రద్ధలచే సేవచేయుచుండఁదగు. కులమునకు దేశమునకును రాజగుభరతునకుఁ బ్రియముగ వర్తిల్లు ము. వాని యానతుల నాదరించి నెఱపుము. ప్రియకాం తా! అడవులకేనేగెద. నేనువచ్చునందాఁక నీవిచ్చట నుండుము. అనిన నవ్వుమొగమునఁ బ్రియముగ సీతయి ట్లనియె.

౮౮. రామా! నీకును నాకును వియోగముకలుగునే. ఇది యెక్కడియెన్నిక? బంధువులనెల్లరిలో నిల్లాలొ కర్తుకయ పురుషునితో సుఖదుఃఖముల రెంటిని సమముగ ననుభవించును. కావున నీకుఁ దండ్రియిడిన య నుజ్ఞయే నాకునుం జెల్లు. నీవు పోవు త్రోవన నేను ను నడిచెద. నన్నుంద్యజింప నేనెట్టి యపరాధముం జేయలేదుకదా! కావునఁ బ్రాణవల్లభా, నీవుండు నెల వున నేనుండనొప్పు. ఇల్లాలెల్లపులఁ బెనిమిటితో నరు గవలయునని చిన్ననాఁటనుండి నాకు నేర్పిరి. కావున వనమందేనియు నీతో సంతోషముతో వసించెద. అపా యములకు జడియను. ఓమహాబాహూ! నీభుజబలము నన్ను రక్షింపదే. నాప్రార్థనమంగీకరింపుము. నాస్వాంత మంతయు నీయది యు. ఒండొరు నెఱుంగదు. నిన్నేయంటి

యున్నది. ఇఁక నేనేమందును? స్వామీ, నన్ను విడిచితి వేని ప్రాణములవిడుతు. ఇది నిశ్చయము. అని పలుకుచుఁ దన్నెడఁబాయనోపఁడని తద్ధయునమ్మెను. నమ్మినప్పను. అంతలోఁ దన్నెడఁబాయునోయని భయముగలుగఁ గన్నులఁదడిపెట్టును. నాథునికంఠము మృదుకరములం గౌఁగిలించుకొనును. మృదువైన తనచెక్కును జెక్కునకుఁ జేర్చును. దానింగని రాముండు మనంబున నిది యత్యంత సుకుమారాంగి. ఓడుగాలియేని యెఱుంగనిది. అడవు లిడుమలకునికిపట్టులు. ఎట్టులోర్చునోయని చలించి చంచలాక్షికిట్లనియె. అబలా! కాననభూమిలోఁ బడరాని పాటులు పడవలయు. పెక్కుఁగష్టములఁబడవలయు. ఈదుఃఖములు నీకేల? ఇంటికడ వెచ్చగ సుఖంబుండుము. అని యెన్నివిధంబులనో వనవాసకష్టముల వర్ణించినను ఆమె నిశ్చయము మరలదయ్యె. రామా! నీవు చలికి నాఁకలికి నల్లాడుచు నడవుల నిడుములఁగుడుచుచుండ నేనెట్లు సౌఖ్యములఁగుడుతును. ఎల్లవిధంబుల నిన్ననుగమింప నిశ్చయిం చితి నని కట్టకడకు బోరున నేడ్చుచు నిట్లనియె. స్వామీ, నీవందుండుకతంబున నాకు ముండ్లు మెత్తలుగావే. భూరజం బు చందనరజమ్ముగాదే. అచ్చటిగడ్డి కంబళముగాదే. ఆఁకులు గడ్డలు సుధామధురములుగావే. వేయేల?

శ్రీరామా ! నీసహవాసమే స్వర్గవాసము. నీయెడఁబాటు నరకము. నీవు త్యజింతువేని చయ్యనఁ జత్తును. ఒక్కని మునమేని యీదుఃఖమును భరింపనేరను. ఇఁకఁ బదునాలుగేఁడులేనెట్లు భరించుదానను ?

౮౫. అని మొఱ్ఱపెట్టిన సీతను గట్టిగ నాలింగనముచేసి మెత్తనిమాటల రాముఁడనునయించుచు నిట్లనియె. దేవీ, నీవేయిట్లు నిశ్చయించిన నేను వలదననేర్తునే. అనుఁడు చిఱునవ్వున సీత ముఖకాంతి వికసించి యొప్పె. దానింగని కలంకదేఱి రాముఁడు నీయాభరణాంబరాదుల నెల్లరకుంబంచిపెట్టి సిద్ధముగనుండుము. వెంటఁ జనుదెంతువుగాకయనిన సీత ప్రియమంది తనమైదొడవులు డులిచి దానమిచ్చెను. వనవాసము సిద్ధమాయెను.

౮౬. అట్టియెడ లక్ష్మణుఁడెంతయుఁ దాళఁజాలక యన్నపాదముల బిగియంబట్టి యేనుంగానలకు రావలయునని ప్రార్థించి రామచంద్రుఁడెంతయు వలదని వారించినను సందీయక దృఢనిశ్చయుఁడై యిట్లనియె. అడవులలో నేదిక్కునను నీకును వదినెకును నపాయములు డాయకుండఁ గాచు పని నాదియు. మీరు గుడువ నాహారముల నరసి తెచ్చుపనియు నాదియు. పెక్కులేల ? రేయింబవళ్లు మిమ్ముఁగొలుచుచుండుట

నాపని. అని వక్కాణించినఁ దుదకు శ్రీరాముఁ డియ్యకొ
ని దివ్యాస్త్రములఁ గొనిరమ్మని పుచ్చెను. అంత నన్న
దమ్ము లిద్దఱు తమసొమ్ముల ధనమ్ములఁ బంచిపెట్టిరి.
భృత్యవర్గము తాము మరలివచ్చునందాఁక సుఖంబుండు
నుపాయంబు గావించిరి. ఇట్లు సిద్ధముచేసికొని దశరథుని
చేత వనయాత్ర కానతిఁగొనువారై వెడలిరి. వీథులలో
సీతారామలక్ష్మణు లరుగుచోఁ బురలక్ష్మి కన్నీరుగార్చు
చుండె. ఉదయమున రాముఁ డరుగుచో నడరిన జయజయ
ధ్వనులడరవు. రాజమార్గమున జనసంఘము లానందతరం
గములవెలుంగవు. పురజనుల ముఖంబుల దుఃఖములు గ్రి
మ్మె. ఆక్రందనమ్ము లడరె. సీతారామలక్ష్మణులు మువ్వురు
తప్పఁ దక్కినవారు లెల్లరుఁ గుందుచుండిరి. ఆమువ్వురు
శాంతులై నిర్వికారులై నడిచిరి.

౮౭. నడిచి జననిమందిరముఁ జేరి రాజును డాసిరి.
రాజు శోకవిహ్వలుఁడై కూర్చుండియుండ రాముఁ డిట్లు
నియె. నా కనుజ్ఞయొసంగుము. సీతాలక్ష్మణసహితుఁడనై
యరణ్యమున కరిగెద. భరతునకుఁ బట్టము గట్టుము. నీ బా
స నీపెద్దకొడుకు చెల్లించుఁగాన నుల్లంబున సంతసిల్లుము.
అయోధ్యయందు భవదాజ్ఞావశవర్తనుఁడనై యుండినట్లు
నీమాట జవదాఁటక యరణ్యమున నుండెద. ఇదియే నాకు

సుఖము. ఇదియే నాకుసంతుష్టి. నీవేలతండ్రీ! దుఃఖించె దవు. దానికి గతమేమి? అనిన దశరథుఁడు చేయునది లేక యొడంబడి రాముఁ డడవులకేగెడు. ఎందును గొఱవపడక సకలరాజ్యసంపదల సేకరింపుఁడు. సైన్యములు వెంట నరు గ నాయతము చేయుఁడు. ఎల్లభాగ్యములఁ గొనిపొండని పనుచుచుండ రాముండు కైకకిచ్చిన మాటలఁ బాటించి యొల్లఁడయ్యె. అయ్యా! నాతమ్ముని రాజ్యమునుండి నేనె య్యదియేని యెట్లు కొనిపోవ నగును? అది ధీరులకుఁ జేయ రాని పని. కావున నెక్క నారచీరఁ బూని వెడలెద. ఇదె నా రాజవస్త్రముల నావలఁ బెట్టెద. అనుచు లక్ష్మణుఁడు దానును నట్లు నారచీరలఁ గట్టుకొనిరి. కట్టిన యన్నదమ్ము లు నవయౌవన సంపన్నులయ్యు మునివేషధరులైన వారి నెమ్మేనులు చక్కఁగాఁ బొడవుగా సుందరముగా వెలింగె. కటకటా! ఆపురుషసింహులకు వల్కలము లొప్పునే? అప్పుడు కైక సంతోషమున నుప్పొంగి విజృంభించె. దశర థుండు గుండె పగిలి ఖేదంబున వారిఁ జూచె. అంత సీతయు ముద్దులొలుకు దేహంబున ముని వేషమును బూనుటఁ గని చూడనోపక భూపతి యీబాలయేని దుకూలాభరణంబు ల ధరించునని వేఁడుటయు సమ్మతించి క్రమ్మఱ నాముద్ది య దివ్యశృంగారములఁ గైకొని తద్దయు వెలింగె.

౮౮. రామచంద్రుఁడు తండ్రీ! నాతల్లిని ప్రియంబున నాదరింపుము. ఆదేవి వృద్ధురాలు. మహాయశస్విని. మహాత్మురాలు. కన్నబిడ్డను గోలుపోయి నెవ్వగచే హృదయము పగులనగుచున్నది యని ప్రార్థించి భక్తిప్రేమలూర మాటిమాటికిని య్యకొని వెలువడెను. మొగసాలలోఁ దేరు నిలిచి యుండిన సీతయుఁ దమ్ముండును దానును దాని నెక్కి వనమునకు వెడలిరి. దానిఁ గని రాజవీథులఁ బౌరసంతతి యాకులమంది యాకసము బ్రద్దలుగాఁగ బోరున నెలుఁగెత్తి యేడ్చుచుండుడు రాజును రాణులును గాలినడకలఁ దేరును వెంబడించిరి. పౌరజనము లట్లుగావించె. అప్పుడు సుమంత్రా! రథము మెల్లగా మెల్లగా నడుపుమని దశరథుండును బౌరులును బ్రార్థించుచుండ రాముండా శోకరంగంబును బాపి వేవేగ పోనిమ్మని తెంపున నాజ్ఞాపించిన గుఱ్ఱములు వడింబాఱె. ఇట్లుండ చీఁకటివచ్చె. రామచంద్రుఁడు లేనిచో నంధకారము వచ్చెనో యనునట్లు రాత్రి క్రమ్మెను.

౮౯. దశరథుండు నిలిచి రథమును జూచియుండి దశరథపరాగమ్మును గనియుఁ బదంపడి యదియును గానకమూర్ఛ మునింగి నేలంగూలినఁ బతివ్రతాశిరోమణి యగు కౌసల్య లేవనెత్తిన నామెపై నొరగి

తొ్రపడ మరలి రాముఁడు లేకయుండుటఁ బాడుపడిన యిల్లు సేరెను. కైక తోడ్పడిరా దాని నించుకేనియు నెల్లక శ్రీరామచంద్రుని తల్లి యింటికిం గొనిపొండని యుండుడు. అందుఁగదా గుండెలు పగిలిన రాజునకు విశ్రాంతి నొందఁగలుగును. అందు రాజు విహ్వాలమానసుండై పడియుండఁ గౌసల్యయు విలపించుచు నాథుని ప్రక్కనఁ జేరియుండె. ఇట్లు అడవి కేగుట విధిగనుండ ఫలంబుముఁ గోరు దశరథుని మాన్పి ప్రేమచే నతని వగఁదీర్ప రాముఁడు గ్రక్కునఁ జనిన దశరథుం డోడి వెనుక నిలిచెననిసంత రామచంద్రుఁ డేమిచేసె వినవలతు మని శిష్యుల డిగిన ననినసంతసూంబ యిట్లనియె.

చం. సురుచిరసీలమేఘరుచి సుందరధాముఁడు సూర్య[వంశసా
గరపతిపూర్ణసోముఁడు వికస్వర శాంతముఖాభిరా[ముఁడ
స్థిరకరనాలఘాతరిపు దేహమహాహవరంగ భీముఁ[డుఁ
వరముని చిత్తపంకజవద వైభవ ధాముఁడు రాముఁ[డెంతయుఁ.

శ్రీ. శ్రీ. శ్రీ.

—oo✱oo—

## నాల్గవయధ్యాయము.

క. శ్రీనిగమస్మృతిశాస్త్ర క
లానిభృతుఁడు ధైర్యశౌర్యలాఘవయుతుఁడుఁ
సూనృతకృతనిజపితృవా
గ్దానప్రాప్తవనవాస గమనాదృతుఁడున్.

౯౦. అగు రాముఁడు సీతాలక్ష్మణసమన్వితుఁడై యడ
వుల కతిత్వరితగతి నరిగెడు. వడి నడచి చేరుదము. రండని
పౌరులు మానక రథమును వెంబడించిరి. రాముఁ డెంతవా
రించినను రాజగువాని మాటలు వినరైరి. అంతట వారి
వాత్సల్యమున మనం బిగురొత్తఁగ నిలువు నిలువుమని
ప్రార్థించు వృద్ధబ్రాహ్మణుల మొఱనాలించి రాముఁ డు
రదము దిగి వారితో నడచెను. అట్లు చీఁకటులు గ్రమ్ము
నందాఁక నడచి తమసాతరంగిణీతీరముఁజేరి యారాత్రి
యందుండ నిశ్చయించిరి. అచ్చట రామచంద్రుఁడు సీతయు
సుఖంబుగ నిద్రించుచుండ లక్ష్మణుండు నిద్రమాని చేత
ధనుస్సు పూని రఘునందనుని నిద్రించువానిఁ గాపాడుచు
శ్రీరాముని మహనీయచరిత్రంబును సుమంత్రునితో సం
భాషించుచుండె. అరుణోదయమయ్యె.

౯౧. రాముఁడు మేలుకొనియె. ఆసమయమునఁ బౌరు
లు దుఃఖముననొచ్చి శ్రమంబున డస్సినవారు గావున తె

స్సఁగా నిదురించుచుండిరి. రాముఁడు సుమంత్రునిఁ బిలిచి నీవు తేరు పూనిచి కాననమును గూర్చిపోక పురంబును గూర్చి యరుగుచు నిపుణముగ మరల్చి మమ్ముఁ జేరుమని యుపాయం బెఱింగించి పంచి తా మేఱు దాఁటి సుమంత్రుఁ డచ్చటికిఁ దేరుగొనివచ్చిన దాని నెక్కి వనమార్గముఁబట్టి రాముఁడు సీతాలక్ష్మణులతోఁ జనియె.

౯౨. తమసాతటమునఁ బౌరులు మేలుకొని గావిలి రాకొమరునిఁ గానక తొట్రుపాటున నెల్లెడల వెదకి యుర దమరిగిన మార్గముంగని దానిఁ గూర్చిపోయిన నది క్రొం డొకవడికి నెందును జనక ముగిసిన నెయ్యాదియుఁ జేయఁ దోఁపక రాముని జేరు నాశల దిగవిడిచి సూర్యుఁడు లేని యాకాశము చందమున రాముఁడు లేమిఁ బాడుపడి నట్లుండు గృహంబులఁ జేరిరి. ఆసుందరపురము శోక నిమగ్నమైయుండె. అప్పురంబునఁ దొలుచూలు మగబిడ్డ లఁగోలుపోయిన వారింబోలె స్త్రీలు దుఃఖించుచుండిరి. గానరావములు వినరావయ్యె. అంగడుల జనఘోషయు డఁగియుండె. ఆటపాటలెందును గనఁబడవయ్యె. రాజవీ థులు జనశూన్యములై చీఁకటి గ్రమ్మినట్లుండె. రామచం ద్రుని దివ్యకళ లేనిచో భక్తజనములకుఁ జీఁకటులు కప్పవే?

౯౩. అయోధ్య యిట్లుండియు రామచంద్రుఁడు

న్న చో నంతయు సుఖముగ నుండెను. కాననమున జానకి భర్తకడనుండుటవలన సంతసిల్లుచుండె. గాదిలియన్నను రక్షించుచు లక్ష్మణుండు తనిసె. రాముండును దండ్రి యనుమతంబును గాపించుచుఁ జిత్తమున శాంతిల్లె. ఇట్లు ముదితస్వాంతులయి పగలు నాలుగుజాములుఁ జల్లని రాత్రివేళయు దక్షిణమునకుం జనిచని మఱునాఁడు సూర్యోదయమున కోసలదేశము నతిక్రమించిరి. ఆదేశ మిప్పుడు రామునిది కాదు గదా. వెండియుఁ గొండొకకాల మరిగి శృంగిబేరపురిచేరువ గంగాతీరమున నారేయి గడుపువారై నిలిచిరి. అప్పుడు వారిరాక నిషాదరాజు గుహుఁడువిని దివ్యాన్నములఁ దెచ్చి రాముని పాదారవిందముల కర్పించిన రాముఁడు సంతుష్టమానసుఁడై యల్లన వాని కిట్లనియె. నీవు ప్రియంబున నిట్లొసంగినయన్నము నాకుం బ్రియమయ్యెడుంగాని దానిని భుజింపరాదు. ఏను ముని వ్రతము సలుపువాఁడఁగావున గుఱ్ఱములకుఁ గావలసిన గ్రాసంబు తప్ప నొండేదియు గ్రహింపఁజాల. అని తిన్నని పలుకుల వాని నొడంబఱచె. మఱునాఁడు విశ్వాసపాత్రుని సుమంత్రుని వీడుకొనుచు రాముఁడు, తనకై పురంబున శోకించువానికిఁ బ్రీతిపూర్వకముగ దుఃఖోపశమనములగు పలుకులుపలికి పుత్తెంచెను. అంత గుహుండు తెచ్చినపడవ

నెక్కి సీతయును భార్గతయును దానును సురనదిని దాటెను. గృహామునకు గృహసౌఖ్యములను వడినడించి పొట్టు వెడలుపైన గంగానదికవ్వలి దిక్కునవీడనాడి వారివ్వలిదరికిం జేరిరి. అందా రాత్రి నివసించిరి. ఇదియె విజనవనంబున నొంటరిగ వారు గడపిన తొలి రాత్రి.

౫౮. ప్రభాతమున వారు గంగాయమునా సంగమమున నుండి ప్రయాగకు నడిచి యందు మహాయశోనిధి యగు భరద్వాజమునీంద్రుని యాశ్రమంబును జేరిన నా ముని వారల నాదరించి కుశలప్రశ్నముల నడిగి యతిథి సత్కారములం బూజించెను. వారలా రాత్రి సుఖముగ వసియించిరి. ఉదయమున మునీశ్వరానుజ్ఞాతులై వారుచూపిన త్రోవననుగుచు వాల్మీకియాశ్రమంబగు చిత్రకూటంబును బ్రవేశించిరి. అచ్చోట లక్ష్మణుం డొకపర్ణశాల నిర్మించిన సీతారామలక్ష్మణులు నిత్యకర్మములందీర్చి యీశ్వరునిభజించి దానిని సంతుష్టచిత్తులై ప్రవేశము చేసి కాపురముగం గుదిరిరి.

౫౯. అటసుమంత్రుండు రాముని వీడుకొని వ్యాకులచిత్తుం డగుచు నయోధ్యంజేరి రాజసందర్శనమున కరిగె. మొదట నరపతి దుఃఖమున మైమఱచి పలుకకుండియుం గొంతవడికిం దెలిసి వాత్సల్యమునం బుత్త్రిలక్షేమమును,

గోడలికుశలమును నడిగిన సుమంత్రుఁడు రాముఁడు చెప్పిన యనునయవచనంబులను జెప్పి యిట్లనియె. దేవా! సీత యెంతయు సుఖంబున్నది. అరణ్యమునఁ దరుప్రభులసందుల విరులపొందులఁ జిన్నకన్నియఁబోలె యాడుచున్నయది. క్రూరమృగంబుల కడలదు. ఆత్మస్వామి దృఢతరభుజా మును నమ్మి ధైర్యముతోఁ జరించును. నీకొడుకులును దృప్తులై యడవుల సంచరింతురు. వారికై చింతిల్లకుము. నేఁగ్రమ్మఱుచుండ రాముండిట్లనియె. రాజుతో నా మాటలుగ నిట్లనుము. మాసుఖంబునకుఁగొఱఁత యని చింతింపకుమనుము. భరతుని నభిషిక్తుఁ జేయుమనుము. సమ్మోదముననుండు మనుము. అని ఇట్లుసుమం త్రుఁడుపలుకఁ గౌసల్య తనకొడుకు రాజ్యమును విడిచి యడవులకరిగెడు నని యుల్లమల్లాడ దశరథుని దుఃఖమును మగనియందలి మర్యాదను మఱచి దశరథుని మిక్కిలి నఱకు లాడెను. అంత దశరథుఁడు మొత్తపడిచిత్తంబున శోకిలఁ చి దీనుఁడై చేతులు పిసికికొనుచు మన్నింపు మని యామె నల్లనఁ బ్రార్థించెను. అంత నయ్యుత్తమసతి సిగ్గుపడి తలవంచి పతికరములఁ దనశిరమ్మునమోపి నాథా! నిన్ను నాక్రూరవచనంబులను క్షమింపుమని వేఁడుకొనియె. ఇట్లా వృద్ధుఁడగురాజు మృదువగు వినయంబునం జేసి భార్యాభర్తల హృదయము లెడలేక కూడి యొప్పె.

౯౬. ఇదియేన్యాయము. ఇంపులుగులుకు వినయముచేత నోర్పుచేతను బగను ద్రోంచనగును. కౌసల్య నిష్ఠురవాక్యములకు రాజు వాడిమాటల మాటాడియుండెనేని పోరాటము హెచ్చిహెచ్చి వారి కిరువురకు వారింపరాని యెడఁబాటు చేకూరియే యుండును. అట్లుగాక రాజు వినయముతోడఁ బలికి భార్యగర్వమును విఱిచెను. తన్నునిందించు భార్యను దనయడఁకువచే జయించెను. దయచిగురొత్తు మెత్తందనమున భార్యకోపమును బోఁగొట్టెను. దానిచేఁ దనభార్య యుల్లమున వినయము మెత్తందనముఁ బల్లవింపఁజేసెను. కావునఁ బోరాటముతప్పె. ఒడఁబాటొప్పె. నాప్రియ శిష్యులారా! దీనికిం గారణము కనుఁగొనుఁడు. సహజముగ మనహృదయంబున జనియించు రాగద్వేషవృత్తులు పరుల హృదయములఁ బొంది వానికనురూపము లగు వృత్తులను వారలకుఁ బుట్టించును. మనమనోవృత్తులు దుష్టము లయ్యెనేని యవి తమను బొరయుచో మంచివారు వాని కెడమీయక ఆదుష్టవృత్తులకు వ్యతిరిక్తములగు సద్వృత్తుల వహింతురు. అట్టిసద్వృత్తులు మనంబునవాటి మనకును వాని కనురూపములగు సద్వృత్తులే పుట్టును. ఇట్లుందఱును నడుతురేని కలహములు లేక యన్యోన్యప్రేమ వర్ధిల్లును.

## దశరథుఁడు కౌసల్యతోఁ దనశాపమును జెప్పుట.

౯౭. మఱునాఁడు దశరథుఁడు కౌసల్యకుఁ దన చిన్ననాఁటి తప్పొక్కదానిం జెప్పువాఁడై యిట్లనియె. దేవీ, చిన్నతనంబున గర్వముచే నొక్క యొప్పని పని చేసితిని. రామవియోగమున నాముప్పిప్పు డనుభవించెద. అది యెట్లంటివేని వినుము. అస్త్రవిద్యానిపుణుఁడనని విఖ్యాతిఁబడసి శబ్దవేధి యనువిద్యచేఁ జప్పుడు పట్టి బాణముల నెక్కుపెట్టి గుఱితప్పక వేయనేర్తునని పేరుగంటిని. ఒక్కనాఁడు రాత్రిసమయమునఁ జీఁకటిలో బుద్బుదనినదమును విని ఋడె యొక యేనుఁగు నీరుద్రావెడు ననియెంచి నొక్కయమ్ముఁ బఱపిన నది చని యొక మునికుమారుఁడు తమసానదిలోఁ గమండలువు ముంచుచుండ వానిం దాఁకె. ఆతఁడు నొచ్చి యఱచిన నది విని నేను బశ్చాత్తాపమున మునింగి వానిఁ జేర నుఱికియు నాయువుపట్టు సోఁకుటం జేసి వానిని రక్షింప నేరనైతిని. తన వృత్తాంతము నాకెఱింగించి మునితనయుఁడు వెనువెంటఁ బ్రాణములఁ ద్యజించెను. ఏనేగి వృద్ధులగువాని తల్లిదండ్రులకీ దుఃఖవార్త నెఱింగించి వారిని గుమారుశవముపొంతకుఁ గొనితెచ్చితి. అప్పుడు వృద్ధముని పుత్త్రశోకభగ్నహృదయుఁడై యబుద్ధిపూర్వముగఁ బుత్త్రుని

జంపిన నన్నుఁగని నీవును బుత్త్రశోకమునఁ జావఁగల వని శపించి భార్యతోఁ దానును మృతుండయ్యె. ఆశాప మున నాకిప్పుడు చావు వచ్చునని తనవృత్తాంతము రాజె ఱింగించెను.

౫౮. ఇట్లు శాస్త్రములందు ఋషులును బుణ్య పురుషులును శపించిరని పలుమాఱుచదువుదుము. శాప ముల స్వరూపము ఇట్టిదని యరయవలయు. కొందఱు కోపమున శపింతురుగాని యది కారానిపని. అట్లు శపిం చువారికిఁ జెడ్డకర్మమువచ్చును. ధర్మవేత్తలును, త్రికాల జ్ఞులునగువారు కార్యగతులఁ జక్కఁగ విచారించి యలు గక శపించినచో నట్టిశాపములు శాపకారణములగు దు ష్కర్మఫలములఁ బ్రకటించునవియని గ్రహింపవలయును. మన మితరుల హింసించిన నాహింస మరల మనకవశ్యము రాఁబోవుకాలమున పోఁకవలయును. విల్లు వంచవచ్చును గాని వంచివదలినపిదప నది మరలఁ బూర్వరూపమును ధరించును. అట్లు సకలకార్యఫలములు గ్రమ్మఱఁ గర్త ను జేరును. క్షోభము పుట్టించినచోఁ బుట్టించువానిని దానిఫలంబుచేరును. గోడతోఁ బంతులాడువానిచేతికి గోడనుండి చెండు మగిడివచ్చు విధమునఁ దనకర్మము మగిడి తన్నుఁజేరును. దశరథుఁడు సిరపరాధియగు నొక

మునికుమారునిం జంపి తండ్రిమనస్సు నొప్పించెను. తాను
ను నిరపరాధియగు తనకొడుకును గోలుపోయి మనస్సు
న నొచ్చెను. మాత్సర్యంబునఁ గాక దంబమున నజాగ్రత
వలనఁ జంపెను గావున శోకమునఁ గుందెను గాని పాపము
ను బొరయఁడు. ఆశోకమును జిరకాలమనుభవింపఁడు.
అట్లు దశరథుఁడు తనవృత్తాంతమును ముగించి కొడుకు
నకై యాక్రందించె. దానిచే బడలి గుండెలుపగిలి నిశ్చే
ష్టితుఁడై దశరథుఁడు స్వర్గమున కరిగె.

౫౫. ఈఘట్టములన్నియుఁ గష్టములతోడను దుః
ఖములతోడను బూరితములయి యున్నవి. వీనిని జదువు
విద్యార్థులు ముఖ్యాంశ మొక్కటిదానిఁ జక్కఁగ నరయ
వలయును. శ్రీరామచంద్రుని వర్తనము జూడుఁడు.
తనతప్పొక్కటియు లేనిదయ్యు దురదృష్టమునకు లోఁబడి
యె. స్థూలదృష్టితోఁ జూడ నీయిడుములు రామునకు రాఁ
దగనివిగఁ దోఁచు. అవి వచ్చినప్పుడు రాముఁ డీమాయా
నాటకముచేఁ బ్రమాద మించుకేనియుఁ బొందఁడు. తనసు
డుపాటులకు వగవఁడు. ఇతరుల నాగ్రహింపఁడు. స్వకర్మ
వశంబున సమస్తము వచ్చుఁగాని యితరులు మనకుఁ
గీడునుగాని చెఱుపునుగాని చేయరు. ఇట్లు తానరసి
రామచంద్రుఁడు తనమ్రోలనుండు వారలకుఁ గఱ
పును. ఇదియే సనాతన సద్విధి. సుఖదుఃఖములు పురా

కృత పుణ్యాపాప ఫలంబులు. తన తొల్లింటి కర్మముల నుండి కలుగని బాధను దనకుఁగావింప నెవ్వరికిని వలఁతిగాదు. ఆబాధకై దుఃఖింపనేల ? పరులఁగోపింపనేల ? దుఃఖక్రోధములు పొందఁ గారణమేమియును లేదు. తనకర్మమే యన్యుని బ్రేరేపించి తనకుఁ గీడొనరించును. తనకర్మమే తనపై రాగద్వేషాదుల నెఱప నన్యులఁ బురికొల్పును. తనకర్మమే వారిని దండధరులుగఁజేసి కర్మఫలంబులఁ దనకుఁ గుడువనిచ్చును. వారును మాయామోహితులై తమలాభమునకుఁ బరుల కిట్టులొనరించితిమని తలంచెదరు. కాని తాము కర్మబద్ధులుగనుండుట యెఱుంగరు. ఈయంశమును విద్యార్థులు గ్రహింపవలయును. శ్రీరామచంద్రుని పుణ్యచరిత్రమున నిది తేటపడు. ఇది రాముని కాలమం దెట్లు లట్లు లిప్పుడును సత్యమేయగును. మనముచేయని ఋణముల నితరులు మనచే గ్రహింపనేరరు. మనముచేసిన ఋణములను మంచిబుద్ధితోఁ జక్కఁగఁ దీర్చుటొప్పు. ఋణములడుగ నప్పులవాఁడు పంపి నభృత్యునిపై కోపించుటసరికాదు. అట్లే విధివశముగ మన ఋణము లడుగవచ్చి మనకు కీడొనర్చి మనల ఋణవిముక్తులుగఁ జేయువారిపై మనమలుగరాదు. అలిగిన మొదటియప్పును వృద్ధిచేసినట్లగును.

౧౦౩. ఆమహారాజు మృతుఁడైపడియుండ నందఱు ను జుట్టునఁ జేరియేడ్చిన నార్తనాదములు పెల్లుగఁజెల్లె. మంత్రులు వేవేగ సభకూడి మంత్రాలోచనచేసి వసిష్ఠుని జేరి రాజకులమునుండి వేఱొకరాజును నియమింపుము. రాజులేనిరాజ్యము నుదకములేని నదియుఁ బచ్చికలేనివన మును గోపాలుఁడులేని యావులమందయుఁ గీడునగునని ప్రార్థించిన నమ్మునివరుండు వారల కిట్లనియె. దశరథుఁడు భరతునకు రాజ్యమిచ్చెను. ఇది మీరెఱింగినదియేకదా! భరతుఁడు మేనమామయింట శత్రుఘ్నునితో నున్నవాఁ డు. వానినిబిలువఁ బంపుఁడు. వడిగల దూతలఁబంపుఁడు. జనని నిర్యాణమునుగాని రాముని ప్రయాణమునుగాని యెఱిఁగింపకుఁడు. నీచే నవశ్యము గావలసిన పనులున్నవి. వేగముగ వచ్చి నడిపింపవలయునని సందేశమంపుఁడు. అని న వారలట్లు చేసిరి.

## భరతుఁడయోధ్యకువచ్చి తల్లినిదూఱుట.

౧౦౪. తత్పూర్వమే భరతుఁ డొక్కచెడ్డ కలఁగని యయోధ్య కొండలమునఁ గుందుచున్నదని సందియ మందియేయుండెను. కలలోఁ దనతండ్రి కల్మషకాసారము న మునిఁగినట్లును, ఖరములఁ బూన్చినతేరెక్కి దక్షిణము నకుఁ జనుచున్నట్లును జూచి దానిచేభయమంది తనతం

డ్రియో యున్నదమ్ముల్లో మృతులైరని వగచుచుఁ దనక
ల స్నేహితులకుఁ జెప్పుచుండ నయోధ్యనుండి వచ్చిన
దూతలు వానికింబ్రిణమిల్లి యేలినవారి నయోధ్యకుమన
లక పయనము సేయుమనిరని విన్నవించిరి. భరతుఁడు
దానినివిని మదిలోని కలఁత యినుమడింప బంధువులవీడు
కొని శత్రుఘ్నుని దోడ్కొని యేడుదినంబులు ప్రయా
ణముచేసి యయోధ్యను జేరెను. ఎడలేక జనసమ్మ
ర్దమునఁ గలకలలాడు విశాలవీథుల విలసిల్లు పుర
మేలొకో నిశ్శబ్దముగనుండెను. ఏలొకో రాజమార్గము
లఁ దుడువరు. ఏలొకో దీనవదనులై కన్నులు కలఁకఁ
బాఱఁ బౌరులున్నవారని మనంబున భరతుఁడు నొ
చ్చెను. ఇట్లు నొచ్చుచు రాజసౌధంబుఁ జొచ్చి జననీ
నివేశమును బ్రవేశించి తల్లికెఱఁగి డగ్గుత్తికతోఁ దడఁ
బడుచుఁ దండ్రియేఁడి ? మాతండ్రి యెందున్నవాఁడు.
నీతోడనిందేల లేఁడు. అని యడిగినఁ గైకయుఁ దడఁబడక
మీయయ్య పరలోకగతుం డయ్యెననియె. శకునము లా
మరణమును సూచించి యుండియు నది నిజమయ్యెనని
దుఃఖవార్త వినిసంతన నిలువనోపక భరతుండు నేలంగూలి
మూర్ఛిల్లె. అంతఁ దెలిసి కూరుచుండి తల్లియెంత యోదా
ర్చిన నూఱడిల్లక విలపించుచుండె. అయ్యో! శ్రీరాముం
డును దర్శింగల వా రెంతటి భాగ్యవంతులు ? అంత్య

కాలమునఁ దండ్రిచేరువనుండి సేవించిరి. నాకింక రాముఁడే తండ్రి. రాముఁడే యన్న. రాముఁడే చెలికాఁడు. ప్రియ భృత్యుఁడనయి యింక నేను రాముని గొలిచెద. తల్లీ రాముఁ డెందున్నాఁడు. రామదర్శనమున కరిగెద. అమ్మా, తెలియఁ బలుకుమా. మఱియు నొక్కటి యడిగెద. తల్లీ తండ్రి యంత్యవార్తల వినిపింపుము. మొదట నావార్తల వినవలంతును. అని యడిగినఁ గైకేయి తనతనయున కిట్లనియె. మీ తండ్రి కట్టకడపట నిట్టులనియె. శ్రీరామ చంద్రుఁడు సీతాలక్ష్మణులంగూడి యయోధ్యకు మరల వచ్చునప్పుడు వారిని జూచుభాగ్యమే భాగ్యము. అసిన తల్లి చెప్పినదేమియుఁ దోఁచక భరతుఁడు వారెందుల కేగిరని యడుగఁ గైకయు మనంబునఁ గొంకక యిట్లనియె. రాముఁడు నారచీరలు గట్టి సీతాలక్ష్మణులతో నడవుల కేగెనని నామాటలకు వెండియుఁగుంది భరతుఁ డేమిది,. మా యన్న తాపసియయ్యెనే. రాజ్యభ్రష్టుఁ డయ్యెనే. కటకటా! యనింద్యుఁడనుపముఁడు. నాకుంగూర్చు జ్యేష్ఠుఁడు. ఆ పాపదూరుఁడేమి పాపమునుజేయ రాజ్యము నుండి వానిని వెడలఁగొట్టవలసెనని యడుగుచు వేదనలం బడుచున్నఁ దల్లి తామసింపక వాని కిట్లనియె. రాముఁడే పాపముం జేయఁడు. వత్సా! సీతల్లినగు నేనే రాముని పోక కును రాజ్యము రాకకును గారణము. రాజునొద్ద మాట

చెల్లిన దానను గావున నిట్లనుప పఱచితివి. కావున నీకని నేదకిం-చిన రాజ్యమును జేకొనుము. మీతండ్రి కుత్తర క్రియలం గావించి కిరీటము ధరింపుము.

౧౨౨. అని యిట్లాకస్మికముగ పసరానిమాటలు పలికిన భరతుండు కుపితసింహమువలెఁ జెంగలించి తల్లిపై తిట్లను గుమ్మరించెను. అన్న నడవికి వెడలించితివి. అయ్యను జంపితివి. అపకీర్తి నాకుంగూర్చితివి. పెద్దవాని పదవి నన్యాయముగ నాక్రమింపఁ జేసితివి. అయ్యో! మాతృ రూపశత్రువా. అగ్నింబడుము. దండకవనముం జొరుము. కాదేని మెడ కుఱిపోసికొనుము. నీకుచితమగు గతి వే ఱొండు లేదు. అని క్రోధమూర్తియై జననినిదిట్టి మంత్రు లంగని యిట్లు పలికెను. మంత్రులారా, నే నెన్నండును రాష్ట్రముల కాశింపను. నాతల్లితో రాజ్యవిషయములగు మాటలాడను. ఈ మహాపాపములు చేసినప్పుడు నేనిందు లేను. అతిదూరమున నుంటిని. అని నొక్కి-పల్కి- కౌసల్యం గనుంగొన శత్రుఘ్నుఁడుఁ దానునుం బోయెను. ఆమాన వతియు భరతునిఁ జూడవచ్చునది మార్గంబున వారలంగని యిట్లనియె.

౧౨౩. బిడ్డా రాజ్యంబు నార్జించితివే. నీకు శుభం బగుఁ గావుత. నన్ను వనభూములకు రాముని చెంతకుం బంపుమని పొడుపుమాట లాడెను గాని యంతలో భర

తుఁడు నిరపరాధి యనియు నాచెడుమోస మెఱుఁగని వాఁడనియు నెఱింగి యగ్గలంబగు దుఃఖమున మునింగిన వాని నాశ్వాసించుచుండె. అంతట వసిష్ఠుఁడువచ్చి భరతుని దండ్రి యుత్తరక్రియలకుం గడంగుమని నియమించెను. భరతుఁడు దుఃఖభరితుఁడయ్యు నిగ్రహించి యట్లొనరించె. తైలరక్షితమగు తండ్రి శవమునుదీసి చితింజేర్చి యగ్ని క్రియలాదిగ మృతక్రియల యథావిధిగఁ గావించెను.

## శత్రుఘ్నుఁడు మందరను దండించుట.

౧౦౪. తదనంతర మొక్కయెడ భరతశత్రుఘ్నులు దుఃఖంబున రామునింగూర్చి సంభాషించుచుండ దురదృష్టవశంబున నచ్చటికి మందరవచ్చెను. అది స్వర్ణాభరణభూషితయై మెఱయు వస్త్రంబుల సింగారించుకొని భరతునకుం గద్దియనిప్పించితినని తన్నా రాజు సత్కరించునని యువ్విళ్లూరుచు విచ్చేసిన దానియాడంబరములంగని సహింపనోపక క్రోధంబున మనంబెఱియ దానిని శత్రుఘ్నువలనకుం ద్రోసి యోదుర్బుద్ధీ! నీకారణంబున మాకెంత దుఃఖము గలిగెనని దూఱుచు దానినీయిచ్చవచ్చిన విధంబున శిక్షింపుమనియె. శత్రుఘ్నుఁడు దాని దోషములఁ దలఁచెఁగాని యదియబలయగుట మఱచి నేలపైఁ బడఁద్రోసె. కైకయెదుర దానిఁద్రోసె. దానం దనియక పరుషవచనంబుల దాసినిం గైకను దిట్టిన భరతుండు

స్త్రీలవధ్యలను ధర్మమునుబోధించి దమ్ముని నివారించె. వీరు ముదితలు గదా. పాపియగుమందరనైనను జంపుట తెలిసిన రామచంద్రుఁడు మనపై నలుగును. అనుచు వానిని మరల్చి భీతలగు స్త్రీల విడిపించె

౧౦౫. అంత మంత్రిపురోహిత ప్రముఖులై మహాజనులు వచ్చి దేశంబనాయకంబై యున్నది. నీవు సింహాపీఠమునఁ గూరుచుండుము. అని భరతునిఁ బ్రార్థించినఁ జపలుఁడు గాక కోపంబున భరతుఁ డొల్లకుండెను. జ్యేష్ఠుఁడే రాజ్యము చేయుట మాకుల ధర్మము. ఈధర్మమతిక్రమింపుమని నన్నుఁ బ్రేరేపించుట ధర్మజ్ఞులగు మీకుం దగునే. మానలువురిలోఁ బెద్దయగు రాముఁడే రాజు. ఇది నిశ్చయము. నేనేపదునాలుగేఁడు లడవినుండెద. మంత్రులారా! దండును సమకూర్పుఁడు. వనమార్గములఁ జక్కఁజేయ మనుష్యుల నియోగింపుఁడు. రాముఁడు దనరాజ్యమును వహింప వచ్చును. తగు విధంబున రాజ్యాలంకారముల రాజోపచారముల నాయతము సేయుఁడని నియోగించెను.

౧౦౬. వారలెంత చెప్పినను నేను రాజుగాను. నేరాజునుగానని మాటిమాటికి నిశ్చలముగ భరతుఁడు మాటుపలుకుచుండె. ఎట్టకేలకు వసిష్ఠుండును జనకుఁడు నీకనియిచ్చినరాజ్యము పాలించుటుచితము. అట్లు చేయుమనిన గురువచ

నంబులను జెవిపెట్టక వాఁడిట్లనియె. రాజ్యమును రాముని నుండి నేనెట్లపహరింతును? దశరథుఁడెట్లట్లు రాముఁడు రాజ్యమునకు రాఁదగువాఁడు. వనవాసుండగు రామునకు మ్రొక్కెదను. వానివెంట నరిగెదను. పురుషోత్తముఁడగు రాముఁడే రాజు. అని గంభీరోక్తులఁ బలికె. ఎన్నివిధంబుల నితరులు వానిని రాజ్యమును గొనుమని మోహింపఁజేసినను వాని మనంబు కదలదు. ధర్మమునఁ జలించక నిలిచె. భృత్యుఁడనగుదును గాని రాజును గానని పట్టుపట్టి గట్టిగ నుండె.

భరతుఁడు రాముని జూడ నేగుట.

౧౦౭. అంతట రాముని రాజుగాఁ జేసి క్రమ్మఱ పురంబునకుఁ గొనితెచ్చువారై వేలకొలఁది మహాత్మ్యనమునఁ గదలిరి. సేన దీరనడిచె. సేనతో వేనవేలు నాగరికులనుగమించిరి. ఎల్లరుల్లంబుల సంతసిల్లి రామచంద్రుఁడు మరలి వచ్చును. శ్రీరాముఁడు వచ్చి పాలించునని హృష్టమానసులై నడుచుచు గంగానదిని జేరి విడిసిరి. అచ్చట నిషాదనాథుఁడగు గుహుఁడు వీరు రామునకెగ్గొనరింపఁ జనువారని తలఁచి వారి నడ్డగింప దండుఁజేర్చికొనియు సత్యము తెలియుటకై భరతుని దరియవచ్చి యతని మనోవాంఛిత మరయువాఁడై గుహుఁ డిట్లనియె. ఏలినస్వామీ నాయోగిరమును గనికరమున నారగింపుము.

నేఁటి రాత్రి నా నెలవున నిలువుము. అని యాతిథ్య మొసం
గె. పదంపడి భరతుఁడు భరద్వాజు నాశ్రమం బెందుండు
ననియడిగిన గుహుండు సవినయముగ నయ్యా, అయ్యది నే
నెఱుంగుదు. అందేమి పనిపూని సేనం గొనిచని యెదవు. ఈ
మహాసేనను జూచిన రాముని కెగ్గు కలుగునని తోఁచె. అనిన
భరతుండొకింతయు దుష్టచింత లేనివాఁ డగుటం జేసి శాంత
మున ముఖము వికసింప నోర్పు మెఱయ నల్లన నిట్లనియె.
రామునకుఁ గీడు చేయు కాలము నా కెన్నండును రాకుం
డునుగాక. నన్ను శంకింపఁ దగదు. రాముఁడు నాకు జ్యేష్ఠ
భ్రాత. కన్నతండ్రివలె నాకుఁ బ్రేమాస్పదుఁడు. వనవాసి
యగు రాముని పట్టణంబునకుం గొని తేర నేఁబోయెద.
అన్యబుద్ధినిగాదు. నేను సత్యము పలికెదననియెను.

౧౦౮. ఆమాటలకు గుహుఁడు ప్రహర్ష మొంది భర
తా, నీవు ధన్యుఁడవు. సామాన్యుఁడవుగావు రాజ్యము
యత్నము లేక చేకూడినది. నీవు కోరుదువేని నిరాక్షేపము
గ దాని ననుభవింప వచ్చును. అట్లు కోరక రామునకు
దాని నప్పగింపఁగ నింత ప్రయత్నము చేసెదు. నీకీర్తి శా
శ్వతమై దిగంతవిశ్రుతమై వెలయునని కొనియాడియు నన్న
వార్తలు విన నువ్విళ్ళూరుచుండు భరతునకు సీతారామ
లక్ష్మణులందుండి రాత్రిగడిపిన చందము నెఱింగించె. అచ
ట నిశాద్వలమున రాముఁడును సీతయును బరుండి నిదు

రించిరి. లక్ష్మణుఁడు విల్లుపూని వారిని రక్షించుచుండె.
అని గుహుఁడు భరతునకుఁ దెలిపిచూపె. ఆసంభాషణ
మెంతయు హృదయంగమము. మీరలాది కావ్యమున మూ
లగ్రంథమునఁ జదువ వలయును. అన్నయిడుములం
దలంచి భరతుఁడు వేపమానహృదయుండై యొక్కొక్క
విషయమును విస్తరముగఁ జెప్పుమని గుహునిచే నరయు
చుఁ గరుణతో నన్నకై శోకించుచుండె. ఆయిడుముల
వనవాసాగతులగు సీతారామ లక్ష్మణులేమో యెంతో సు
లభముగఁ గడిపి పుచ్చిరి. [అంతట భరతుఁడు శ్రీరాము
ని కష్టములను దనసంపదలను దలంచి యిది పోలదని
యప్పుడు సకలజనులు మంత్రులును జూచుచుండ నిట్లు
ప్రతిజ్ఞపూనెను. నేఁడు మొదలు నేను భూమిమీఁదఁ బ
రుండెదను. తృణములపై నిదురించెద. నిత్యము ఫలము
లే భుజించెద. అని జటావల్కలముల ధరించెను. రాముని
పై భక్తి నెఱపి యిట్లు చేసెను.]

౧౦౯. అమ్మఱునాఁడు తన సైన్యముతో భరతుఁ
డు భాగీరథినిదాఁటి త్రోవనడిచి ప్రయాగచేరెను.
ప్రయాగ నగరప్రాంత్యమున నాసైన్యము నిలిపి యాయు
ధములఁ గవచము నవలఁబెట్టి భరద్వాజముని దర్శనము
నకు వసిష్ఠుని వెంట నరిగె. అందు నమ్మునివరుండు భర
తునింగని యన్నపైఁ బాపబుద్ధిఁ గొన్నవాఁడవేయని నేర

ము మోపిన నమ్రతయు స్త్రైరణయు మెఱయ నలుగక పద రక తానన్నను నగరమునకు మగిడితోడి తెచ్చెద ననవుడు సంయమీంద్రుఁడు ప్రసాదమున వానిని దీవించి నీమన స్సునెఱింగియు నీపూనికధృఢము చేయ నట్లడిగితినని వెం డియు నిట్లనియె రాజకుమారా! నాయాశ్రమంబున నీవీ రాత్రి విశ్రమింపుము. నాయందలిగౌరవంబున దూరము న విడిది చేసిన దండుకుగొనిరమ్ము. అని యోగివరుండు భరతునకును వాని సేనకును నివాసంబులు సిద్ధపఱుప దేవ శిల్పియగు విశ్వకర్మను, వారలకుచితములగు విధినత్కా రంబులను గావింప దేవతలను వేఁడిన వారు నలుదిక్కు లనుండివచ్చి సహాయులైరి. భరతునకును వానిపరివార మునకును దగు భంగుల భవనములవిశ్వకర్మ నిర్మించి శుచిదివ్య ప్రభాభానుర చతుశ్శాలలఁ గూర్చెను. దేవ తలు వివిధములగు నుత్తమభోజ్య పదార్థముల నమర్చిరి. గంధర్వాప్సరసలు మనోజ్ఞముగఁ బాడియాడిరి. అందఱు నానందహృదయులైరి. భరద్వాజముని యట్లు తనకై తృణమునైనను గోరని మానవుఁ డొరుల కిట్లు సంతుష్టిగ నీఁగలఁడు.

### భరతుఁడు రాముని జూచుట.

౧౧౦. ఇట్లు రాత్రిగడిపి ప్రభాతమున భరతుఁడు భరద్వాజానుజ్ఞాతుఁడై చిత్రకూటమునకు నడిచెను.అంద

తని యనుచరులు రామునకై యెల్లెడల వెదకిరి. కొంత వడికి నొక్కచోఁ బొగ స్తంభాకారముగ నెగయుచుండిన నిది జననివాసముగనుండనగునని గుఱుతించి భరతునకుఁ దెలిపిరి. అంత భరతుఁడు మీరింక వెదకకుఁడని వారించి యెల్లర నందుండ నియమించి సుమంత్రశత్రుఘ్న సహితుఁడై తన కెంతయుఁ గూర్చు భ్రాత నరయఁ బోయెను.

౧౧౧. అచట లక్ష్మణుఁడు భక్తివిశ్వాసములఁ గొలుచుచుండ సీతారాములు వనంబున సుఖంబుండిరి. నాఁడు వారాహారముఁ గుడుచుచుండ మృగములు జడిసి యురవడిఁ బఱతెంచు కాలిచప్పుడు విని రాముఁడు తమ్మునిఁ జూచి యిది యేమి శబ్దమో యొకచెట్టెక్కి తెలిసికొనరమ్ము. అని పలికిన లక్ష్మణుం డట్లుచేసి యిట్లని యరచెను. ఓయగ్రజా! ఆయుధముల ధరింపుము. గుహాలోపల నేను బదిలముగ నుంచుము. ఇదిగో మనలఁ జంప భరతుఁడు సేనాసమేతుఁడై వచ్చెను. అసియుఁ గోదండమూ నిచ్చెను పెలుచన నిట్లనియె. భరతు నే నిప్పుడు చంపెద. వాని వలననే కదా వనవాసము మనకుఁ బాటిల్లి మహావ్యసనములఁ బడెదము. అనఁగ రాముఁడు అల్లన లక్ష్మణుని బిలిచి తనయందలి ప్రేమచే వానికిఁ గలిగిన కోపమును శమింపఁ జేయుచు నిట్లనియె. కుఱ్ఱా ఇట్లుకోపింప ధర్మమా.

తమ్మునిఁ జంపెనని యపవాదమును దెచ్చిన రాజ్యసంపద నాకింపగునే. మీ మువ్వురు తమ్ములకుఁగాని యేసుఖంబును నాకు సుఖంబగునే. భరతుఁడెన్నఁడు నన్నదమ్ముల కప్రియంబు సేయఁడు. మనంబునను దలఁపఁడు. మనయందలి స్నేహంబునవచ్చెను. నీవు రాజ్యము కోరెదే చెప్పుము. అట్లైన భరతుఁడు నావేఁడినరాజ్యము నీకిచ్చును. అనిపలికిన లక్ష్మణుఁడు తత్క్షణంబ పశ్చాత్తాపమునొంది కోపంబుడిగి. ప్రూనుడిగి. గుడిసెలోనికి వచ్చెను. అందు మువ్వురు కార్యగతుల నిరీక్షించి యుండిరి.

౧౧౨. భరతుఁడును శత్రుఘ్నసుమంత్రులతో వచ్చి వనమునరసి కొంతసేపటికి రాముని పర్ణశాలఁ జేరి దానియెదుటనిలిచి భరతుఁడు లోనఁజూచె. సీతాలక్ష్మణులతో నేలపైఁ గూర్చుండియుండు రాముని జటామండితభూషణుని కృష్ణాజినధారుని చీరవల్కలవస్త్రింగని భరతుఁడొక్కయడుగడుగిడి పరుగెత్తి రాముని పాదారవిందములంబడి వివశుఁడై పొక్కుచు వెక్కివెక్కి యేడ్చెను. హా! మహాత్మా, హా మహాత్మా, ఉత్తమరాజ్యము నేలఁజాలు నీవిట్లు పేదతాపసివలె నుండదే. నీకీవేసము వచ్చెనే. నారచీరలఁ గట్టవలసివచ్చెనే. జటాభారము దాల్పవలసెనే. మృగచర్మము సింహాసనమయ్యెనే యూర్ధ్వస్థానముల విలపించె.

## రామ భరతుల సంవాదము.

౧౧౩. రాముఁ డాదరమొప్పఁగా ననుజు నక్కునఁ జేర్చి కౌఁగిలించి కూర్మియు ముదంబును దోఁపఁగా నిట్లు పలికెను. భరతా, నీవిందు రాగతంబేమి? తండ్రి యెం దుండెను. సుఖంబగునే. కాదేని స్వర్గమందెనే. ఇదియేమి రాజ్యభ్రష్టునివలె నుండెదు. నీవు బాలుండవు. బలశాలివి. నీనుండి రాజ్యమెవ్వరు గ్రహింతురు? నీవెట్లు రాజ్యము గోలుపోయెదు? అది యట్లుండనోపదు. అని పలువిధం బులఁ బ్రశ్నలనడిగె. రాజ్యసుఖంబును, బ్రజలసౌఖ్యం బులును, భరతు రాజ్యపాలన కౌశలమును నాదిగఁ బె క్కువిషయములఁ జెచ్చెఱ రాముఁడడిగె. తనకుం బ్రి యంబైన దేశమునుండి వచ్చెనని యెంతయు మచ్చికతో నరయవేఁడెను. భరతా, నీవిందులకేల నచ్చితివి. రాజగు నీవు జింకతోలేల కట్టితివి. జడలేల తాల్చితివి. మునివృత్తి నుండెదవేల? అనియు నడిగెను.

౧౧౪. అంత సంగ్రహముగ భరతుఁడు రామునకు జనకుఁడు పుత్రశోకపీడితుఁడై స్వర్గమున కరిగెననియుఁ దా రాముని నింటికిఁ గ్రమ్మఱఁ గొనిపోవవచ్చితిననియు రా ముఁడు తండ్రి రాజ్యపదంబునఁ దాఁడె ప్రతిష్ఠితుఁడు కా వలయుననియుఁ దెలిపెను. రాముఁడు చలింపక మృదు వచనములతో నిట్లనియె. మనతండ్రి పదునాలుగేఁడులు

వనవాసము నాకాజ్ఞాపించెను. నిన్ను రాజ్యమును బా
లింపం బంచెను. ఇట్లు నియమించె. తండ్రిమాటను మన
ము జరపవలయు. అనిన నప్పటికి భరతుఁడు ఆమాట
నట్లుండనిచ్చి తండ్రికిం బిండోదకము లొనర్పవలయు
ననియె. నలువురన్నదమ్ములు సీతయు నదీతీరముఁ జేరి ప్రి
యంబుతోఁ దండ్రికి స్వర్గసుఖంబులు ప్రాపింపఁ దర్పణ
మొనరించి పర్ణశాలకుం గ్రమ్మఱ వచ్చిరి. ఇల్లు సేరి
తండ్రిని దలంచి దుఃఖించిరి.

౧౧౫. అంతటఁ బర్ణశాలకు వసిష్ఠుండును దశరథు
భార్యలును వచ్చిరి. అట్లరణ్యమున జననీతనయు లొండొ
రులతోఁ జేరి దుఃఖంబున రాత్రి గడిపిరి. పూర్వము నంద
ఱేకీభవించి సుఖమనుభవించిరి. అట్లే ఇక్కాలమున నం
దఱు కలిసి సంతాపము నొందిరి. ప్రభాతమున భరతుం
డన్నంగని రాజ్యభారము చేకొనుము. నీవంటి బలశాలి
యగువాఁడు పాలనము చేయఁదగునది. అని పలువిధంబులఁ
బ్రార్థించి భరతుఁడు దుఃఖమున విలపించుచుండ రాముఁ
డర్థవంతములగు బోధనలఁ జేసి మృతి వారింపరానిదనియు
నది దినదినము సన్నిహితమగుచున్నదనియుఁ దెలిపి భర
తా! నీవు తండ్రికై యడలకుము. ప్రాణంబులున్నప్పుడే
ప్రయత్నముచేసి స్వర్గసుఖంబుల నార్జింపుము. అని గఱ
పిన భరతుఁడు రాముని శాంతంబును బ్రశంసించి యుక్తి

ముఁడవగు నీవు రాజ్యమేలఁదగుదువు. మరలిరమ్ము. అట్లు సేయుదువేని నాతల్లి కారణమునఁజేసిన పాపమునుండి తండ్రిని విడిపింతువు. నీవు రాజవైతివేని పెద్దవానికి వెలి పుచ్చెనను దోషము నాకు వీడును. అని స్నేహా త్సాహములఁ బెక్కుభంగుల వేఁడినను రాముఁడు కద లక నిలిచియుండె. ఎవమియ్యఁడయ్యె. భరతునకుఁ దోడు గఁ దక్కినవారును బ్రార్థించిరి. వసిష్ఠుఁడును నేను నీకును మీతండ్రికిని ఆచార్యుఁడను. నామాటల గౌరవింపవల యును. వినుము. కిరీటము ధరింపుము. దానం బాపము రాదు. ఇదియే నీకు సరియగునది. గురువాక్యములను జేకొనుము. అని పలికిన నమ్మహనీయుని వచనంబులకేని యుఁ జలింపక రాముఁడు ధర్మనిష్ఠుఁడై నిలిచి తండ్రి యాజ్ఞను మిథ్యావాక్యముగఁ జేయరాదు. అనిన భరతుఁ డేనును గాననమునను౦డెద ననవుడు వానికి రాముఁ డిది తగదు. నీకిడినపని నీవుచేయవలయు. నేనుండెద నీవునొండె దండ్రియానతి మీఱఁదగునే. అని సందియక యున్న యన్నయనుగుఁ దమ్ములకుఁ దమ్ముఁడు మ్రొక్కి రామా, నీప్రతినిధిగ రాజ్యముసేయ నీకుం బ్రియంబగు వానిని నియ మింపుము. అని ప్రార్థించిన రాముఁడు వాని వినయమును గొనియాడి నీవే నాప్రతినిధివై యుండుమనియె. దానిని శిరసావహించి భరతుఁడు కోరిన హేమభూషితములగు

తనపాదుకల వానికిచ్చి కొంతకాలము రాజ్యతంత్రము
నీకిచ్చితి. దానికీ పాదుకలు చిహ్నములు. అనిన భరతుం
డును రాముఁడడవులనుండు పదునాలుగేఁడులు నేను దా
పసివలెఁ గాషాయవస్త్రధారినై జడలఁదాల్చియుండెద.
ఫలమూలముల భుజింతును. నగరమునకు వెలుపల వసిం
తును. రాజ్యాధిపత్య మీపాదుకలందునిచి రాజుమాఱు
గ నుందును. జనులెల్లరు రాముఁడే మహీపాలుఁడని యె
న్నుదురు. అని ప్రతిజ్ఞచేసి భరతుఁ డట్లు చేసెను. వనంబున
నుండి మగిడి నగరంబుఁ జేరి భరతుఁడు రాణులనంతఃపురం
బున నునిచి తాను నందిగ్రామమున నుండె. అందు నిట్లు
ప్రకటించె. ఈ రాజ్యము నాకన్నయగు రాముఁడు నాచే
తుల నునిచినాఁడు. ఇది నాది కాదు. ఈ రాజ్యమును శ్రీ
రామపాదుకలు వహించియుండు. ఈపాదుకలకు ఛత్రముఁ
బట్టుఁడు. రాముఁడు వనములనుండి వచ్చిన నీపాదుకల
రాముని పాదములకుఁ దొడిగి రాజ్యమప్పగింతును. అని
చెప్పియుఁ బలికి రామప్రతినిధియై రాజ్యము ధర్మజ్ఞుఁడగు
భరతుఁడు భక్తితో నేలుచుండె. రాముని రాక నేచి ముని
వృత్తి నుండె.

౧౧౫. భరతుఁడు వీటికి వెడలిన రామునకు యథా
ర్థముగ వనవాసమారంభమయ్యెను. సర్వవిఘ్నములు
నిశ్శేషముగ గడచెను. అడవినుసికిఁ దప్పింపరా నింకేమి

యున్నది ? వేఱొదియును లేదు. ఆచిత్రకూటమునందు దమ్ముని శోకంబుఁదలఁచి రాముఁడు వేపమానహృదయుఁడై యందుండనొల్లక తరలిచని ముందఱ మహాయశోనిధియగు నత్రిముని యాశ్రమంబునకరిగె. ఆయాశ్రమంబున నత్తఱి నత్రిపత్నియగు ననసూయయునే తెంచె. ఆయశస్విని మహాయోగిని. అత్రి రామునకెఱింగించిన తెఱంగున సర్వభూతములచే నమస్కరింపఁదగిన మహిమల వెలుంగునది. వృద్ధయగు నాయవ్వయు మవ్వంపు జవ్వనియగు సీతయుఁ గొంతతడవు సంభాషించిన నాసీత కోమలమందవచనంబులకు నమ్ముద్దరాలిబుద్ధికి మహాత్మురాలగు ననసూయ యరుదుగ మెచ్చుకొనియె. ఆమునిదంపతులచే స్వస్త్యయనము (దీవనలు) వడసి క్షత్రియదంపతులు వనమార్గమున నడిచిరి. రామునియందు నీడని విశ్వాసముతో వారినెప్పుడువిడువక మెలంగు లక్ష్మణుఁడును వారివెంట నడిచెను.

# అరణ్యకాండము.



## విరాధవధ.

౧౧౭. తదనంతరము దండకమను మహారణ్యమును తపోజనాశ్రమమండలమయ్యును నిశాచరనిబిడమునగు దానిం బ్రవేశించి నడుచుచో సీతకు భద్రముగలుగ లక్ష్మణుండెదురను, రాముఁడు పిఱుందను నడువ వారిమధ్యమున సీతయరుగుచుండెను. మార్గమధ్యమున నిట్లు సురక్షితయై చనుచుండిన వికృతాకారుఁడు భీమబలుఁడు నగు విరాధుఁడను నొక్కరక్కసుఁడు హఠాత్తుగఁ గవిసి వైదేహి నెత్తుకొని కొంతదవ్వరిగి దీనిని మగుడఁజేకొనుఁడీ చూతమని సగర్వవాక్యములఁబలికె. అన్నదమ్ములెన్ని యమ్ములుపఱపినను అవి వమ్ములై బండపైరాలు వడగండ్ల వడువునఁ జెదరుచుండె. అప్పుడు విరాధుఁడు మైథిలిం డిగవిడిచి రామలక్ష్మణుల బిగియఁబట్టి మూపులమోసి కొనిపోవుచుండ మృత్యుదేవతను మోయునాసన్నమరణునిచందమయ్యె. రామలక్ష్మణులును వానితోఁ బోరాడి బాహువుల విఱుగఁగొట్టి నెట్టన వానిని నేలంగూల్చిరి. కూలిన రాక్షసదేహమును క్షత్రియపుత్త్రులు గ్రుద్ది మట్టిం

చిన వానిప్రాణము కంఠగతముకాఁగా రాజకుమారు లొ క్కచోక్కఁద్రవ్వి దానిలో వానిని బడవైచిరి. రాక్షసుం డత్తఱి వారింగని రామచంద్రుని నెఱింగి యితఁడే యను గ్రహించివచ్చి తన్ను శాపవిముక్తునిఁజేసెనని యానందిం చెను. పురాకృతపాపవశంబున వచ్చిన రాక్షసరూపం బ నుచెఱనుండి రాముఁడు తప్పించెనని సంతసించుచు మృతుఁడయ్యె.

## రాముఁడు శరభంగునిఁ జూచుట

౧౧౮. రాక్షసుఁడు బోధించిన విధంబున రాముఁడు సీతంగూడి లక్ష్మణునితో శరభంగమహర్షి యాశ్రమము నకుం జేరఁజనియె. పర్ణశాలప్రోల నింద్రుండు పెక్కు దేవతలంగూడి మునీశ్వరదర్శనార్థము వచ్చియుండె. దేవ తలప్పుడును మునివరులఁ గొలువవత్తురు. ఇంద్రునిగని రాముఁడు సీతాలక్ష్మణుల విడిచి తానొక్కరుండ మునివ రుంజూడ వచ్చెంగాని వానిరాకంగని యింద్రుఁడు చెచ్చె ఱ శరభంగుని పీడ్కొనువాఁడై వానిఁగొలిచి యోగివరే ణ్యా, రాముఁడు నీదర్శనమునకు వచ్చెడు. నన్నుఁజూడ నతని కింకను దఱిగాదని విమానమెక్కి వినువీధి స్వర్గమున కరిగె. పిదప సీతారామలక్ష్మణులు మునినాథుఁగొలువ వచ్చిరి. రాముఁడు సంయమీంద్రా! నేనేదిక్కునఁ జనఁ దగు నానతీయవే యనియడిగిన శరభంగుఁడు సుతీక్ష్ణముని

పతిఁగని వాని చెప్పినతెఱఁగున నరుగుము. వత్సా, యొక్కముహూర్తకాలము నన్నుంజూడుము. పాము పొర విడుచు విధంబున నేను గాత్రముఁ ద్యజించెదనని రాముని నిలిపె.

౧౧౯. శరభంగుఁ డగ్నిసమాధానముచేసి మంత్ర పూర్వకముగ నాహుతుల నిచ్చి యగ్ని ప్రవేశముఁ గావించె. సర్వభక్షకుఁ డతని జీర్ణదేహమును దహించెను. దానినుండి మునివరుఁడు తేజోవిరాజిత కుమార స్వరూపమున విలసిల్లుచు వెలువడి యూర్ధ్వలోకముల కుం జనియె.

౧౨౦. ఇట్టిచావునకు మానవుని చావుబ్రదుకుల తత్త్వమెఱుఁగని వారి మనంబులు కొంత యనుమానము నొందు. ఆత్మహత్యామహాపాపమే యగును. ఇది సరియే. కావున నమ్ముని కథఁ జదువువారును వినువారును మహ ర్షు లెట్లు చత్తురే. ఈపాపమునఁ బడుదురేయని విచా రింతురు.

౧౨౧. సంసారమందుండు ప్రాకృత స్త్రీపురుషులకు బాలురకును నాత్మహత్య యత్యంతనింద్యము. ఒక్క రుండు బెట్టిదంపుఁదప్పుచేసి యది బయటఁబడునని జడిసి తాఁజేసినపాపమునకు ఫలమును దప్పించుకొనఁగోరి తన ను జంపుకొనును. అట్లుగాక తాఁగోరినది కొనసాగమికి

దురంత చింతాక్రాంతుఁడై మఱియొకండు ప్రాణాంతకము చేసికొనును. ఒక బాలుఁడు విద్యాపరీక్షలలోఁ దేరక వ్యసనావమానములచే నతిక్షోభమొంది యొడలువిడుచును. ఇట్టి గొప్పసంకటములు గలిగినచో నాత్మహత్య చేసికొనుట చూతుము. ఆత్మహత్యకు పిఱికితనమే కారణము. నిందకునోడియో యప్రియంబులఁ దప్పించుకొననో యిట్టిహత్యలఁ జేసికొందురు. ఇదియే పిఱికితనము. అట్టివాఁడు దాఁ జేయవలసిన యనేకధర్మములఁ దలంపక దా నశుభములఁ దప్పించుకొను సుఖమునే చూచుకొనును. తల్లిదండ్రులు నిల్లాలును బిడ్డలును జెలికాండ్రును మనకుండు వఱకు వారియెడ ధర్మమును జరపుట విధి కావున మనశరీరము మనదనరాదు. దానిని మనము కోరినట్లు వినియోగించు టొప్పదు. మనప్రాణము లోకమందంతట నిండియుండు భగవచ్చైతన్యములో నొకయంశమగుటచే మనము చేయఁదగినధర్మములు మనకేర్పడియుండును. కావున మనయిచ్ఛాను సారముగ మనప్రాణములను వదలినచో ధర్మలోపమగుట తప్పదు. మఱియు సాహసించి యాత్మహత్య చేసికొనినను మనకర్మఫలంబులఁ దప్పించుకొనఁ జెల్లదు. శరీరమును జంపుటచే మనకష్టములు హెచ్చి మఱికొంత యధోగతికిఁ గారణమగును.

౧౨౨. ఇది సామాన్యజనుల విషయము. ఇంకమహానీయులవిషయము వినుండు. అది వేఱు. మనము సంసారచక్రమునఁ దిరుగుచుండఁ గాలపరిపక్వము కాఁగా మనము చేయఁదగినకృత్యము లన్నియు నెఱవేఱును. మనధర్మము లన్నియుఁ జెల్లి కొన్నియయినను మిగిలియుండవు. మనకర్మమంతయు ననుభవముచే క్షీణించును. ఇట్లంతయుఁ బూర్ణమై మనము చేయఁదగినదేదియు లేకుండుచో విశుద్ధులమైన నాత్మజ్ఞానము ప్రకాశమగును. అట్టిజ్ఞానముచే శరీరధారులమై మనముచేయఁదగినవి లేక శరీరము వలని ప్రయోజనమేమియు లేదని మనకుఁ దెలియవచ్చును. అట్లుండుచో మనము భగవదాజ్ఞాప్రవర్తనమునకై యీశరీరమును ధరించియుందుము. అట్టి కార్యమునకు నిష్ప్రయోజకమైనచో నాశరీరమును త్యజించుట యేధర్మము. ఈరహస్యము తెలియక యిట్టిమహానీయులఁ జూచి పామరులుచేసికొను నాత్మహత్య సరియనినమ్మరాదు. మనము చేసిన కర్మఫలము మనదేహమును విడిచిన మాత్రమునఁ దప్పించుకొందుమని యెంచుటయు సరికాదు. అట్లు నమ్మినఁ జెడిపోదుము.

౧౨౩. ఒకానొకనాఁడు మార్గమున రామచంద్రుఁడు శస్త్రధారియై నడుచుచుండుట నవలోకించి

జానకి చింతాకులచిత్తయై యుంపగు ననుఁ బల్కులనిట్ల
నియె. ఆర్యా! రాజ్యమును ద్యజించితిరి. మునివృత్తి
ని గ్రహించితిరి. మీరలమ్ములు విండ్లుధరించుట యుక్త
మా. శస్త్రములు పట్టిన యుద్ధము మనసునకు వచ్చును.
యుద్ధమును జింతించుటచే యుద్ధము గలుగును. తొల్లి
యింద్రుఁ డొక్కమునీశ్వరునకుఁ దపోవిఘ్నము చేయు
వాఁడై వానిచేత నొక కత్తినిచ్చెను. అదిపోవునను
భీతిచే దాని నెల్లప్పుడు ధరించియే ముని చరించుచుండె.
అంతటివానికి రౌద్రబుద్ధి గలిగెను. దానంజేసి తనత
పోమార్గమును విడిచెను. క్షత్రియుఁ డెక్కడ? ముని
యెక్కడ? స్వామీ నీవుమగిడి యయోధ్యంజేరి క్షత్రియ
ధర్మమాచరింపఁదగును. నీవు సర్వధర్మవేత్తవు. నిన్ను నేశి
క్షించుదానఁగాను. ఇదినీస్మరణమునకుమాత్రము దెచ్చి
తిని. నీకుధర్మమునుజెప్ప నెవ్వరు సమర్థులు? కావున నా
థా! విచారించి రుచించువిధమున నడువుమని జనకనందన
నిపుణముగ వివేకము తేటపడ ముద్దుగఁబలికెను. రాముఁ
డామాటలను గొనియాడుచుఁ దన వివేక మంతకంటె
గంభీరము గావున ధర్మసందేహము గలిగినచోఁ దులలోఁ
దూఁచి ధర్మముఁ దప్పక నిశ్చయించుచుసీతకిట్లనియె. దేవీ,
నాకైయీయాయుధములఁ జేకొని వనమునఁ గ్రుమ్మర

ను. అడవిలోఁ ద్రిమ్మరు రాక్షసులభీతిచే మునులు ప్రాణ భయంబుననుందురు. వారిని గావవలదే. వారునన్నుఁ బ్రార్థింప నేను వారిని రక్షింప నంగీకరించితి. ఆవాగ్దానమును మరల్ప నేరను. సీతా, జీవితములు విడువ నేర్తునుగాని నిన్ను లక్ష్మణునిని త్యజింప నేర్తునుగాని ప్రతిజ్ఞ నతిక్రమింప నేరను. అని సమాధానము చెప్పెను.

౧౨౮. ఇట్లు వా రరణ్యమునఁ బదిసంవత్సరములుండిరి. అనేకులను మహర్షులం జూచిన వారందఱు ప్రియమంది దీవించిరి. ఇట్లు తిరుగుచుండ నొక్కనాఁడు గృధ్రరాజును దశరథుని మిత్రమును జటాయువునుసంధించి జానకి రక్షణమునకై యాతనినిలిపి యన్న దమ్ములు కాపురముండ ననువగు స్థలమును వెదుకఁజనిరి. గోదావరీతీరంబునఁ దగుదేశముం జూచి రాముఁడు మెచ్చెను. అచ్చోట లక్ష్మణుఁడు విశాలముగఁ బర్ణశాల నొక్కటి గట్టి యన్నకెఱింగించిన సీతతో రాముఁ డచ్చటికివచ్చి కొంతకాలము హర్షములుల్లసిల్ల సుఖంబుగ వసించె.

౧౨౯. ఇట్లు సుఖంబుగఁ జిరకాలముండరైరి. మహావర్షమునకు సూచకముగ దినంబునఁ గాఱుమబ్బులు గ్రమ్మినట్లు రామునకు రాఁగల గొప్పకష్టములకు సూచనలగపడ సాగె.

క. అనికథ వినిపించిన విని
తనశిష్యగణంబవలికథం దెలుపంగ వేం
డిన ననివసంతమాంబిక
మనమున దయమొలకలెత్త మఱియిట్లనియెన్.

ఉ. శ్రీరమణీయయోగిజన చిత్తసరోజదినేంద్రునిన్ మహా
శూరమృగేంద్రునిన్ సుగుణశోభిత నిర్మలకీర్తిసాం
[ద్రునిన్
శారదచంద్రికాసరస శాంతవచోమృత పూర్ణచం
[ద్రునిన్
దారుణ రాక్షసాన్వయ విదారణవిశ్రుత మానవేం
[ద్రునిన్.

## ఐదవయధ్యాయము.

క. శ్రీపరతత్త్వవిచార
వ్యాపారమునీంద్రరక్షణార్థధృతమహా
చాపుని విలసత్సుందర
రూపునిశాత్రవ మృతిస్వరూపునిఘనునిన్.

౧౨౬. వానకాలము రాఁగా శ్రీరామచంద్రునిఁ గూడి సీతాలక్ష్మణులు విపినావాసమునఁ దనివి నిండార నుండిరి. ఆఋతువు రామునకుం బ్రియంబగు. రామునకే య్యది యింపగు నదియే సీతాలక్ష్మణులకుం బ్రియంబగు. అప్పుడప్పుడా శోభనపుఁబుట్టువులు పూర్వకార్యగతులఁ జర్చించుచుందురు. ఒక్కనాఁడు లక్ష్మణుండు రామా, ఇదియే మివిచిత్రము? దశరథునకు నిల్లాలుగ భరతునకుఁ దల్లిగ కైకవంటిస్త్రీ యెట్లుచేపడెనో యనిన రాముఁడతని నయమున వారించి యిట్లనియె. మనరెండవతల్లిని దూఱకుము. ఆమాటవిడిచి భరతునిసచ్చరితమును వర్ణింపుమనియె. ఇదియే రామచంద్రునిపద్ధతి. కఠినోక్తులను నివారించును. సద్వార్తల భాషించును.

—॥ శూర్పణఖ రామునిఁజూచుట. ॥—

౧౨౭. ఒక్కనాఁ డుదయమున గోదావరిని స్నానమాడి ప్రాతరాహ్నికములఁజేసి వారు పర్ణశాలలోఁ

గూర్చుండియుండ నొక్క రాక్షస స్త్రీ భయంకరరూపము గలది ఆమార్గమునఁజనుచుండి రామునిఁజూచెను. దివ్య సౌందర్య విగ్రహుండగు నారాచకొమరునియం దత్యంత కామముగలది యగుచు నయ్యా, నీవెవ్వఁడవు? ఇది రాక్షససేవితమగు నడవి. నీవిందేలయుండెదు? అనిప లుకరించిన రాముఁడు నామగోత్రములను వనవాస కారణముల నింపుగఁ దెలిపి యువ్వా, నీవెవ్వతవని యడిగె. అడిగిన నది మోదంబున రామా, నేను శూర్పణఖయను రాక్షస స్త్రీని. రావణుని చెల్లెలను. కుంభకర్ణ విభీషణా ఖరదూషణులు నాతోఁబుట్టువులు. నన్నుఁ జేకొని పెండ్లాడుము. ఈసీత విరూప, కుషాంగి, దానిని ద్యజింపుము. నన్నుగ్రహించి నాతోఁ గాననమున నిచ్చ మెయి సంచరింపుము.

౧౨౮. అనిన నల్లన నవ్వుచు రాముఁ డిట్లనియెఁ. నేను భార్యతో నుండు వాఁడను. లక్ష్మణుం డట్లుండు వాఁడుకాఁడు. వాఁడు నీకబ్బునేమో. వానింగోర రాదే. లక్ష్మణుండు తరుణుఁడు. సుందరాకారుఁడు. నీకనురూపుఁడగు భర్తయగుననిన దానికి మనసార సమ్మతించి లక్ష్మణుని వేఁడెను. వాఁడును నగుచు నంగీకరింపక యిట్లనియె. నేనన్నకు దాసుఁడను. మరల నీవేగి రాముని బ్రార్థింపుము. నీచు

సొగసులాఁడివి. జానకి కృశాంగి. విరూప. దానిని రాముఁ
డు త్యజించును. నిన్ను గ్రహించు. అనిన రక్కసియు మ
రలి మైథిలిపైనుఱికి మ్రింగవచ్చిన సౌమిత్రి గక్కున నడ్డ
ముసొచ్చి దానిముక్కు చెవులఁ దెగఁగోసి ప్రాణములఁ గా
చె. శూర్పణఖయుఁ గూయుచుఁ బాఱి యన్నయగు ఖరు
నిఁజేరి తనభంగపాటు నివ్వెఱపించెను. ఇద్దఱన్నదమ్ములు.
ఒక్కస్త్రీతోఁగూడి మనయరణ్యముఁ జొచ్చియున్నారు.
దానికిం బ్రియంబుగ నన్నవమానించిరి. వారిని జంపించి
నెత్తురు ద్రాగవలయును. అనిన సోదరి పలుకులువిని యలి
గి ఖరుఁడు పదునలుగుర మహాబలులఁ బిలిచి మీ రేగి మ
నవనమును దుర్వృత్తిఁ జొచ్చిన నరాధములఁ జంపిరండ
ని పంచిన శూర్పణఖ చూపు మార్గమున నాయువేగ
మునఁ బాఱి రాముని బోరికిఁ జేరిరి. రాముఁడు వలదని
వారించినను వినక పోరాడి యతనిచే నిహతులైరి. శూ
ర్పణఖ మఱియు నరిగి ఖరున కీవార్తఁ దెలిపినవాఁ డతు
ల క్రోధమున దీపించుచుఁ దమ్ముఁడగు దూషణుని గొప్ప
సేననుంగూర్చికొని తేరెక్కి పోరికిం బోయెను.

## ఖరదూషణాదుల రాముండు చంపుట.

౧౨౯. అంతలో రాముఁడు చేరువనున్న యొక్క
గుహలో సీతనునిచి లక్ష్మణుని సీతారక్షణార్థము నియమిం

చె. తాను ప్రకాశమానమగు కవచముఁ దొడిగికొని ధను
ష్పాణియై యొక్కండ రక్కసుల రాక వేచియుండె, ఎల్ల
దిక్కులనుండి నల్లరక్కసి మూఁకలు పిక్కటిల్లి గవిసిన
తేజోమూర్తియగు నాశూరుఁ డొక్కండయ్యుఁ గదలక
నిలిచియుండె. కొండను దాఁకి చెదరు సముద్ర తరంగము
లవలె నాసేన పాఱి తునిగి మడిసె. తుట్టతుదకు దూష
ణుఁడు రాముని మార్కొని హతుఁడై నేలవ్రాలెను.
ఖరత్రిశిరు లిద్దఱు దక్కఁ దక్కినవా రిట్లు మడిసినఁ ద్రిశి
రుఁడు తాఁకి మరణమందెను. ఖరుండును రాముండును
మల్లయుద్ధము చేయ రాముండు ఖరుని జంపె. పీనుఁగుల
పెంటయగు నా రణరంగంబున నమ్మహావీరుం డొక్క
రుండ మెఱసె.

౧౩౦. దీనిచే శూర్పణఖ వైరము మానదు. అది రాము
నితోఁ బోర రావణుని బురికొలుపును. రావణుఁడు పదితల
లరాక్షసుఁడు. లంకేశ్వరుఁడు. మహాబలుఁడు. ఖరదూషణు
లయన్న. వారికంటె నెక్కుడు. మేటిమగఁడు.

౧౩౧. రావణునివధయే రామావతారమునకుఁ గా
రణము. రామరావణు లొండొరులు గలియువేళ యాస
న్నమై కార్యగతులు రాముని నాకార్యమున కీడ్చుచు
వచ్చెను.

## రావణుని పూర్వచరిత్రము.

౧౩౭. రావణుని పూర్వచరిత్ర మెంతయు నద్భుతము. ఈజన్మమున నతఁడు రాక్షసులలోఁ బెద్ద. పూర్వచరిత్రమువలన వాఁడు రాక్షసుఁడు గాఁడని తెలియవచ్చును. వాఁడు హరిహరు లిద్దఱికి నత్యంత భక్తుఁడు. భక్తాగ్రేసరుఁడు. విద్యావిశారదుఁడు. అధ్యాత్మ విద్యాశాలి. వేదవేత్తలలో నుత్తముఁడు. వైదికవిద్యాపథి. అతఁడు వైకుంఠవాసమును సంపాదించి యుండు జయుఁడను పేరఁ దానును, విజయుఁడను మఱియొక భక్తుఁడును ఇద్దఱు ద్వారపాలకులై యుండిరి. అప్పుడు వైకుంఠమునకుఁ బోవలదని నివారింపరాని యొక మహాత్ముఁడు వచ్చిన జయుఁడు వారి నివారించె. ఆ కోపమునకు శాపము వచ్చి శాప విమోచనమునకై రెండు తెఱఁగులలో నొక్కటి కోరవలసివచ్చె. అది యెట్లనిన భూలోకమున నెప్పుడు నిర్దోషియగు భక్తుఁడై యేడుజన్మము లెత్తుట యొక్క తెఱఁగు. అట్లు కాదేని మూఁడేజన్మములందు విష్ణువునకు విరోధియై భూమిలో దుర్జనుల నెల్లఁ దనక్రిందఁ జేర్చుకొని దనతో నందఱిని ముడియఁ జేయుట రెండవవిధము. ఏడు మాఱులు ఋషిగాఁ బుట్టుదువా, కాదేని మూఁడు మాఱులు రాక్షసుఁడవుగఁ బుట్టుదువా, దీనిలో నొకటి

కోరుకొనుచునిన జయుఁ డిట్లనియె. భగవంతుఁడు నాకుఁ బ్రియుఁడు. అతని నెడఁబాసిన నొక్కసంవత్సరమేని యునరకమట్లుండును. కావున వాని విరోధినయ్యు మూఁడు జన్మములే యెడఁబాసియుందు. వాని భక్తుఁడనయ్యు నేను జన్మములు విడిచి యుండనోపనని కోరుకొనెను. జయుఁడు మూఁడుజన్మములలో రావణుఁడుగ రెండవజన్మమునఁ బుట్టె. రావణుఁడు నరసురుల జయించి రాక్షసులకు రాజై మునుల నడలఁజేయుచుండెను.

౧౩౩. జయుని దోషమునందు విజయుఁడు తోడై యుండెఁ గావున శాపానుభవమునందును దోడై పుట్టుచుండె. మూఁడుసారులు వారు సోదరులుగఁ బుట్టిరి. వారిని జంప భగవంతుఁడును రెండేసి యవతారము లెత్తెను. తొలుత జయవిజయులు దైత్యులై హిరణ్యాక్షహిరణ్యకశిపులనఁ బుట్టిరి. హిరణ్యాక్షుఁడు పుడమినిజుట్టి జలంబులలోముంచిన విష్ణువు వరాహావతారమున వానిని దునిమెను. ప్రహ్లాదుని తండ్రిని హిరణ్యకశిపుని స్వామి నరసింహావతారమునఁ జంపెను. రెండవతడవ రావణకుంభకర్ణులనుపేర రాక్షసులై పుట్టిరి. రావణుఁడు రాముని చేతను, కుంభకర్ణుఁడు లక్ష్మణునిచేతను జచ్చిరి. మూఁడవ పర్యాయము నరులై పుట్టిరి. వారిలో శిశుపాలుని

శ్రీకృష్ణుఁడును, దంతవక్త్రుని బలరాముఁడును జంపిరి. ఇది రావణుని పూర్వోత్తరచరిత్రము.

౧౩౮. ఇట్టి రావణుని చెంతకు జనస్థాన నివాసియగు నకంపనుఁడను రాక్షసుఁడు వేగముగవచ్చి యందలి రాక్షసులభంగము నెఱింగించె.

౧౩౯. అకంపనుని వచనంబులు విని యలిగి దశవదనుఁడు తానే చని రాముని జంపుకునని యుద్ధతితోఁ బలికెను. అకంపనుఁ డతని సంగరమునుండి వారించి రాజా రాముని సంగ్రామమున జయింప నెవ్వరికి నలవిగాదు. లోకోత్తరయగు వానిభార్య సీతను గొనిపోయినఁ జాలును. దానికై శోకించి వాఁ డతిత్వరగాఁ జచ్చును. అని మా రోపదేశముచేసిన నది రావణుని చిత్తమునకు రుచింప వాఁడు తేరుగొని రమ్మని దాని నెక్కి తక్షణంబ యుత్తరదిక్కునకు నాకాశమార్గమునఁ బోఱి తాటకేయుఁడగు మారీచునాశ్రమంబున దిగి వానికిఁ దన పూనికఁ దెలిపెను. మారీచుఁడు జిన్ననాఁడే యతని బాఱిఁబడి నొచ్చెనని మీరు వినియున్నవారు. కావున మారీచుఁ డక్కఱయు నిక్కువంబును దోఁప రావణునకిట్లనియె. వెట్టితలపోతలమానుము. రామునిమనోనాయికయగు సీతను జెనకకుము. దానిచే నీకే కీడగును. అని పెక్కు

పలుకుల వివరించిన రావణుండు చెలికానిపలుకులకుఁ జెవి యిచ్చి తనపట్టుదలవదలి లంకకు మరలిచనియె.

### శూర్పణఖ రావణునికడ కేగుట.

౧౩౮. ఇదియిట్లుండ శూర్పణఖయు లంకకువచ్చి రావణునితోఁ దన భంగమెఱింగించి ఓసోదరా, రాముఁడు నాకంగవికారముచేసెను. సితమ్ముల ఖరదూషణులఁ జంపెను. వారిదండును జెండాడె. వాని యపకృతికిఁ బ్రతికృతియొనరించవు. అచ్చట రాముఁడు జనస్థానమును జొచ్చి ప్రజలఁ దఱుముచుఁ జీకాకుపఱచెను. ఇచ్చట రావణా నీవప్రయోజకుఁడవై మహాతామసుఁడవై యుండెదు. అని నిందించి పురికొలిపిన సక్రోధుఁడై యెవఁడా రాముఁడని యడిగిన రక్కసి తేజోవిక్రమశాలియగు రాముని, వానితమ్ముఁడగు లక్ష్మణుని వర్ణించియు నుడుగక కుటిలాత్మయై సీతసౌందర్యమును వర్ణించెను. ఆనవ్వంపుజవ్వని యెవ్వరినేని సోయగమున సరకుసేయదు. దాని మేనిచాయ తప్తకాంచనతుల్యము. దానిరూప మతిశ్లాఘ్యము. భువిలో నొండెడఁ జూడరాని యందగత్తియ. లంకాధిపతీ, అది నీకనురూపయగు. తరలిపొమ్ము. దానిం దెమ్ము. అట్లు తెచ్చెదవేని తమ్ములకు వారిపరిజనమ్ములకు వచ్చిన యవమతితొలఁగును. అని వర్ణించి రావణునకు సీతపై ననురాగమును బుట్టించెను.

## రావణుఁడు సీతకై బయలుదేరుట.

౧౩౭. రావణునకు జానకిని బొందఁగామము దారుణమగుడు వాఁడు మరలఁ బ్రయాణమై మారీచునింగని సంక్షేపముగ రాక్షసవధయు, సీతనుగైకొనిపోవఁ దనపూనినపనియు నెఱింగించి మారీచా నీవవశ్యము సహాయమును చేయవలయు. అదియెట్లంటేని వినుము. నీవు పైడి లేడివై రాముని పర్ణశాలమ్రోలఁ దిరిగి యాడుము. నీయొయ్యారమును జూచి మెచ్చి నిన్నుఁబట్టితెమ్మని సీతమగని మఱందిని బుత్తెంచును. అత్తఱి నసహాయయైయున్న సీతపైఁ గ్రమ్మి దానింగొనివచ్చెద. ఇది నాయలంఘనీయ శాసనము. నీవు గావింపవలయును. అని గట్టిపూనికతో నుడివిన విని మారీచుఁడు గుండెలదరి వెండియు నొక్కసారి వానిని వారింప నిట్టులనియె. రాక్షసేశ్వరా, మృత్యుదేవత తెఱనోర నుఱికెదేల? రామునకు జీవితముకంటె సీత ప్రియతరము. ఆతండతులబలశాలి. ఉత్తమశీలుఁడు. వాఁడు కోపించెనేని యెవ్వారును మాఱొడ్డి బ్రదుకలేరు. ఇంతయేల? నాకథవినుము. విశ్వామిత్రుని జన్నమును జెఱుప నేనేగిన నన్నుఁ గాఁడ నేసియుఁ గృపామతియై ప్రాణములఁ గాచె. వెండియు నొక్కసారి యవివేకంబున వానిపైనెత్తిచని చిక్కక బ్రదికితి. అదిమొదలు రాముఁడన్నభయమువ్యోఁడు. జాగ్రత్స్వప్నములయందును నాలు

గు దిక్కులందును సర్వకాలములందును రాముఁడేతోఁచె
డు. అని తెలిపి బోధించిన రావణుండు వానితో నిష్ఠురము
గ నిట్లనియె. నిన్ను బుద్ధులుచెప్పుమంటినే. నీకు నేనురాజును.
నీవునాకు బంటువు. చెప్పినదిచేయుము. ఇదినీకువిధి. అని
శాసించి యపాయము వచ్చిన వచ్చుఁగాక. నాచిత్తము
మెయిఁ జేయవేని నాచేఁ జచ్చెదవు. అని యదలించిన
మారీచుఁడు లోఁబడిన వారిరువురును విమానమెక్కి
వినువీధినరిగి దండకారణ్యము చేరిరి.

## మారీచుఁడు మాయామృగమగుట.

౧౩౮. ఆవనంబున మారీచుఁడు రాక్షసమాయచే
క్షణములోముద్దులుగులుకు లేడియయ్యెను. దానిశరీర
ము బంగారపువన్నెది. అందందుఁ దెల్లచుక్కలు విల
సిల్లె. దానికొమ్ములు రత్నఖచితములు. దానియుదర మిం
ద్రనీలమువలె సుందరమైనది. దానితోఁక యింద్రధను
స్సువలె నన్నివన్నెలది. అదిచెట్లసందుల నాడుచు వన్య
మృగములఁగూడ నవి వాసనపట్టి తమవిరోధియని వివేక
మునఁదెలిసి దానిని జేరనీయక విడిచి పాఱెడు. అక
టా! సీతకప్పుడా తెలివిలేదు. మెలపునులేదు. మణుల
సోయగమునకుఁ జిక్కి రంతు, శీఘ్రముగ రండని యెలుఁ
గెత్తి రామలక్ష్మణులఁ బిలువ వారువచ్చిరి. ఆపసిండి యిఱ్ఱి
నిజూచినక్షణమే లక్ష్మణుఁడు సత్యసంధుఁడు గావున నది

మోసమని యెఱింగి రామచంద్రుని కిట్లనియె. అన్నా, యీమృగము మారీచుఁడు. ఇది కేవలము మాయ. ఇట్టి జింక లెందును లేవు. సందియ మేల? అనుచుండఁ ద్వరపడి మఱేది సాక్షేపించి మగని పేక్షించి తొట్రుపాటునిండ సీతయిట్లనియె. నాకీలేడి ప్రియమయ్యెను. దానిని బట్టి తెమ్ము. ప్రాణముతోఁ దెచ్చిన మేలు. కాదేని చంపినైన ననుదెమ్ము. ఏమివచ్చినఁగాని సరకుగొనక తెమ్ము. అని మోహితయై మైమఱచి గట్టిగ వేఁడిన రాముఁడు దానివేఁడి కో లంగీకరించె. లక్ష్మణా! నీవిందుండి సీతను రక్షింపుమని నియమించి స్వర్ణమృగము వేఁటాడఁజనియె. ఇట్లు సీతా రాము లెడఁబాసిరి. వారు చిరకాలము కష్టమున గడిపి గాని మరలఁ గూడరు.

౧౩౫. ఆవన్నెల జింకపాఱుచు నిట్లట్లుఱుకును. రాముని చెంతకుఁజేరును. వాఁడు పట్టునంతలో దూర ముగఁబాఱును. ఇట్లది పాఱిపాఱి మోసమునఁ దగిలి రాముఁడు దానివెంట బాఱిబాఱి నతనికిఁ బర్ణశాల దూరమయ్యెను. తుదకు రామునియమ్ము దానిందగిలినఁ జావుసమీపింప మారీచుఁడు సీతారక్షణమునసుండి లక్ష్మణునిం బాపువాఁడై యూర్పుఁడై రామస్వరంబున హాసీతా హా లక్ష్మణా యని యాక్రందించె.

౧౮౦. సీత యామాయా ర్తధ్వనిని విని లక్ష్మణునిం గని దీనా
లాపంబుల లక్ష్మణా మీయన్నకుఁ దోడరుగుము. వేవేగ
అరుగుము. ఉగ్రాటవిలో మొఱయిడు నన్నుంగావుము.
అని వేఁడిన నన్న మాటను మఱువక కదలకుండిన లక్ష్మణునిం
గని భయంపడి యున్మత్తయై రామునియందలి మోహము
చే ధర్మ మెఱుఁగక తన్నతిభక్తితో రక్షించు మఱంది నతిక
ఠోరముగ నక్కటా! నీవు తమ్మునిరూపంబుననుండు
శత్రువై రాముని నాశనంబును నాపొందును గోరెదవు.
అని దూఱెను. లక్ష్మణుండును దిన్నందనమునఁ దల్లీ రా
ముని నోడింప నెవ్వరుఁ జాలరు. ఈకూఁయి మారీచుని
మాయ. ఇందుండి నిన్నురక్షింపుమని రాముఁడు ని
యమించెను. నిన్నువిడిచిపోవ నేనోపను. అని వినయ
దృష్టిఁ గార్యగతు లరసి రామునియందలి భక్తిశ్రద్ధలు
చూపుచుఁ బలికిన సీత వెండియుఁ బరుషవాక్యముల నిట్ల
నియె. నేనెఱుంగుదు. స్త్రీలోభమున నీమనస్సుచంచలిం
చెను. అన్నభార్యపైఁ గోరికతో రామునివనమునకు వెంబ
డించితివి. ఓకష్టమతీ, నన్నుఁ బొందఁ గపటమునఁ జరించె
దు. అనెను. ఇట్లుపలుకుట స్త్రీస్వభావము గాదే. లక్ష్మణుం
డు తనప్రాణములకంటె నెక్కుడు ప్రియంబున రాముని
జూచువాఁడగుటచే నాసీతమాటలు శూలములవలె హృద
యమ్ముననాటినను రాక్షసులమాయచే మోహితయైన

యున్న వదినెనూరడించి దుఃఖించుచు నిట్లనియె. నీవునాకు సాక్షాద్దేవతవు. కావునఁ బ్రత్యుత్తరము చెప్పనోపను. రామునిగూర్చి నేఁబోయెద, వనదేవతలు నిన్నురక్షింతురుగాక. అని సీతకుసాగిలి మ్రొక్కి వెడలిపోయెను. పోవుచో సీత పరితపించి తిరిగిరమ్మని పిలుచునోకోయని మాటిమాటికిఁ దిరిగిచూచును గాని సీతరమ్మనిపిలువదు. లక్ష్మణుండు కనుమఱుగు కాఁగా రావణుండువచ్చి జానకిమ్రోల నిలిచెను.

## రావణుండు సీత నెత్తుకొనిపోవుట.

౧౮౧. ఆపాపిష్ఠిరక్కసుండు త్రిదండకమండలువులఁ దాల్చి భిక్షుకరూపంబున వశీకరణము చేయుమాడ్కి సీతను మోహింపఁజేయఁజాలురూపమున సమీపించి పలుకరించెను. సీత జలాహారములను దెచ్చి గ్రహింపుమని సైఁగ చేసిన జడదారుల కేమియు నొప్పని యధర్మవచనంబుల వాఁడచ్చెలువ చెలువంబు నమితముగ వర్ణింపసాగిన సీత మనంబునఁ గలంగె. రామలక్ష్మణులు రారోకోయని దిక్కులుచూచె. ఎచటఁ జూచినను వనభూమి విశాలముగ నగడియుండెఁగాని రామలక్ష్మణు లొకరును గానరారు. ఎట్లు కేలకుఁ దాను పలుకకున్న ముని శపించునని జంకి జానకి తన నామాదులను విపినావాస కారణంబును దెలిపి కొంతకాలము విశ్రమింపుము. క్షణములో రాముఁడు వచ్చునని ప్రార్థించెను.

౧౮౨. అంతట రావణుఁడు నిర్భర రాగంబునఁ గపటము దిగద్రోచి తనపేరును వచ్చిన పనియుఁ దెలిపి లంక కేగిరి పోవుదము. రమ్ము. అందగ్రమహిషివై సర్వసంపదలతో నేలుము. అని తనహృదయ మెఱింగించిన సీత యత్యంత ధైర్యము విజృంభింప నాఁడు సింగంబు చందంబునఁ గోపించి తన్నవమానించు నాదురాత్మునితో నిట్లనియె. ఏను రామునిదాసను. రామునిదాననే. మూర్ఖా! సింగపుఁ గోఱల నూడఁ బెఱుకుదే. కృష్ణసర్పపుఁ గోఱలఁ బెఱుకుదువే. విషముఁ ద్రావుదువే. జిహ్వాచే క్షురికాధారను నాకుదువే. అగ్నినిగుడ్డతోఁ గట్టుదువే. అయోశూలాగ్రముల మెట్టుదువే. ఇవి యెల్లఁ జేసినను బ్రదుకవచ్చునుగాని రామునిల్లాలిని జెనకి బ్రతుకరాదు. అని ధిక్కరించి పలికెను. రావణుండోహో యియ్యెడ మెప్పించి గెలువఁజాలను. భయముచేఁ గార్యసిద్ధియగు. అని తలఁచి సాభిప్రాయముగాఁ బరుష వచనంబుల నిట్లనియె. నేను రావణుఁడను. దశగ్రీవుఁడ. నాకు దేవతలెల్లరు భీతిల్లుదురు. వాయువునాపై విసర శంకించు. సూర్యుండు తన వేఁడికిరణములఁ జల్లఁగాఁ జేసి నాపై సోఁకనిచ్చును. నాకై నదులు పాఱక నిలుచును. నాకోడి వన వృక్షములయాఁకులు చలింపక నిలుచును. రాముఁడు నరమాత్రుఁడు. నేను రాక్షసేంద్రుఁడ. నన్నెదిరించు వారులే

రు. నిరాటంకముగ నేలెద. అని యదలించె. రావణుఁడు భూమినంతరిక్షమును జడిపించుఁగాక. నిజేశునంద బుద్ధి నిలిపిన యబల సీతను నదలింపనోపఁడాయెను. వాఁడిట్లు పలికిన సీత నడలక వాని కిట్లనియె. ఇంద్రుని భార్య నపహరించియు నెక్కఁడు జీవించియుండిన నుండవచ్చును. రాముని ప్రేయసి దొంగిలి నెమ్మదినుండు వాఁడు లేఁడు. అనిన గోపమునఁ బ్రజ్వలించుచు రావణుఁడు నిజభీషణమహాకృతిని ధరించి సీతనుబట్టి విమానమెక్కి దక్షిణదిక్కునకుఁ గ్రక్కునఁ బాఱె. అయ్యంగననింగి పగుల నెలుంగెత్తి యఱచె. ఆ మొఱ్ఱ త్తపోయె. తనప్రక్కనుండి తఱిమిన లక్ష్మణునిఁ బిలిచె. అతండు కన్నులకుఁ గానరాఁడు. బంగరు జింకకై యరిగిన రాముని నోరెత్తి కూయిడె. రాముఁడు రాఁడు. నదులకును, పాదపములకును, మృగంబులకును, పక్షులకును, వనసత్త్వములకును జెప్పుకొనియె. రావణుఁడు సీతను గొనిపోయెనని రామునకుఁ జెప్పుమనియె. జటాయువుంగని గృధ్రపుంగవా, నాకీఘోరమైనచేటు చేపడియె. నీవు రామలక్ష్మణులకుం దెలుపవేయని కరుణాంబుగా వేఁడెను.

## —జటాయువు రావణునితోఁ బోరుట.—

౧౪౩. జటాయువు నిదురించుచుండ నాయార్తధ్వని విని తటాలున మేలుకొని మేలిమిపలుకులతో నిశాచరుని

వేఁడుకొనియె. సీత పరుని భార్య. పరుని యిల్లాలిని దొంగి లించుట ఘోరపాతకము. ఇది నీకుఁ దెలియనిదేయని పెక్కువిధంబుల వేఁడినను రావణుఁడు చెవిపెట్టక జటాయువుతోఁ బోరసమకట్టెను. సీతను విడిపింపు నాశతో జటాయువు ముసలియయ్యు సంగరమునకుఁ గడంగె. వాఁడు పెద్దయుంబ్రొద్దు గడునుద్ధతితో యుద్ధమాడియు రాక్షసుని యరదంబును విఱుగఁగొట్టియు జానకిని గావ నేరఁడయ్యె. రాక్షసుఁడు పక్షిరాజు పక్షంబులనఱికిన నెత్తురులజొత్తిల్లి జటాయువు నేలంగూలె.

### సీతను రావణుండు లంకయందునుంచుట.

౧౭౭. రావణుఁడంత సీతతో నింటికేఁగిరి పోవుచో జానకికంకణంబులును బంగారుహారంబులు జాఱి నేలంబడియె. ఒక్కచోట నైదుగురు వానరపుంగవులం జూచి సీత తన పీతాంబరమును రత్నఖచితములగు నాభరణములను క్రిందికివైచె. వీరీయాభరణముల రామునకుం గొనిపోదురుగాక. రాముఁడు నేఁబోయిన దిక్కు నెఱుంగఁ జాలుఁగాక యని యాసపడె. రావణుఁడు నిజాంకతలమునను నిజమృత్యురూపిణియగు సీతనునిచికొని తనపత్తనముగు లంకఁజేరి సీతను నిజమందిరమునఁ బదిలముగ నునిచె.

౧౭౮. ఇట్లు కొండొకకాలము గడువ రావణుఁ డిట్లు మనంబున వితర్కించెను. సీత తనకు రక్షకులు లే

రని యింత కెఱింగి యుండును. దానికి దానినాథునకు
నష్టమై మహాసముద్రమున్నది. అదియు నొంటరిదై పగ
తుఱనడుమనున్నది. ఇఁక దానిని బాయవచ్చును. అని
తలఁచి శోకించు జానకిచేతను వచ్చి దానిని బలిమిని
దననగరమునకుఁ గొనిపోయి తనసంపదలఁ జూపెను. అందుఁ
గాంచన స్ఫటికాదిచిత్ర స్తంభములుండె. గవాక్షములు
దంతములతో వెండితో నిర్మింపఁబడి వజ్రవైదూర్యాది
మణిఖచితములై యుండె. వానిని జానకికిఁ జూపె. సుందర
నందనవనంబులకుం గొనిపోయె. అవి తటాకంబులు గలిగి
సాంద్రమై పక్షికులకలకలారావలలితంబులయియుండె. వా
నిని జూపి భూపుత్త్రితోఁ రావణుం డిట్లనియె. చూచితే
నాభాగ్యములను. పెక్కువేల దాసీలనేకలు. దివ్యభూ
షణములెల్ల నీయవి. ఇందలి యీవైభవముల ననుభ
వింపుము. అనియాగర్వి తనశిరస్సును ఆమె పాదంబులపై
నునిచి రావణుండెన్నండును స్త్రీకిఁ దలవంచఁడనియె.
వాని వేఁడికోలొకింతయు నంగీకరింపక వాఁడిట్లనని చెప్పిన
వైభవంబుల సరకుసేయక వానిస్తోత్రములఁ జెవిసోఁక
నీయక ధృతితో సీత చలింపకనిలిచె. మఱియు సడలక
వానికిట్లనియె. రావణా, నీకును బురంబునకును రాక్షస
గణంబునకును జావు తెచ్చుకొనెదు. నాధర్మమునుండి
మరల్ప నేరవు. ఊరకుండుమనియె. అని నిబ్బరంబునఁ బలి

కినఁ గడునలిగి భయంకరుఁడై దశవదనుఁడు నాయిష్టంబు సేయవేని నిన్ను వధించి నీమాంసము రేపట భుజింతునని కొందఱు రక్కసులఁబిలిచి ఆమెను వారిచేతుల కప్పగించి యిట్లని నియమించె. దీని నశోకవనంబునకుం గొనిపొండు. అందు నయభయంబుల నాయభీష్టమున కియ్యకొలుపుఁడు. అని పుత్తెంచిన బ్రహ్మ ఆమెను గరుణించి యింద్రునం పెను. ఇంద్రుఁడు సీతనోదార్చుచు నామెకు బలము తఱుగకుండ భుజింపనమృతము నిచ్చెను. సీతయాయోగిరంబునుమనంబున రామలక్ష్మణులకర్పించి పదంపడి భుజించె. ఇట్లూరడిల్లి నెమ్మదినుండె.

## —— రామలక్ష్మణులు పర్ణశాలకువచ్చి విలపించుట. ——

౧౪౭. అట రామచంద్రుఁడు స్వర్ణమృగమునుజంపి సత్వరముగఁ బర్ణశాలకువచ్చుచు సీత మారీచుని చావుకూతను వినియుండునో యనిభయంబున శంకించుచు విషాదమందెను. అతివేగమునఁ గ్రమ్మఱుచుండ నెదుట లక్ష్మణుని దన్నుఁగూర్చివచ్చువానిని విగతప్రభుని విషణ్ణుఁ జూచి రామునిఖేద మధికమయ్యె. లక్ష్మణా! సీతను విడిచి వచ్చితే. అది బ్రదుకునదే. కాదేని వైదేహిచచ్చినపిదప వచ్చితివేయని యల్లననిందించి రాముఁడు లక్ష్మణునితోఁ గూడి పర్ణశాలను జేరెను. అందు సీతలేదు. రాముఁడు మాటిమాటికి సీతను విడిచితేయని దూఱిన లక్ష్మణుఁడు

గతవృత్తాంతము నుడివి నన్ను సీత నీచవాక్యములఁ బో
డిచెనని వివరించెను. అనిన మనోవ్యథచే రాముఁడు స్త్రీ
స్వభావ మెఱుంగవే. క్రోధమున నాఁడుది యాడు వేఁడి
మాటలఁ బాటించి దాని నొంటరిగా విడువఁదగునేయని
తమ్ముని దూఱె. అంత నతం డెల్లదిక్కులకుం బాఱుచుఁ జేరువ
నుండు పొదలెల్ల రోయుచు, నార్తస్వనంబుల నాప్రేయ
సింగంటిరే యని చెట్లను మృగగజశార్దూలములను వేఁ
డును. హాసీతా! సీతా! దాఁగియుండెదే. నాతో నవ్వుల
కాటలాడెదే. చాలునే యింకఁజాలునే. వేవేగ రాఁగదే.
నీహాస్యము నాకుఁజావయ్యెడునని కూయును. దీనికంతట
ను మాఱుమాట లేదు. సీతయెందు లేదని మనంబునన్నిశ్చ
యమయ్యె. అంతట నన్నదమ్ములు గోదావరి కేగిన నాన
ది సీతావృత్తాంతం బేమియుఁ జెప్పదయ్యె. అందుండి మఱి
డి యడవికింజనిరి. ఎల్లెడలఁగలయ వెదకిరి. జింకలమందను
గని సీతయెందేగెనని యడిగిన నవి సీతను రావణుఁడు
గొనిపోవుటను జూచినవి కావున దక్షిణదిక్కునకుందిరిగి
యఱ్ఱులెత్తి యాకాశమునుజూచిన దక్షిణాభిముఖులై
చనిచని పోవంబోవ నొక్కచో ఘోరయుద్ధముజరగిన
గుఱుతులు కనఁబడియె. అది రావణునితో జటాయువు
పోరినరణరంగము. అందు జానకి యాభరణంబులును
హారములును దునిఁగిపడియుండినఁ గని దుఃఖవివశుఁడగు

చు భూపతి యగ్నిసందీప్తశరంబులఁ గోదండమున సంధించి జగంబు నాశముగావించెదనన్న లక్ష్మణుండు తిన్నన వారించుచు మృదువచనంబులం బలికె. రామా, మున్నెల్ల నీవు మృదుడవై దాంతుఁడవై సర్వభూతముల హితము నుగోరుచుందువు. కోపవివశుఁడవై నిస్వభావమును నిప్పుడు వదలఁదగునే. ఒక్కఁడు చేసిన యపరాధమునకుఁ బ్రపంచము నాశముచేయఁ జెల్లునే. అని చల్లనిమాటల ననునయించి ప్రియంబుగఁ బలికిన రాముఁడు తొల్లింటి చందమ్మున శాంతుఁడయి మరలఁ గాంతామణి నరయసాగె.

౧౭౭. వెదకుచువచ్చి వారు జటాయువునుజూచిరి. ఆశూరగృధ్రము నెత్తుటఁదడిసియుండఁజూచి రాముఁడు వీఁడు జానకిమరణమునకుఁ గారకుఁడని యొక్కక్షణము సంశయించెనుగాని యంతలో జటాయువు వారలకు రావణునితోఁ దానుబోరుటయును దనయపజయమ్మును సీత విలాపమును రాక్షసుఁడు దక్షిణదిశకుఁబోవుటయు నెఱింగించి కృతకృత్యుఁడై కూలి కాలధర్మమునొందెను. భ్రాతలా ప్రేతను దహించి దుఃఖించుచు సీత నన్వేషించుచుఁ బోయిరి.

## కబంధవధ.

౧౭౮. మార్గంబున నతిఘోరరూపుఁడగు నొక్క రాక్షసుఁడు ఆరాజకుమారులఁబట్టుకొనెను. తమ్ముఁబట్టిన

వాని భుజములను వారుఖండింప వానికి శాపమోక్షము య్యెను. వాఁడు తనదేహమును దహింపవేఁడెను. అట్లు వారుదహింపఁ జితాగ్నినుండి వాఁడు నిజరూపమున వెడలెను. అతఁడు సుందరుఁడగు కబంధుఁడు. దనుసుతుఁడు. అట్లువెలువడి కబంధుఁడు దాశరథులకిట్లనియె. మీరు సుగ్రీవునికడ కేగుఁడు. అతఁడొక వానరుండు. వాఁడు సూర్యుని కుమారుఁడు. ఇంద్రునికుమారుఁడగు వాలియనువాఁడు సుగ్రీవునియన్న. ఇంటినుండి వాలి సుగ్రీవుని వెడలఁగొట్టె. సుగ్రీవునితో మైత్రి నెఱపుఁడు. వాఁడు సీతనువెదుక నానాదిక్కులకుఁ గోఁతులఁబంపును. వారవశ్యము సీతను జూచివత్తురు. అని సుగ్రీవుని జేరఁబోవ వనములలోఁ బోవలసినమార్గమును వివరముగ నెఱింగించి మార్గమధ్యమున శబరియను తాపసియున్నది. అది యతిపుణ్యవతి. దానిని జూడుమా. రామా, నిదర్శనమున దానికి మోక్షంబు (విమోచనము) ప్రాప్తించును. అనివెండియు నొక్కపరి సుగ్రీవుతో సఖ్యము సేయుమని బోధించి కబంధుఁడు దివ్యసుందరవిగ్రహుఁడై యదృశ్యుఁడయ్యె.

## శబరి రాముల బూజించుట.

౧౭౬. కబంధుఁ డెఱింగించిన మార్గమున నన్నదమ్ములుపోవుచుఁ దోవలో శబరింగనిరి. శబరి కొందఱు తాపసులకు సపర్యలుసేయుచుండ వారు దేహములఁ దొఱంగి

పోవుచు ననుగ్రహించి రామలక్ష్మణులు ఇచ్చటికివత్తు రు. వారిని బూజింపుమని శబరితో ననిరి. శబరియు రామ లక్ష్మణులకై ఫలాదుల సేకరించియుండి యాతిథ్యసపర్యలను జేసెను. అంత రామచంద్రుననుజ్ఞవడసి శబరి యగ్నిం బ్ర వేశించి యందుండి తేజోరూపమునుదాల్చి తనప్రియాగు రువులుండు నూర్ధ్వలోకములం జేరెను. ధర్మబద్ధులై యిహ లోకమును విడువనేరక రామలక్ష్మణు లడవిలోనివంజని సొంపారుపంపాసరోవరమును జేరిరి. [illegible] ప్రసివసంత మాంబ మెప్పింగించిన శిష్యవర్గం బనంతర కథం దెలుపు వేయని ప్రార్థించిన దయావల్లియగు నుపాధ్యాయామతల్లి యిట్లనియె.

చ. కనకమకరాలముం దఘుకుఁగౌస్తుభమూ వనమాల
(యుక్ సుద
ర్శనమును బాంచజన్యమును శార్ఙ్గమునందకముం
(గదాయుధం
బును వరవత్సలక్షణముఁ బూనిధరించి మనోజ్ఞదే
(హాకాం
తిని జెలువొంది వక్షమున దేవిని దాల్చిన విష్ణుఁ దా
(దలఁచెదన్.

శ్రీ. శ్రీ. శ్రీ.

# కిష్కింధాకాండము.



## ఆఱవ యధ్యాయము.

క. శ్రీపద్మభవానుగ్రహ
దీపితదోర్బలమఘాంధ దితిసుతచేష్టా
వేపిత తాపసదేవ వి
లాపాశ్రితచక్రధరుఁడు లక్ష్మీవరుఁడుఁ.

### భల్లూక వానరములు దేవాంశజనితము లగుట.

౧౫౧. విష్ణుమూర్తి పుడమిపై నవతరించెదనని దేవగణప్రార్థితుఁడై నిశ్చయించినప్పుడు వేల్పులం దమతమయంశముల వానరభల్లూక రూపముల సృజింపుఁడని యానతిచ్చె. అయ్యవి రామచంద్రునకుఁ గలిగిన విపత్కాలంబునందు సహాయములయ్యె. ఇదిమీరెఱింగినదియకదా! అవిసాధారణములగు కోఁతులు నెలుఁగులుగావు. అవి దేవతాసంబంధములగు మృగములు. కామరూపములు. మృగములయ్యు నమానుషశక్తిగలవి. ఆర్యమతగ్రంథములందుమృగము లివియనియు నరులివియనియు స్పష్టముగ నేర్పడి విభజింపఁబడియుండలేదు. భగవదవతారములందు నర

దేహము లెట్లు ధరింపఁబడునో అట్లే స్థానములను సందే
హ మొకింతయు లేక మృగరూపములు ధరింపఁబడు. తత్త్వ
ము విచారించిచూడ మనుష్యులును మృగములును
సస్యాదులును వేఱు వేఱు వర్గములుగాను. సర్వవ్యాపకమ
గు భగవచ్చైతన్యమే అన్నింటియందును నిండి వేఱు
వేఱుగవ్యక్తమగు చున్నదిగాని యొక్కటనుండి మఱొకచో
కదాచియందు లేదనుటలేదు. ఈయంశము చక్కఁగ నెఱ
యవలయు. ఉపాధులదేహములు మాఱినను అందలి చైత
న్య మొక్కటియేయనియు నది భగవచ్చైతన్యమనియుఁ
దెలిసి యెల్లెడల నెల్లరూపములనుండు చైతన్యమును విమ
ర్శించి కని సేవించుటొప్పు. నరులమని గర్వించి యితర భూ
తములచేఁ బనిగొన నధికారులమనియు వానికై పాటుప
డఁ బూటపడినవారము కామనియు నెంచరాదు. మాన
మును సమస్తభూతములు సన్యోన్యాను బంధములచేఁ
గట్టుపడియున్నాము. కావున భూతముల కన్నింటికి నన్యో
న్య సంబంధ మనుస్యూతముగనున్నది. ఇట్లుతలంగినవారు
సర్వభూత దయాపరులగుట నిశ్చయము. పూర్వకాలము
నం దీభూతదయ యార్యావర్తమున నెగడియుండెనుగాని
యిక్కాలమున నాధర్మము మిగులక్షీణించియున్నది. దాని
కింగారణ మిప్పటివారికిఁ బ్రాయశః ప్రాచీనధర్మపద్ధతులు
యం దభిరుచి తప్పియుండుటయే. అట్లగుటచే నరరూపము

వచ్చినదని మదించి మనలనడుగువారు లేరనియెంచి మన క్రిందిభూతములందు స్వేచ్ఛగా మనయధికారము నెఱపుచు వానినిదయతోఁ బ్రోవక కాఱియఁబెట్టుచున్నాము. అట్టిభల్లూక వానరములకు రాజు సుగ్రీవుఁడు. వాలితమ్ముఁడు. పంపాసరోవరతీరంబున ఋష్యమూకపర్వతమున నుండువాఁడు. సుగ్రీవుఁడే సీతావియోగ సంతాపమునఁ గుందు రఘునందనునకు సహాయుఁ డయ్యెను.

## రాముఁడు సీతకై తపించుట.

౧౫౧. రామలక్ష్మణులు పంపాసరోవరమును జేరిరి. [ఆసరోవరతీరంబున ఋష్యమూకపర్వతమున వానరభల్లూకరాజగుసుగ్రీవుని యన్నవాలియుండు వాఁడు] ఆసరస్సు శోభిల్లుప్రదేశము స్వచ్ఛము. అందలినీరుస్వచ్ఛము. గాలిచల్లనిది. విరులు సుగంధపరిపూరితములు. ఇవియన్నియు సుఖకరములయ్యును రామునకు సంతాపహేతువులయ్యెను. తనయనుంగుఁ జెలితో నెలమితో నట్టిమనోజ్ఞప్రదేశముల సలిపిన విహారములు మనసునకువచ్చె. చెలితోఁగూడి సంచరించుచో నాసౌందర్యములు ఇనుమడించి తోఁచె. ఇప్పుడప్పుడఁతి లేమి రాముఁడు వానింజూచి విలపించె. లక్ష్మణుం డంతటఁ దియ్యని పలుకుల రాము ననునయించి యోర్పుగదురఁ దగుపనికింబురికొల్పుచు నిట్లు

నియె. పురుషోత్తమా! ఇట్లు వగవకుము. వగకుంజిక్కి పుణ్యాత్ములు వివేకమును విడుతురు. ఊరడిల్లుము. మనో దుర్బలము మానుము. తగినప్రయత్నము లేక బలవంతులును గోలుపోయిన వస్తువులఁ బడయఁజాలరు. పౌరుషశక్తి కార్యముల నిర్వహింపనోపును. దానిని మిగులుశక్తి వేఱొండు భూమిలో లేదు. దానిచే లభింపనిదియు లేదు. అని సౌమిత్రి శాంతవచనముల దృఢముగఁ బలికిన రాముఁడు తేఱి వ్యసనమును బాఱఁదోలి తాఁ జేయంగల పనికి నుద్యమించె.

### సుగ్రీవుఁడు హనుమంతుని రామునికడకుఁ బంపుట.

౧౫౭. ఇట్లు సంచరించుచుండ దీర్ఘబాహువుల నాయుధపాణుల రాజకుమారుల రామలక్ష్మణుల సుగ్రీవుఁడును వాని యనుచరులును గని శోకించి హరిని వాలిపంపె. నిశ్చయమని తలఁచి మిక్కిలియడలిరి. సుగ్రీవుఁ డంతధైర్యశాలిగాఁడు. అపాయ సమయముల జడియువాఁడు. హనుమంతుఁడు వానిమంత్రిలలో నిపుణుఁడు. వాయుపుత్త్రుఁడు. ధీరులలో నతిధీరుఁడు. అట్లగుటచే నతఁడు సుగ్రీవునకు బుద్ధిచెప్పి యూరడించి నేనేగి యావీరకుమారుల భావంబు లరసి వచ్చెదనని పలికి భిక్షువేషంబున దాశరథుల సమీపించి వినీతుఁడై పూజించి యిట్లనియె. అయ్యలారా! మీరెవ్వరు? మీపని యేమొ

య్యది? నాకుఁ దెలుపవే. ఏను హనుమంతుఁడను. సుగ్రీవుని సచివుఁడ. వనచరుఁడ. మారాజుపంపున మీదర్శనము చేసితిని. అనిమధుర వాక్యములు పలికిన రామచంద్రుఁడతి మోదమంది తమ్మునకిట్లనియె. సౌమిత్రీ! ఈదూత యెంతయుఁ గుశలుఁడు. మనహృదయముల హరించె. ఏని సచివునిగఁ బడసిన సుగ్రీవుఁడు భాగ్యశాలి. ఏనికిం దగిన విధంబునఁ బ్రత్యుత్తరంబు లిమ్మనియె. లక్ష్మణుఁడు సుగ్రీవుని యెడఁ దమకుంగల సౌహార్దమును దెలిపి తమపనినంతయు నెఱిఁగించి యిట్లనియె. అయ్యా! సీతను గోలుపోయి వెదకుచు సుగ్రీవుని సహాయంబును గోరివచ్చితిమి. అనిన విని హనుమంతుఁడు మనంబున నీమహాశూరులచే సుగ్రీవుఁడు సోదరునోడించి రాజ్యంబుఁ బడయనోపునని తలంచి సంతోషమున నుప్పొంగె. అంత నద్భుత వానరరూపంబును గైకొని రామలక్ష్మణులను మోచికొని సుగ్రీవుని చెంగటికిం గొనిపోయి కార్యగతుల సంక్షేపముగ నెఱింగించె. అంత రామసుగ్రీవులు పరస్పరసహాయమును గోరువారగుటచే నిండారుల చేతులు గీలించికొని యగ్ని ప్రదక్షిణముచేసి మిత్రులుగ నుండుదమని ప్రతిజ్ఞ సేసిరి. పిదప వారిద్దఱును దమకుఁ గలిగిన మిత్రలాభమునకును సంభాషించిరి.

## రామసుగ్రీవుల మైత్రి.

౧౫౩. అప్పుడు సుగ్రీవుఁడు రామున కిట్లనియె. రావణుం డొక్క స్త్రీని బలిమిమైఁ గొనిపోవ నామె హారామా, హాలక్ష్మణాయని వాపోవుచు నుత్తరీయమున నాభరణములఁ గట్టి దిగవిడిచె. నేనుదీసి భద్రముచేసితి.అని గుహనుండి తెచ్చి యిచ్చిన రాముఁ డాయాభరణములు సీతవని గుఱుతించి యక్కునఁజేర్చి చూచితే లక్ష్మణా, యీపయ్యెదకొంగు. ఈయాభరణముల వైదేహి యిందు జాఱవిడిచె. అనిశోకంబునఁ బలికిన యన్నకుఁ దమ్ముం డిట్లనియె. సీత కేయూరముల నేనెఱుంగను. కుండలములనెఱుఁగ. ఎప్పుడుగాని సీతపాదములకు మ్రొక్కుచుందును. కావున నామె ధరించు నూపురంబుల బాగుగ గుఱుతించ నేర్తుననియె. బాలురారా! లక్ష్మణుండన్న భార్యయెడ నెఱపు కోమలభక్తిని జూడుఁడీ. ఇదివానిమాటలచేఁ దెలిసె. ఎన్నండును గన్నులెత్తి సీత మొగమైనయుఁ బాహువులేనియుఁ జూడఁడు. పలుమాఱులు సాగిలి మ్రొక్కుటం జేసి చిన్ని కాలులం జెన్నొందు నగల నెఱింగె.

౧౫౪. భార్యకై విలపించు శ్రీరాముని నోదార్చుచు వానరపతి సీతాన్వేషణమునందాఁ దోడయ్యెద ననిపలికెను

రాముండు సంతసించి తన క్రొత్తచెలికానికిఁ దానును దోడుపడుదునని మాట యిచ్చె.

## —॥సుగ్రీవుఁడు రామునితోఁ స్వవృత్తాంతము చు జెప్పుట॥—

౧౫౫. మఱునాఁడు రఘుకుమారులకు సుగ్రీవుఁడు తనవృత్తాంతము నిట్లు తెలిపెను. ఏనివిధంబున నన్నయగు వాలితోఁగలహించితి. వినుఁడు. నుడివెద. మాతండ్రి కాలగతుండైనఁ బెద్దకొడుకని వాలికిం బట్టముఁగట్టి సింహాసనాసీనుం జేసిరి. వాలి రాజ్యపాలనము సేయుచుండ మాయావియను నసురునకును వాలికిని గలహము సంభవించెను. ఒక్కనాఁడు నడురేయి మాయావి వాలిం బోరికిం జీరిన నేను వెంటరా వాలి పురంబు వెడలివచ్చె. నిశాచరుఁడు పరుగెత్తుడు వాలియు వానివెంటనంటి పోయెను. చనిచని యసుర యొకబిలంబుఁ జొచ్చె. దానింగని వాలి యేను దానవునిఁ దగిలిపోయెద. నీవీబిలద్వారమున నుండుము. అని నన్ను నియమించి లోనేగె. ఏనొక్క సంవత్సర మచ్చటఁ గాచి నిలిచితి. వాలి రాఁడాయె. అన్నచచ్చెనని తలంచుచుండ గుహానుండి నెత్తురు పాఱసాగెను. దాని చే రాక్షసుఁడు వాలిని జంపెనని నిశ్చయించి పెనుబండతో గుహామూతఁబెట్టి మరలి కిష్కింధకు వచ్చితి. అందు మంత్రు లన్నరాజ్యమునకు నన్నుఁ బట్టము గట్టిరి. అట

వాలి యసురచేఁ జావక యసురుఁ జంపి వచ్చుచో బిలద్వా
రమునఁ దా వెలువడకుండ నడ్డముయిన మూఁత రాతిం గని
మిక్కిలి కోపించి పురంబుఁ జేరి గద్దియపై నేనుంటఁ గని
మఱియొకింత కుపితుఁడయ్యె. నేనెన్ని యోవిధములుగ
క్షమింపుమని వేఁడిన నంగీకరింపక నన్ను రాజ్యమునుండి
వెలివేసి నాభార్యం గ్రైకొనియె. నాటంగోలె ఇల్లులేక
దిక్కుమాలినవాఁడనై యొందేశఁ దిరుగుచుండుదు. రామా,
ఇఁకనైన నీశక్తిచే నన్నను జయించి రాజ్యము చేకొందు
నని యాస గలదు.

## వాలి సుగ్రీవుల ద్వంద్వయుద్ధము.

౧౫౬. అనిన రాముఁ డంగీకరించి ధైర్యము చెప్పిన
సుగ్రీవుఁడు వాలిని బోరికిఁ బిలిచె. అన్నదమ్ములకు ఘోర
యుద్ధము చెలఁగెను. చెలఁగిన సుగ్రీవుఁడోడిపాఱె. రా
ముఁడు కోదండపాణియై ప్రక్కన నిలిచియుండియు భండ
నంబునకుఁ గడంగకయుండె. సుగ్రీవుఁడు రాముని దప్పు
పట్టిన రాముఁడు అయ్యా! శోఁబుట్టువులు మీరిద్దఱొ
క్కరూపగుటం జేసి నీవనియు వాలియనియు వేఱుపఱుప
నేరక ప్రమాదమున నిన్నుఁ జాఁకునోయని యమ్ముఁబ
ఱుపనోడితిని. కొంచొకపరి కయ్యమునకు నేగుము. సుగ్రీ
వా, నీవు పుష్పమాలికఁ దాల్చిన నిన్ను నెఱిఁగి వాలిం

గూల్చెద. అనిన వల్లేయని యతఁడు చని వాలిని సంగర మునకు రమ్మని పెలుచనఱచె. ఆఘోరనినాదమును విని వాలి యుద్ధతితో నడుగెత్తి నడిచిన వానిభార్యయగు తార వలదని వారించునదియై యిట్లనియె. సుగ్రీవునకు నీతోఁ బోరునంతటి ధైర్యముగలదే. ఇప్పుడు కయ్యమునకుఁ బిలువఁ గారణంబుండు. వానికెవ్వఁడో బలశాలి తోడు వచ్చియుండు. అయోధ్యనుండి రామలక్ష్మణులను రాకొమరులు వనంబున నున్నవారని నాకునూరుఁ డంగదుఁడు నాతోఁజెప్పె. వారు సుగ్రీవునికిఁ దోడగుదు రేమో. నాథా! తమ్మునితో సంధిచేయుము. వానిం బురమ్మునకు రప్పించి యౌవరాజ్యమునకుఁ బట్టము గట్టుము. ఇట్లు తన నాథునకిఁ బ్రాణభయంబగునోకోయని భయంబునఁ దార వివేకము నెఱపుచుఁ దిన్ననిమాటలఁ జెప్పె.

## రాముఁడు వాలిం జంపుట.

౧౫౭. వాలియుఁ దారను గూరిమితో నాదరించి పలికె. పోరికిం బిలువంబడి పోకుండుట పౌరుషంబే. నే రాముని మాఱుకొనను. తమ్మునింజంపను. అనిపలికి వెలువడి సుగ్రీవునిపై రభసంబున నుఱికిన నన్నదమ్ములు మరలఁ బోరిరి. వెండియు సుగ్రీవుఁడు క్రిందుపడె. అయ్యెడ రామచంద్రుఁడు నారాచము శరాసనమున సంధించి వాలి

వక్షస్థ్సలంబున నాటనేయుటయు నతండు నేలంగూలె. వాలి మరణము నొందుచు రాముఁడు చేరరా వానింగని ధైర్యంబునఁ దిన్ననిమాటల దూఱుచు నిట్లనియె. నీది కానిపోరున నీవేల కలిసితివి. వైరితోఁబోరు శూరుని గూలనేయ నగునే. ఇది ధర్మమే. క్షత్రియున కిది తగునే. రామా, నే నీకెట్టి యపరాధముం జేయను. నిన్నవమానించను. నన్నేలచంపితివి. నేను గోఁతిని. వేఱొండు కోఁతితోఁ బెనుఁగులాడుచో నీవేల నన్నుఁ జంపితివి. నాకని శోకింపను. మరణ మెల్లరకు సిద్ధము. రామా, నీకనియే విచారించెద. మరణకాలమున నిన్నడిగిన నీ వెట్లు సమర్థించుకొనెదవు. అని నిందించిన రాముఁడు గంభీరవచనంబుల నిట్లనియె. వాలీ, ఇది మా రాజవంశమునకు లోఁబడిననేల. ఇందలి ప్రజలను న్యాయమార్గమున రక్షించుట మాకు నుచితము. అట్ల చేసితి. నీవు తమ్ముని భార్య నపహరించితివి. ఈ మహాపాతకమునకు రాజగు భరతునకుఁ బ్రతినిధినై యపరాధివగు నిన్ను దండించితి. శూరుఁడని నీతోఁబోరితినే. అనిన విని వాలి యిట్లనియె. నేను బాపముచేసితిని. దానికై నన్నుఁ జంపితివి. ఇది నానేరమునకుం దగిన దండనమగును. అంగదుఁడు నాకొక్కకుమారుఁడు. వాని రక్షింపవేయని ప్రా

ర్థించె. అట వాలిభార్యయగు తారవాని దుర్దశవిని యం గదునితోవచ్చి మరణమాసన్నమై పడియున్న జీవితేశ్వరునిపైఁబడి ప్రేమాస్పదంబులగు మృదువాక్యముల విలపించె. వాలియు రాజ్యమును గ్రహింపుము. అంగదుఁడు పసివాఁడు. తండ్రిలేనివాఁడు. నీకొడుకునట్లు రక్షింపుమని సుగ్రీవునితో వాత్సల్యమునఁ బలికి తన కొడుకునకు మంచిబుద్ధులు గఱపి ప్రాణంబులవదలె. అట్లు పూనిన పని నెఱవేఱ సుగ్రీవుఁ డంత నన్నచావునకుఁ బశ్చాత్తాపమునిండ వివశుఁడయ్యెను. తారయు నోరామా, నన్నుఁ జంపుము. నాపతింగూడి స్వర్గంబున కరిగెదను. అనియేడ్చిన సీతాపతి దానిని మృదువాక్యముల నాశ్వాసించి వారల వారించుచు నీయార్తనాదంబులు మృతులకు మేలుసేయవు. వాలి దాఁజేసిన పుణ్యకర్మములచే నూర్ధ్వలోకమున కరిగి సుఖంబున్నవాఁడు. ఇఁక నేమవకుఁడు. ప్రేతకార్యములు గావింపుఁడని నియమించెను.

## సుగ్రీవుని పట్టాభిషేకము.

౧౫౮. ఎంతయు నాడంబరమున వాలికి నుత్తరక్రియలు జరగె. తదనంతరము హనుమంతుఁడు వేఁడిన రామచంద్రుఁడు సుగ్రీవునకుఁ బట్టాభిషేకము సేయుఁడనియు నంగదుని యువరాజుగఁ జేయుఁడనియు నియమించెను.

ఈమహోత్సవము కిష్కింధలో జరగెను. అందులకు రాముని బిలిచిరిగాని వనవాసవ్రతుండు గావునఁ బురిలోఁ జొరక మీరలు వర్షాకాలము గడుచునంతకు నగరంబున సుఖంబుండుఁడు. నేనును లక్ష్మణుండును గాననమున గుహాలో నుండుదుము. వానలు నిలిచిన సీతను వెదుకనగును. అని సుగ్రీవాదులఁ బుత్తెంచెను.

౧౫౯. అట్లు వానకాలము సెల్లిన హనుమంతుఁడు సుగ్రీవున కిట్లనియె. దేవా, మిత్రకార్యమును దలంపవే. నీవు సుఖంబున మునిఁగి దానిని మఱచితివే. అనిన సుగ్రీవుండు వానరసేనం గూర్పుమని యాజ్ఞాపించెఁగాని సీతను గొనివచ్చు మహాకార్యమందుఁ దానె మొనసి ప్రయత్నింపఁడయ్యె. దీనింగని రాముఁడు శోకోపహతుండై తమ్మున కిట్లనియె. లక్ష్మణా! వానకాలము నాలుగునెలలు నూఱేఁడులుగ గడిపితిని. సుగ్రీవుని జేరఁబొమ్ము. వాఁడు తాఁ జేయఁదగిన పనిని మఱచె. వానిని హెచ్చరింపుము. అని రాముఁడు పలికిన లక్ష్మణుఁడు రభసంబున సుగ్రీవుఁడు బొంకరి. వానిం జంపెద. అని కోపించిన రాముఁడు వారించి యట్లుకాదు. సుగ్రీవునితో మృదువచనంబులు వల్కుము. కఱకులాడకుము. అనియెఱుంగఁ దెలిపిపంచె. కిష్కింధకు సౌమిత్రియేగి రాజభవనముచేరి సుగ్రీవున

కెఱిఁగింపుమని యంగదుని బంపె. అంగదుఁడు సుగ్రీ
వుం జేరి నాకుం జూడ లక్ష్మణుఁ డలిగి యున్నవాఁడని
తోఁచెడి. అనిన సుగ్రీవుఁడును భయంపడి యెదు రే
గక మసలె. హనుమంతుఁ డదిగని సుగ్రీవునికడ కేగి
నీవు రామునకుఁ దోడయ్యెదనని చేసిన వాగ్దానమును దలం
పుము. శరత్కాలము వచ్చియు నీవు చేసిన బాసను జెల్లింప
వు. రాముఁడు నీకుం జేసిన మేలునంతయు మఱువకుము.
లెమ్ము. చనుము. సౌమిత్రింగని వినయంబున వేఁడుము.
అనిబోధించె. అంతలో లక్ష్మణుఁడు నగరులోనికివచ్చెఁ.
దానిం దెలిసి సుగ్రీవుఁడు వడవడవడఁకుచుఁ దారా! నీవే
గి లక్ష్మణుని చిత్తమును మెత్తఁబఱుపుము. అనిపంచినఁ
దార లక్ష్మణునింగని మృదువచనంబుల వేఁడుచు నయ్యా!
కోపమునకుమూలమేమి యనిన సౌమిత్రి ప్రశాంతుఁడై
తారకు రాముని శోకంబును దెలిపి నీపతి విషయానంద
వివశుఁడై దానిని స్మరింపఁడు. నీవేని మీఁదఁ జేయఁదగు
కార్యమును మాకుఁ జెప్పుమా యని యడిగె. అంతటఁ
దారయు సుగ్రీవుం డొక్కింత కామాసక్తుఁడయ్యె. వాని
ప్రమాదమునకు సైరింపుమా. అతండు ప్లవంగముల నింతకు
మున్న రావించెఁగాదే. సౌమిత్రీ, యింతయేల ? నీవంతః
పురమునకు రమ్ము. అందు భార్యాపరివృతుఁడై సుగ్రీవుఁ

డును. సత్పురుషులు మిత్రభావంబునఁ బరభార్యలంజూచిన దోషావహముగాదు. అని వేఁడెను.

౧౬౦. లక్ష్మణుఁ డంతిపురింజొచ్చి సుగ్రీవుంగని కోపించి కఠినవాక్యముల వాని కిట్లనియె. నీవు కృతఘ్నుఁడవు. మాటజరపినలెస్స. కాదేని వాలివెంట యమపురంబున కేగెదవు. అనుచుండఁ దారమాఱ్ఱొడ్డి యిట్లనియె. సుగ్రీవుని ప్రమాదంబును క్షమింపవే. ప్రాకృతునట్లు నీవు కోపమునకెడమీయఁదగునే. తియ్యందనమును జెలిమిని జూపవే. అనిన లక్ష్మణుండు తీవ్రకోపియయ్యు మృదుస్వభావుండుగావున శాంతిల్లె. సుగ్రీవుండును మన్నన వేఁడి రాముని చెంతకు వచ్చెదననియె. అంతట లక్ష్మణుఁడును దనకోపవచనంబుల క్షమింపుమని సుగ్రీవుని వేఁడి యిద్దఱు మహాసేనలంగొని రాముని జేర నరిగిరి.

### సుగ్రీవుఁడు వానరుల సీతను వెదకుటకుఁ బంపుట.

౧౬౧. సుగ్రీవుఁడు నాలుగుదిక్కులకు వానరకోటి నంపి సీతను వెదకిరండని నియమించెను. దక్షిణసేన కధ్యక్షుఁడంగదుఁడు. అందు హనుమన్నీలాదులు పెక్కండ్రు పేరుపొందిన శ్రోతులుండిరి. వారింజూచి సుగ్రీవుఁడు నెలదినములు వెదకిరండు. జానకినిగనివచ్చినవారికిఁ బసదనములనొసఁగెద. వారికి సుఖంబయ్యెడు నని పుత్తెంచెను.

౧౬౨. అట్టియెడ హనుమంతుఁడే కార్యనిర్వాహ

కుఁడని సుగ్రీవుఁడుంచిన విశ్వాసమును హనుమంతుని నిజస్వరూపమును వానిశక్తియును రామచంద్రుఁడెఱిఁగి చేరఁబిలిచి నీవు దీని గుఱుతుగ జానకి కిమ్ము. ఇచ్చితివేని తనముద్రయుంగరమిచ్చి నీవు తన మేలును దలంచువాఁడవని యెఱింగి సీత నిన్ను విశ్వసించును. అని రాముఁడుపంపెను. ఇట్లు నాల్గుదిక్కులకు వానర సేనలు తరలి యెగురుచు బీరములాడుచుఁజనిరి. నెలచనుడు పూర్వపశ్చిమోత్తర దిక్కులకుంబోయిన మూఁకలు సీత నెందునుగానక తలలు వంచుకొని మగిడివచ్చిరి.

## అంగదాదుల ప్రాయోపవేశము.

౧౬౩. అట నంగదుఁడును వానిదండును దక్షిణమున సీతను వెదకుచు నెందునుంగానక వేసరి నిరాశచేసికొని చేయునది తోఁచకుండిరి. దక్షిణసముద్రము దనుకఁబోయిరి. ఇఁక నెందుఁబోనేర్తురు? నెలదినములు చెల్లె. వచ్చిన పనిసేఱవేఱమి మగిడి పోనోడి వివశులగుచు నేలవ్రాలిరి. హనుమంతుఁడు మరలిపోవుదమని పురికొలిపెఁగాని యంగదుఁడు కార్యము నిష్ఫలంబయ్యె. సుగ్రీవునిజూడ నొల్లనని యన్నమువిడిచి చావనిశ్చయించి నేలంగూరు చుండె. తక్కుంగలవారలు తమకునదియ మేలని వానిక డంగూరుచుండిరి. అట్లు భోజనము లేక మూర్ఛితులైయుం

కః జేయవనున్న గుహనుండి జటాయువున కన్నయగు సంపాతియను గృధ్రము తిండిదొరకెఁగదాయని సంతసించి వారిని జూసె. వానిరాకంగని యంగదుఁడు హనుమంతుని తో హీనస్వరమున నిట్లనియె. హనుమంతా! రామకార్యమున జటాయువుచావఁడే. మనము నట్లు చచ్చువారము. అనిన నామాటలను సంపాతివిని సోదరుఁడు చచ్చెనని దెలిసి యిట్లనియె. అయ్యలారా! జటాయువు నాతమ్ముఁడు. నానికేమిమూఁడె. ఒక్కచో సూర్యుని వాడికిరణములు సోఁకనీయక యనుజునింగాచితి. అప్పుడు నాఱెక్కలుగాలెను. అని శ్రద్ధతో నాతురంబున నడిగిన నంగదుండంతయు సవిస్తరంబుగఁ దెలిపి సీతాన్వేషణమునకుఁ దోడుసేయుమని ప్రార్థించెను. అనిన సంపాతి యిట్లనియె. ఒక్క రూపసంపన్నయగు తరుణిని రావణుఁడుబలిమిమైఁగొనిపోవుచుండఁ నేఁజూచితి. ఆసుందరి సీతకాఁబోలు. రావణుని నగరము లంక. దక్షిణసముద్రమున నెనిమిదివందలమైళ్లదూరమున నొకద్వీపమున లంకానగరమున్నది. గృధ్రములు తమయాహారవీర్యమున నూఱుయోజనముల కెక్కుడుదూరమును జూడఁగలవు. కావున నేఁజూచిచెప్పెద. దవ్వగులంకలో రావణుండును సీతయునున్నవారు.

౧౬౮. అని సంపాతి పలికిన వా రిట్లు విచారించిరి. ఇది నిశ్చయము. జానకియుండుచోటెఱింగితిమి. ఎఱింగియు నేమయ్యె? ఈవానరసేనలో నెవ్వండు నూఱుయోజనముల సాగరము దాఁటనేర్చును? అనుచుండ నొక్కండు పదియోజనము లెగిరి దాఁటుదుననియె. మఱియొకఁడు నేనిరువదియామడలు లంఘింతుననియె. తక్కుంగలవారు తమతమశక్తికొలఁదులఁ బలికిరి. మహాబలుఁడు వాయుపుత్త్రుఁడునగు హానుమంతుఁ డూరకుండె. వానిని సమీపించి వృద్ధభల్లూకమగు జాంబవంతుఁడిట్లనియె. హానుమంతా! నీవు వాయుపుత్త్రుఁడవుగాదే. నీతండ్రికి సాటివై యాకసంబున నెంతయు దవ్వు దాఁటనోపుదు. మనంబున దీనిస్మరింపుము. అనిన నామాటగైకొని హానుమంతుఁడు మేను పెంచి యాకసమున కెగసి సముద్రముగడవనోపు మహాకృతిని బూని మనస్సమాధానమున నమ్మహానుభావుఁడు మనంబున లంకఁ జేరె.

౧౬౯. వాల్మీకి రామాయణమునందు "మనస్సమాధాయ మహానుభావో జగామలంకాంమనసామనస్వీ" అని యున్నది. ఇట్లుపలుమాఱులీ రామాయణాది సద్గ్రంథములయందు మనస్సుచేఁ గార్యములను గావించినట్లు ప్రమాణములుగలవు. మనంబునఁ జేయుటయే జయమునకుఁ

గారణము. ఇది పరమ రహస్యము. మనకుఁ గార్యసిద్ధికి మనోదుర్బలమే ముఖ్యదుర్బలముగాని దేహదుర్బలమంత దుర్బలముగాదు. ఏకార్యమునందేనియు మనంబునఁ జక్కఁగ విచారించి చేయఁదగిన కార్యమును స్పష్టముగ నిశ్చయించితిమేని యానిశ్చయమే కార్యమును చాలవఱకు సాధించును. అట్లు నిశ్చయించుచోఁ గాయికవ్యాపారమునఁ గార్యము సాధించుట దానికిలోఁబడి సులభమగును. ఘనకార్య నిర్వాహకుండగు హనుమంతుఁడు మనంబునఁ గార్యస్వరూపమును స్పష్టముగ నిశ్చయించి కార్యమునుబూని జయమును బ్రకటింపఁజేయును.

కిష్కింధాకాండము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ.

# సుందరకాండము.



## హనుమంతుఁడు సముద్రమును దాఁటుట.

౧౬౬. ఇట్లు నిశ్చయించి యొక్కకొండ నెక్కి సూర్యునకు మ్రొక్కి యెంతయు నద్భుతంబుగ వారిధిఁదరించ నెగిరెను. కొడుకునకు గాలి తోడయ్యెను.

ఉ. అంబుదవీథిఁ బాఱియపు డప్పుడధోముఖుఁడై గభీరమా
నంబుధివీచులందోలఁగ నట్టిటుతోఁపియునుదోఁగు లేచు [మా
ర్గంబున వింతవిఘ్నములు రానెడమీయక గెల్చునిట్లు తీ
వ్రంబుగ నేగిలంకను బ్లవంగుఁడుచూచె దిగంతసీమలోఁ.
లంకంగని మెప్పటియాకారంబు పూని
లంకాతీరమున దిగెను.

౧౬౭. తీరంబునఁ జీఁకటి పడునంతకునిలిచి సీతాన్వేషణ కార్యమును జింతించుచుండె. రాక్షసులకుఁగనఁబడక జానకిని వెదుకవలయును. కార్యము కుదురకమున్నె తన్నువారు గన్నకార్యసిద్ధి యెట్లగును? అని యుపాయంబులఁ జింతించి ప్రొద్దుగ్రుంకిన మారుతి మార్జారమాత్రి

శరీరమున నడంగి కావలివారు గాచుచున్న యాపురంబు సొచ్చె. గోపురద్వారముననే వైరియడ్డమువచ్చెను. లంకా పురాధిదేవతారూపిణియగు నొకవికృతాంగి హనుమంతు నరసి పోనీయక వారించిన హనుమంతుఁడు దాని నేలం గూలనడిచె. అది లొంగి వాని నిచ్చగఁ బొమ్మనెను.

౧౬౮. ఇట్లు హనుమంతుఁడు లంకలోఁ దూఱి వెద కుచు దానియందుఁ గలయందరిగి యెన్నియేని రమ్యహ ర్మ్యములఁ గోమలభామల నానందకందళితప్రదేశంబులఁ జూచిచూచి యెందును సీతనుజూడక సంకటమునిండ హృ దయంబునఁ దపించెను. ఒక్కొక్కనగరునుజొచ్చి సీతను రోయును. రావణుని దివ్యహర్మ్యమందు నంతరాంతర ములయందు మూలలందు నొక్కొక్కచోట నరయును. తుదకు రావణుకూర్కుటింటి లోనికేగి సకియలతోఁబరుం డిన నిశాచరునింగని వానిచెంగట ననుపమ చారురూపను జవరాలినొకతెనుజూచి ప్రీతితో ననిలకుమారుఁ డే వెద కుసుందరి యిదియంచు నెమ్మనంబున క్షణకాలమెంచి సంతోషవివశుఁడై బుజములఁ గయిదోయిని దట్టును. తోఁకను జుంబనమొనరించును. సంతోషమున నెగిరిదు ముకును. పాటలుపాడును. స్తంభంబుల కడకుఁ బోవును. వానినెగఁబ్రాఁకి యెక్కును. భూమిపైదుముకును. ఇట్లా నంద సూచకములగు మర్కటచేష్ట లన్నియు సలిపెను.

౧౬౯. ఇంతలో నొకక్షణములో వానిచిత్తము స్వస్థమయ్యెను. ఈశుభాంగి సీతకానేరదు. సీత పతివ్రత. రాముడిసాధ్వి. అనివివేకించి వెండియు వెదకఁబోయెను. ఎందును జానకిని గానక వానిమనస్సు శోకమున నిష్ప్రహామయ్యెను. అట్టియెడ నతండు మనంబున రామునకు దేవతలకు నమస్కరించి మనస్సమాధానము చేసి ధ్యానంబున నశోకవనంబును బ్రవేశించి యందు సీతను జూచినట్లు నిశ్చయించెను. ఇట్లు మనస్సునందుఁ బ్రతీక్షించి కార్యమునకుం బూనె. అశోకవనంబునుజొచ్చె. నలుగెలంకులం గ్రుమ్మరివెదకె. తుదకొక్కయున్నతవృక్షమెక్కి దవ్వుననంతటం గలయంజూచి యొక్కచో నొక్కచైత్యప్రాసాదమును గనియె. అందు సీతంజూచి యంతింతనరాని సంతోషమునను పొంగె. మాంసు. దీనింగదా నే నింతకాలము వెదకితిని. ముఖము తెల్లఁబాఱియున్నది. ఆమలినవస్త్రముచూడు. ఆభరణము లేమియు లేవు. శోకమునఁ దలవంచుకొనియున్నది. కన్నులు కాంతిహీనములై కన్నీరు నిండియున్నవి. అనివితర్కించి యీమెకదా సీత. ఈమెయిట్లుండుట యెతగును. బంగారుమేడలనుండునే. పండుగ మండపములనుండునే. కొఱమాలిన స్త్రీలంగూడి యున్నదికదా. ఇది యీమెకుం దగుచోటు! దీనవదనయై పోలియున్నది. ఒంటరిగనున్నది. ఘోరరూపిణులగు కావలివారుగాక మఱియెవరును

లేరు. ఈయబలయే యకలంకయగు రాముని సతి. ఇదియే
నిశ్చయమని యూహించి యుప్పొంగె.

### హనుమంతుఁడు సీతనుజూచుట.

౧౭౧. అంత హనుమంతుఁడు మనంబున సీతారా
ములఁ గీర్తించి సీతనుజూచుచు సంతోషించుచుండె. సీత
నుగాచుచుండిన రాక్షసస్త్రీలంజూచియచ్చెరువందె. వారు
విరూపలు. ఘోరదర్శనలు. కొందఱి మొగములు భయం
కరములగు మృగములముఖములఁబోలియుండె. కొందఱు
నానావిధవికృతాంగులు. చింపిరివెండ్రుకలు దేహములనిండి
యుండె. కొందఱియంగములు వడఁదిరిగి వికారముగనుండె.
వారుసురాపానము చేయుచుండిరి. పచ్చిమాంసమును మ్రిం
గుచుండిరి. వారు దినుచుండు ఘోరమాంసములనుండి జా
ఱురక్తము బొట్లు వారిపైఁబడియుండె. అంత నారాత్రి
సమయమున రావణుఁడు సుందరీబృందము గొలిచినడువ
సీతను జేరవచ్చెను. వానిఁజూచి వానికిఁ గనఁబడకుండ
హనుమంతుఁడు వృక్షాగ్రమునకుం జని డాఁగియుండెను.
రావణునిజూచి జానకి వ్యాఘ్రము డాయ నడలు లేడి వడు
వున దిక్కులేనిదై గడగడ వడఁకె. దాపంగని మధుర
వాక్యముల రావణుఁ డిట్లనియె. భీతిల్లకుము. దయచేస
న్నుఁ బ్రేమింపుము. దేవతాచిత్రకారుఁడును దివ్యసౌంద
ర్యములను సృజించిన సృష్టికర్త నిన్నుఁ బుట్టించిన పిదప

నప్పనిని జాలించెను. మైథిలీ! నాకు భార్యవుగమ్ము. నా స్త్రీసుందరులందఱు రాణులు. నీకిట్లో నగ్రమహిషి వగుము. మూఁడు లోకములలో నేఁ జూరలాడినరత్నము లెల్లను నారాజ్యంబును నీకిచ్చితిని. రాముఁడు నిన్ను మరలఁ బొందునాశ విడిచెను. రమ్ము. నమ్మతింపుము. సుఖములనుభవింపుము. అని వినయంబున వేఁడెను. బలమున సీతను గ్రహింపనేరఁడు. తనను ఇచ్ఛయించని స్త్రీని బలవంతముగ గ్రహించిన మరణము గలుగునని * వానికి శాపము గలదు.

౧౭౧. సీత దుఃఖముచేఁ గృశించి దుర్బలయు దీనస్వరయునయ్యు మనంబున శంకింపక సన్నతెలుంగున నిట్లనియె. నానుండి నీమనస్సును మరలింపుము. నివారలగు నీభార్యలయందు నిలుపుము. నేను బతివ్రతను. అకార్యము లఁజేయను. అని కన్నుల నిప్పులొలుకు రాక్షసునినుండి తన మొగమును మరలించి మఱియు మెత్తని పలుకుల ననునయించుచు నిట్లు బోధించెను. రావణా! సాధువృత్తినవలంబింపుము. నిన్ను రక్షించుకొనుము. ఐశ్వర్యంబునకు ధనంబునకును నేను జిక్కను. నాని జూపి నన్నుఁ ద్రిప్ప నేరవు. సూర్యప్రభ యెట్లు సూర్యునిది యగునో యట్లే రాఘవున కేనగుదును. రావణా! నీకు శుభంబగుఁగాక. న

* ఉత్తరకాండమున 247 వ ఘట్టమును జూడుఁడు.

న్న రాము నొద్దకు మరలఁ గొనిపొమ్ము. రామునితోఁ
జెలిమి చేసికొనుము. ఆకరుణానిధి నిన్నుఁ బ్రసాదించు
ను. ఆనరపతి యలిగిన నీకు క్షేమములేదు. నశించెదవు.
ఇట్లొంటరియయి యాబలశాలి చేతిలోఁ జిక్కినదయ్యు
నేమియుఁ గొంకక పలికెను.

### రావణుఁడు సీతను బెదరించుట.

౧౭౨. అప్పలుకులు విని రావణుఁడు బెదరించుచుఁ
బరుషంబులు గ్రక్కి యెట్టకేలకు రెండునెలలు గడువు
పెట్టి యటుపై బలిమిమైఁ గొనుటొండెఁ జంపుటొండె
యథార్థమని తెలిపె. సీత దానిని సరకుగొనక ధైర్య
మున నీచే నగునంతయుఁ జేయుము. చూతమని మఱుమా
ట లాడకుండెను. అంత రావణుఁడు రాక్షసకాంతలఁ బిలి
చి యిట్టులానతిచ్చె. దీని నెట్లైని నామాట కియ్యకొను
నట్లుచేయుఁడు. మంచితనమునఁ గాదేని చెడుపోసంబున నై
నసాధింపుఁడు. అని కోపంబున విఫలమనోరథుఁడై సీతను
వదలి యరిగె. చూడుఁడీ. అట్టి దురంత వేదనలయందును
జనకాత్మజ చిత్తమున్నతస్థితిని బాయదు. ఇదిసత్యము.
నీలసరోజనేత్రయగు సీతకు నామె ధర్మశీలమే రక్షకమ
య్యెను. ఇట్టెల్లయెడలఁ దన్నడలించు భయంబులన్ని
యుఁ బుట్టియుండఁ దా లంకయందుఁ బదినెల లుండియు
సీతగుండెలు లోఁబడవు. ధైర్యము చెదరదు. మొత్తందన

ముండినవారల దుర్బలు లనరాదు. మాధుర్యముండిన దార్ఢ్యము లేదనరాదు. సీత మెత్తనిదియై ప్రేమగలది యయ్యు ధైర్యమునఁ బతిభక్తి నెఱపుచుండె.

౧౭౩. రావణుం డరిగిన రాక్షసస్త్రీలు సీతను జుట్టి రావణుని మాట కియ్యకొలుపుచు నియ్యకొనక పట్టుపట్టి నిలిచినఁ జంపుదు మని బెదరించిరి. వారేమియిచ్చెద మన్న నుసీత యాశించదు. భయపఱచిన భయపడదు. పట్టుపట్టి నిలిచెను. మీకుం బ్రియమేని నన్ను నమలి మ్రింగుఁడు. మీమాటల వినను. దీనుఁడు రాజ్యహీనుఁడు నయ్యు నా భర్తయే నాకుగురువు. వానిని నిత్యమనురక్తిఁతోఁ గొలిచెద. అనుడు వారు ఆయుధములఁ జంపెదమనియుఁ బిడికిళ్లఁ బొడిచెదమనియు బ్రద్దలుబ్రద్దలుగఁ జేసెదమనియు జడిపించినఁ దోఁడేలుల గుంపులోఁ దగిలిన లేడిపిల్లచందమున బ్రుక్కేంగాని యీాయకొనకకన్నీరొలుక నిట్టూర్పులఁబుచ్చుచు మీకుఁబ్రియమేని నన్ను నమలిమ్రింగుఁడు. మీమ్మాటల వినను. అనుచు బలహీనగావున నామె మెల్ల మెల్లన వారిఁ దొలఁగి పోవనారాక్షసస్త్రీలు వెనుదగిలిరి. ఇట్లు హనుమంతుఁడున్న చెట్టుఁజేరి యందు నేలపైఁబడి తనదుర్గతికై యార్తధ్వనితో విలపింప సాగెను. హనుమంతుఁడు చెట్టుపైనుండి జరగునది యంతయు బాగుగఁ జూచుచుండెను. రాక్షసీ

బృందమునఁ ద్రిజటయనునది సీతకుఁ దోడుపడుచుండెను. త్రిజట వయస్సునం బెద్దది. జ్ఞానము గలది. అది తక్కిన స్త్రీలతో నేనొక్క దారుణస్వప్నమును గంటిని. మీరు తొలఁగి నిలిచి వినుఁడు. అని వారిని వారించి యిట్లనియె. దివ్యవిమానమున రామలక్ష్మణులఁ జూచితి. సీత శుక్లాంబరధారిణియై ప్రభ భాస్కరుని జేరినట్లు రామునింజేరె. వెండియు నానాస్థితిగతులఁ జూచితి. అవి యన్నియు వారికి జయ సూచకములు. ఇంతియేకాదు. రావణునింజూచితి. వాఁడు తలలేని మొండెముతో నేలఁబడి దుర్గంధముగు పంకమున మునింగిపోయె. వెండియు విభీషణుం డొక్కండు తక్కఁ దక్కిన రావణుని తమ్ములును, గుమారులును, మృత్యుదేవుఁడగు యముని పోలికి దక్షిణ ముఖముగఁ బోవుటంగంటిని. కావున సీతకు విజయంబగును. శీఘ్రముగ సీతకు విజయమగును. ఇదిసత్యము. మీరందఱు సీతతోఁ జెలిమిసేయుఁ డని త్రిజటదెలిపెను.

## —⁝ సీతతో హనుమంతుఁడు సంభాషించుట. ⁝—

౧౭౪. అటఁ జెట్టుపై హనుమంతుఁడు రాకాసులెఱుంగకుండ సీతతో సంభాషించు టెట్లని బహువిధములఁ జింతించి రాముని చరిత్రము చెప్పుట మంచిదెఱుఁగని మృదువచనముల సంస్కృత శ్లోకములఁజెప్పుచు రావణుఁడు

సీతను గొనుటయు, వానరులు సీతను వెదకుటయుఁ దా సీతను గంటిననియుఁ బలికి ముగించెను. దానిని విని సీత విస్మయమంది చెట్టుపై పుఁదలయెత్తిచూడ నందొక కొమ్మపై నెలకొన్న పెద్దకోఁతిని గనెను. అట్లుగన్నను సంతోషమొకింతయుఁ గలుగదయ్యె. భయమ్మధికమయ్యె. కపియుఁ జెట్టునుండి దుమికి మోఁకరిలనిలుచుటచే సీత భయంబుతగ్గదయ్యె. ఆకోఁతి వినయంబునఁ జేతులుమోడ్చి యల్లననిట్లనియె. అవ్వా! నీవెవ్వతెవు? ఏల దుఃఖించెదవు? నీవు రామునిదేవివే యనియడిగె. రామనామస్మరణమున సంతోషించి సీత యుత్సాహముతోఁ దనపేరును బడుపాటులనుం దెలిపె. అంత నతఁడు రాముని క్షేమమును దెలిపె. దానిని విని సీత యుల్లముప్పొంగె. అంజనాతనయుఁడు చేరవచ్చెను. వచ్చినఁ దత్క్షణంబ రావణుఁడీమాయాదేహమున వచ్చెనోకో యను సందేహముగదుర మరల భయాక్రాంతయై యోదిగియో కపివరా? మిత్రవేషమున వచ్చిన శత్రువుగావేని నిక్కంపుఁ గూరిమిగలవాఁడవేని రామునిగుణములను వర్ణింపుమనియె. అదివిని హనుమంతుఁడు రామునిస్తుతులను గీర్తించుచు రామశరీరలక్షణములను వర్ణించెను. కడపట రాముని ముద్రాంగుళీయక మిచ్చిన సీత విగతసందేహయై సంతసించెను.

౧౭౫. అంత సీత హనుమంతున కిట్లనియె. రాముని వేవేగరమ్మనుము. పదినెలలు గడచెను. మఱియు రెండు నెలలుగడిచిన నన్నుం జంపుదురు. అనిన హనుమంతుండు తల్లీ నావీఁపెక్కుము. నిన్ను మోఁచికొని రామునికడ కేగెద. రమ్ము. నావుడు నుల్లమునఁ గొంతభయంబును గొంత లజ్జయు గదుర నయ్యా, రామేతరుల నేఁ దాఁకనేరను. అదియునుగాక నాభర్త రాముఁడు నన్ను విడిపింపనోపును గాని పరులకు నొప్పదు. అని సీత యెఱింగించిన హనుమంతుఁ డీనిశ్చయము విమల చరిత్రయగు రామునిభార్యకుఁ దగునని మిగులఁగొనియాడి దేవీ, రామునకు గుఱుతుగ దేనినే నిమ్ము. దానిని జూచి రఘురాముఁడు నిన్ను నేను నిక్కముగఁ గంటినని నమ్మును. అని వేఁడిన జానకి తాను దాశరథియు నేకాంతమున నున్నప్పుడు నడచిన యొక కథనుజెప్పి వెండియు నీదివ్యచూడామణిని రామునకిమ్ము. రామచంద్రుఁ డదినాదియని యెఱుంగునని వస్త్రమున దాఁచియుండిన మణి నిచ్చె. హనుమంతుఁడు రత్నమును జేకొని దేవీ! రాముఁ డచిరకాలమున వచ్చునని సీతకుం బ్రియంబుపలుకుచు వీడుకొనియె.

## ఉద్యానమును హనుమంతుఁడు పాడుచేయుట.

౧౭౬. వీడుకొని హనుమంతుఁడు రాక్షసులను బోరికిఁ జీరకపోరాదని యోచించి దేవతాబుద్ధి చమత్కృతిగ

లవాఁడయ్యెఁ గ్రోఁతిచేష్టలమానక వింతపనులకుఁ బూనె. రావణుని యంతఃపురంబునకుం జేరిన దగు నశోకవనంబును సీతాదేవియుండుప్రదేశమువిడిచి తక్కినదంతయు విఱిచి చీకాఁకుపఱచె. పిదపఁ దనశరీరము నత్యద్భుతముగఁ బెంచి రాక్షసులు కలహమునకు వచ్చుటకై వేచియుండె.అశోకవనమునందలి రాక్షసులు రావణునిజేరి పెద్దక్రోఁతి యొకండువచ్చి సీతతో మాటలాడి నీయుద్యానవనమును నాశనము చేసె. అనివిజ్ఞాపించినఁ బ్రజ్వలించుచు రావణుఁడు లంకకు సాహసముగఁ దూఱివచ్చిన యాక్రోఁతిని దండింపఁ గింకరులఁ బంపెను. వారలం గని హనుమంతుఁడు సింహనాదము చేసి

తే. జయము శ్రీరామవిజయము జయము జయము
శత్రుసూదనుఁడౌ రామ జనపతీంద్రు
సేవకుఁడ నాంజనేయాఖ్యఁ జెలఁగువాఁడ
వాయుపుత్త్రుండ సుగ్రీవుభటుఁడ నేను.

అని యార్భటించి తన్నుఁ జుట్టుముట్టిన శత్రువులపైఁబడి చెల్లాచెదరుగఁ జెండాడెను.

౧౭౭. హతశేషులు పాఱిపోవఁ గపివీరుండు లంకాపురియందలి ముఖ్యదేవాలయ గోపురమునఁ గూరుచుండి మరల

తే. జయము శ్రీరామువిజయము జయము జయము
శత్రుసూదనుఁడైౖ రామ జనపతీంద్రు
సేవకుఁడ నాంజనేయాఖ్యఁ జెలఁగువాఁడ
వాయుపుత్త్రుండ సుగ్రీవుభటుఁడ నేను.

అని జయధ్వనులు చేసిన నమ్మహాశబ్దము పట్టణమున నెల్లనిండినఁ బౌరులెల్ల భయమున గుండెలుపగుల బెదరిరి. దేవాలయపుఁ గావలివారు పైఁబడిన నతం డొక్క భూరి స్తంభంబు పెకలించి గిఱగిఱఁద్రిప్పి విసరివైచె. దేవాలయమున కగ్గిఁబెట్టె. కావలివారిని జంపి యంతటఁ బోనీయక హనుమంతుఁడు గర్జనలుసేయు నానాదములు దిక్కులనిండె. రావణుఁడు రాక్షసశూరుల నొకరివెంట నొకరిఁ బోరికిఁ బంపెను. కపివరుండు వెక్కిరించి ఘోషించుచు వారిని జంపెను. ఇందు నందు దుముకును. నింగికి లంఘించును. శిఖరములపై కెగురును. మిద్దెపై నిలుచును. మోటుతనంబున రభసంబున నాడునట్లు గ్రుద్దులు గ్రుద్దును. రాక్షసుల నిట్లు జంపుచుండెను. రావణుం డెట్టకేల కితఁడు క్రోఁతిగాదు. యోగబలంబున నేదో యొక భూతంబు మనల బాధింపఁబూడమినదని క్రుద్ధుఁడై మండుచుఁ బలికి యుద్ధంబునకు నేవురనాయకులఁ బంపెను. వారును ముందుఁబోయిన వారువలె యముని నగరము నకుం బోయిరి. అంత నక్షుండను నతిభయంకరుం డగు

శూరుండు ఘోరంబుగ మల్లయుద్ధమునఁ బోరి నేలం గూలె. తుట్టతుదకు రావణుని కుమారుండును మహాబలుండు నగునింద్రజిత్తు పోరాడ సంగ్రామంబు భీమంబయ్యె. ఇరుదెసల విజయంబు నేకూరదయ్యె. అట్టియెడ నింద్రజిత్తు ధ్యానముచేసి హనుమంతుని కట్టులఁగట్టవచ్చుం

### ఇంద్రజిత్తు హనుమంతుని బంధించుట.

గాని చంపనోపనని యెఱింగి వానిపై బ్రహ్మాస్త్రంబును బ్రయోగించె. ఆయస్త్రము బంధించిన హనుమంతుఁడా కట్టులఁ ద్రెంపనోపక చెట్టలుడిగిపడి యీరాక్షసులు నన్నస్త్రపాశనిబద్ధుని రావణునికడకుం గొనిపోదురేని తెన్నయగు. వానింజూడఁ గుతూహలంబుండెఁ గదా! నా కోరికఁదీర్ప దైవం బిట్లుచేసెం గాఁబోలును. రావణునితోటి సంవాదమున నాకెంతయు మేలగునని తలంచి యుల్లమునఁ బట్టరాని నవ్వుల నవ్వుచుండెను. అంత రాక్షసులు నారత్రాళ్లతో నూలుత్రాళ్లతోఁ గట్టుచుండఁగాఁ జేయఁ బూనిన వేడుక చెసకుండఁ జూచువారికి సూచించువానివం బోలె నార్తస్వరములు మూలుగుచుండెను. కట్టులు గట్టిన బ్రహ్మాస్త్రబంధనము వదలిపోవునే. అట్లగుటచే నేఁగోరినపుడీకట్టులఁ దూసిపోలుగాఁ ద్రెంచివేయనోపుదును. ఇది తెలియక యీరాక్షసులు నన్ను బంధించిరి గాఁబోలు. అని యంతరంగమున వారి యజ్ఞానమునకు నంతసించుచుం

డెను. దానింగని యింద్రజిత్తు మనంబున విచారించె.
అక్కటా! యీరక్కసులు నాచేసిన మహాకార్యమును
నిరర్థకముచేసిరి. మంత్రగతు లెఱుఁగరు. బ్రహ్మాస్త్రము
చెడిన నితరాస్త్రము లేమియుఁ జేయనోపవు. నిక్కముగ
మేము ప్రమాదకరమగు చిక్కునఁ జిక్కితిమి. అని జ్ఞాన
వంతుఁడగు నాశూరుండు దివ్యాస్త్రకోవిదుఁడు గావున
విచారమున మునిఁగె.

౧౭౮. అట్లు కట్టి రావణుని మ్రోకులంగొనిపోవ
హనుమంతుఁడు మనంబున హర్షము చెందియు వెలు
పల సంకటపడు నార్తుని బోలి నటించుచుండె. రావ
ణుఁడు పరిచరులతో వీని వృత్తాంత మరయుఁ డనియె.
మారుతాత్మజుఁడు కొంటెలమారియై నే రాయబారిని.
అనుడు వెండియుఁ బృచ్ఛసేసిరి. తోఁటనేల పాడు
చేసితివి? ఏల వనపాలకులఁ జంపితివి? రాయబారు లిట్లు
చేయుట చిత్రము గాదే. అనిన నడఁకువతో హను
మంతుఁ డిట్లనియె. యశోనిధియగు రాక్షసరాజు దర్శన
ముపడయుఁ గోరి యతుల సుందరోద్యానమును జెఱిచితిని.
రాక్షసులు నన్ను మార్కొనిరి కావున నేఁ బోరితిని. నా
దేహమును రక్షించుకొనవలదే. రామునిపనికై రాక్షస
రాజును జూడవలదే. ప్రభూ! నావార్తను వినుము.

## హనుమంతుఁడు రావణునకు బుద్ధిచెప్పుట.

౧౭౯. రాముఁ డమితవిక్రముఁడు. అతని నెవరును బోరి జయింపనోపరు. సీతను విడువుము. అని గంభీరముగ జ్ఞానము నెఱుపుచు వేఁడెను. రావణుఁడు వీనిం జంపి వీనినో రడంచుఁడని కింకరులం బంచె. అంత విభీషణుఁడు చెచ్చెఱ వారించుచు నిట్లనియె. దూతను జంపరాదు. ఇది యెల్లెడల రాజధర్మము. ఎల్లరును విశ్వసించునది. దూత పోలనిపను లొనరించిన వానిని దండించుటొప్పు. చంపుటొప్పదు. అనిన రోషమున మండుచుండియు రావణుఁడు ధర్మమునకుం గట్టుపడి దూతప్రాణంబు లంటరానివని యొప్పి తమ్మునిం బొగడుచు నిష్ఠుర తిరస్కారవచనముల హనుమంతున కిట్లనియె. క్రోఁతికిఁ దోఁక యందు మోహముండును. కావున నిక్రోఁతితోఁకను గాల్చుట తగుదండన మగునని యె. అంత రాక్షసులు నూనియలో నానినప్రత్తితో హనుమంతుని తోఁకను జుట్టి దాని వెలిఁగించి శత్రువుల వేఁగులవాఁ డితఁడని కేకలిడుచు నగరములోఁ బ్రదక్షిణము చేసిరి. ఆవార్త నెఱింగించిన సీత మిత్రుఁడు పడుపాట్లు తన మృదుహృదయమందు శూలములై నాఁటఁ దపించి యగ్నిహోత్రుని జేరి హుతాశనా, దేవా, నేను రామునకుం దప్పినడువకుంటి నేని హనుమంతునకుఁ జల్లగనుండుమని ప్రార్థించె. "తథాస్తు" అని అగ్నిశిఖలు

విజృంభించె. వాయుదేవుఁడును కుమారునిపైఁ జల్లగవీచె. హనుమంతుఁడు నాకేలోకో నెప్పితెలియరాదు. పెను మంటలంటియుఁ దోఁకయేలోకో చల్లగనుండెను. అని యాశ్చర్యమునొందుచు హాస్యమిఁకఁజాలునని దాఁజే యుచున్న వేడుకనుజాలించి పనిపూనె. అంతఁ దటాలునఁ దనకట్లు త్రెంచివైచి తనపైనుండు కావలివారిని జంపి ముందుఁ జేయుదాని నాలోచించెను. రాక్షసు లగ్నిహో త్రమును బ్రజ్వలింపఁజేసిరి. ఆహుతులువేయుట ధర్మము గదాయని నిశ్చయించి హనుమంతుఁ డరుదుగ నటనమా డె. గృహమునుండి గృహమునకు లంఘించె. కోటనుండి కోటకుదాఁటె. నగరునుండి నగరునకెగరెను. తాఁబోవు చోటులకెల్లఁ గాలుచున్నతోఁకతో నిప్పుపెట్టి మెఱపు మెఱయు జ్యోతిభంగి నింగిపైఁబాఱసాగె. తోఁకతాఁకిన దంతయుఁ గాల్చుచుంబోయె. ఇట్లింతయుఁ బాడుసేయు చు హనుమంతుఁడార్చి జయధ్వనులు చెలంగనార్చిన సర్వ భక్షకుఁడు ప్రతిధ్వనిం గావించెనో యనునట్లు పురంబున మంటలు పెట్లు పెట్లుమనినె. తుదకుఁ బురమంతయు నొక్కసుదీప్తమగు గొప్పమంటంబోలి ప్రజ్వలించె. పుర ప్రాసాదంబులు పాడువడియె. పురలక్ష్మిగుందె. అంత హ నుమంతుఁడు సముద్రములోఁ దోఁకఁజల్లార్చి మనంబున విశ్రాంతినొందె.

౧౮౦. అంతటఁ దటాలున సీత మంటలోఁ బడిసె నే మోయని పేరడలుగదిరెను. రభసమున నాకౌఁతియా టలో సీతనుఁ మఱచితిని. సీత యగ్నిపాలాయెనే. అని భయపడుచో దివ్యవాణి జానకి చెక్కుచెమర్పక సుఖం బున్నదని నుడివె. హనుమంతుఁడును జెచ్చెఱనేగి కన్ను లారఁజూచి సీత క్షేమంబున నున్నంగని మగిడి సముద్రము ను బూసి గడిచి యుత్తరతీరంబు సేరె. సంతోషమునఁ బెల్లుగనార్చె. తక్కుంగలకోఁతులు కోరిక లడర వానిం జూచి చుట్టుముట్టి స్వాగతం బడిగ్గిరి. సంతోషమున నెగి రిరి. కేకలువేసిరి. వారలకు హనుమంతుఁడు తనచారిత్ర మును దెలిపినంత నాకోఁతు లుల్లాసంబునఁ బెల్లార్చి పెద్ద యుం బొద్దునకుఁ గొంతశాంతిల్లి మరలి దరలిరి.

౧౮౧. మార్గంబునఁ గ్రోఁతులు స్వాభావికంబుల గు చేష్టలంజూపించి సుగ్రీవుని శిబిరముచేరి తమకథను చెప్పుకొనిరి. రాముఁడు సీతావృత్తాంతమువిన నువ్విళ్లూ రుచుండ నెల్లరు హనుమంతునిఁజెప్ప నియమించిరి. హను మానుఁ డశోకవనంబునఁ గన్నదంతయుఁజెప్పి సీతపుత్తెం చిన వార్తఁదెలిపి సీత శిరోమణిని సీతాపతి కచ్చెను. రాముఁ డారత్నమునుజూచి సిన్నెల్లెడల సాంపారధాంచు సుందరాననం బాసితివే యని కుంది పెచ్చునూర్పుచు నె నరు చిగురొత్త హనుమంతుని గాఢాలింగనముచేసికొని యె. హనుమంతుఁడు శ్రీమూర్ఁ జేసిన మేలున కిది తగు సన్మానమగును. శ్రీ. శ్రీ. శ్రీ.

---

# యుద్ధకాండము.



## రాముఁడు కపిసేనతో లంకకుఁ బ్రయాణమగుట.

౧౮౨. రామచంద్రుఁడు సీతావృత్తాంతంబును విని మనంబున సంతసించియు మరల నలజడిఁబడియె. మనము చేయఁబూనుపని సామాన్యముగాదు. దీని నెట్లు సాధింపనగును? సముద్రము నెట్లుగడుతుము. దవ్వులనుండు లంక నెట్లుసేరుదుము. అని చింతించియు సదాయుత్సాహము గల రామచంద్రుఁడు వేవేగబయలువెడలుమని సుగ్రీవు నెఁబురికొల్ప నాతని మహాసేన పయనమయ్యె. శీఘ్రమున దక్షిణసముద్రముచేర నది తరంగకల్లోలములచే నుప్పొంగుచు విశాలముగ వారలకుం గానంబడియె.

౧౮౩. అటులంకాపురంబున యుద్ధసన్నాహములు సెల్లె. రాక్షసులు బలవంతుఁడగు తమరాజునకు జయంబు నిశ్చయమని నమ్మిరి. రాముని శౌర్యమునుగుఱించి తాము విన్నకథల లక్ష్యపెట్టరు. విభీషణుఁడొక్కరునకు శంకగలిగె. వాఁడు శుచి. దైవభక్తిగలవాఁడు. రాక్షసరూపముదాల్చినను ధర్మపరుండు. కావున నన్నం గని రామునిఁజేర సీతనంపుమని వేఁడుకొనియె. అచటి

గుంపంతయు విరోధముచేయుచుండ వాఁడొక్కరుండేమి సేయనగును? వానిమాటలన్నియు వమ్ములయ్యె. రావణుఁడు సభలోఁ గఠోరముగ వానినిదూరెను. అంతట విభీషణుఁడు విధిగతికి నిస్పృహుఁడై వానినివిడిచి రామచంద్రునికడ కేగెను.

౧౮౪. విభీషణుఁడు వానరసేనను జేరరాఁ దొలుదొల్త వానిని బ్రియంబున నాదరింపరైరి. సుగ్రీవుఁడు యోచనలేక వీఁడు వేఁగువాఁడని నిందించెను. ఇది సహజమే. అందఱుఁ బెక్కువిధంబులఁ జర్చించుచుండ హనుమంతుఁడు విభీషణునిప్రక్కవాదించి వానిని జేర్చుకొనుటలగ్గనియె. రామచంద్రుఁడు వానియెడఁ బ్రసన్నుండయ్యె. విభీషణుఁడు మిత్రుఁడేని వానినిరక్షించుటయేధర్మము. శత్రుభావమున వచ్చినను గాచుటతప్పుగాదు. అనిరాముండు పలికినఁ జెచ్చెఱసుగ్రీవుఁడిట్లనియె. ఆపత్కాలంబున నన్నుం బాసిన సోదరు నెన్నండును నమ్మరాదు. అనిన సత్వరంబుగ వానిని వారించి శ్రీరాముఁ డిట్లనియె. ఈరాక్షసుఁడు నాకెగ్గొనరింపనేరఁడు. అది యట్లుండ మిత్రుండేని శత్రువేని శరణాగతుఁడైనఁ గాపాడుటనావ్రతము. రావణుఁడేని శరణమును గోరిన నభయంబిచ్చువాఁడ. అనిరామచంద్రుఁడు విభీషణునికి శరణంబొసంగెను. లంకాపురి సింహాసనమున

నిన్నుంచెదనని యనుగ్రహించి యప్పుడే వానిని రాక్షసాధిపతిగ నభిషేకించెను. వారు సముద్రమెట్లు దాటవచ్చునని విభీషణుని నడిగిన వాడు శ్రీరాముడు సముద్రరాజును సహాయము వేడుట మేలని విన్నవించెను. రామచంద్రుడు త్రిరాత్రములు సాగరతీరంబుననుండి ప్రార్థించినను సముద్రుడు సాక్షాత్కరించకయుండె. రాముడంత నలిగి నే బాణంబుల సముద్రము శోషిల్లఁ జేసెదఁగాకయని బాణప్రయోగమునకుఁబూనిన నందలి మహాభూతములడలి యార్చె. అంతట సముద్రుఁడువచ్చి రాముని నాగుమని యడిగియిట్లనియె. విశ్వకర్మకుమారుఁడు నలుఁడను కోఁతి నాపై సేతువుగట్టనోపును. దాని నే భరించెదను. ధరణిపై నడుచుకరణి దానిపై వానరసేన నడిచి నన్నుఁ దరించు ననియె.

౧౮౫. అంతఁ గోఁతులు చెట్టుల గుట్టలఁ బెకలించి సముద్రములో నొకదానిపై నొకటిగఁగూర్చుచు నైదు సేతువునైదుదినంబుల ముగించిరి. సేనకదలె. హనుమంతుఁడు రాముని, అంగదుఁడు లక్ష్మణుని మోచుకొనిరి. కొందఱు క్రోఁతులు సేతువునండన నీఁదివచ్చిరి. కొందఱు మింటికెగయుచు సేతువుపైదుముకుచు వచ్చిరి. అప్పుడు కలకలములు తుముల నాదములు సెలంగె. జయజయ

ధ్వనులు నింగినిండె. పెడబొబ్బలుబ్బె. రామచంద్రుఁడిట్లు సముద్రమునుదాఁటె. చెఱపడి పదినెలలు పెనువగలఁ బొగిలి తనకై సీతవేచియున్న దేశమును రాముఁడిట్లుచేరెను. అనిన నావలి కథనెఱుంగఁ జెప్పుమని శిష్యగణంబడిగిన ననివసంతమాంబ యిట్లనియె.

---

## సప్తమాధ్యాయము.



౧౮౬. రాముఁ డిట్లు లంకాద్వీపము చేరి వేగముగఁ గపిసేనను వ్యూహములుగఁబన్నెను. అంత శుకుఁడను రావణుని వేఁగులవానిని క్రోఁతులు పట్టియుండ రాముఁడు విడిపింప సుగ్రీవున కాజ్ఞాపింప విడిపించెను. శుకుఁడును వేవేగ పాఱి రావణునిగని యిట్లనియె. రాముఁ డనేకసహస్రప్లవంగ భల్లూకములఁతో మనతీరమున విడిసియుండెను. సీతనుబంపుము. కాదేని సీతాపతితోఁ బోరుము. ఇది నిశ్చయము. అనినఁ గినిసి రావణుఁడు దేవతలురానిమ్ము. దానవులురానిమ్ము. మఱియెవ్వరైనరానిమ్ము. వారికై నేను సీతను విడువను. మున్ను నేనింద్రయమవరుణులతోఁ బోరాడి గెలువనే. నాతో యుద్ధమున నిలిచిపోర నీ రాముఁ డెంతటివాఁడు. అనియె.

౧౮౭. అని శుకునకు నీవు సారణునితోఁగూడి కొండొకపరి నరిసేనల నరసిరమ్మని నియమించె. వారు క్రోఁతి రూపములఁదాలిచి చని సుగ్రీవుని మూఁకలులెక్కకు మించియున్న నెన్న నేరక మిన్నకుండిరి. విభీషణుఁడు వారినిబట్టుకొని రామచంద్రుని చెంగటికిఁగొనిపోవ దయాపరుఁడగు రాముఁడు వారినివిడిపించి మీరుచూచినవెల్ల మీదొరకుఁ జెప్పుఁడనియనిచె. వారు రావణుని జేరి యొడంబడిక మేలనిచెప్పి దేవా, కలహమున నానయేమియు లేదు. దాశరథికి మైథిలి నిమ్మనిన నేనెవ్వరిభయంబునకు సీతనువిడువనని రావణుఁడు కఠినముగఁ బలికె.

౧౮౮. శుకసారణులు వెంటరా రావణుఁడు సౌధంబుపైనెక్కి శత్రుసైన్యమును బరీక్షించెను. ఆమహాసేన యపారమై మార్కొనరానిదైయుండె. అందలి పోటుమగల శుకసారణులు రాజునకుఁదెలియ వివరించిరి. వారిలో నీలమేఘశ్యాముఁడు పుండరీకాక్షుఁడు నగువీరుఁడే రాముఁడు. శుద్ధస్వర్ణప్రభాకరుఁడు విశాలవక్షస్థలుఁడు నీలకుంచితశిరోరుహుఁడు వీరుఁడు లక్ష్మణుఁడు. ఇట్లంతయు నరసియు ధైర్యంబు విడువక మాటిమాటికి నేనెవ్వరి భయంబునకు సీతను విడువననుచుండె.

౧౮౯. శత్రువులు గ్రమ్ముచుండియు రావణుఁడు సీతపైనున్నయీడేరని కామమును మఱువఁడు. మాయావిద్యుఁడ

గు విద్యుజ్జిహ్వునిరప్పించి నీవు మాయామయమగు రామ శిరస్సు నొక్క మహాధనుస్సునుగొని నావెంట సీతకడకు రమ్ము. అని వానిందోడ్కొని సీతను డాసి రావణుఁడు రాముఁడుచచ్చె. యుద్ధమునఁ బడియె. నాసేన రాముని సేనం దాఁకిపోగి నుగ్గొనరించె. అందు రాముఁడు నిదురించుచుండఁ బ్రహస్తుఁడు చూచి తలఁ దెగనఱికి తెచ్చె. పెక్కండ్రు యోధులు మడిసిరి. లక్ష్మణుండు పాఱె. అని గర్జించి రాముని శిరస్సును దెచ్చిన విద్యుజ్జిహ్వుని బిలువుఁడనిపంచిన వాఁడు వచ్చి యాతలను బెను విల్లును సీతమ్రోలఁ బడవైచెను.

౧౯౦. అక్కటా! అంత సీత దానెన్నఁడు పడని శోకంబునఁబడియె పూజ్యంబైన యాశిరంబు నెత్తుటఁదోఁగియు ధూళియుక్తంబయ్యు నుండినఁ గని జానకిమూర్ఛిల్లె. మఱియును దేరి మువ్వంపుఁ దలఁజిక్కంబట్టి యార్తాలాపంబుల నేడ్చుచుఁ దనప్రియుని గుఱించి విలపించెను. ఓరావణా! రాముని వెంట నన్నును జంపుము. నాదుశిరస్సును రాముని శిరస్సుతోఁ జేర్పుము. అని పలువిధముల నేడ్చుచుండ రావణుఁడు పనివడి నాతురమున నరిగె. వాఁడు పోవ శిరంబును శరాసనంబు నదృశ్యమయ్యె. సీత మరల మూర్ఛిల్లి నేలంబడియె. శరమయను రక్కసి సీతకుం గూర్చునది

గావున వచ్చి సీత నాదరించె. ఇంతలో సీత తేరిన శరము యిట్లనియె. దేవి, మాయచే మోసపోతివి. ఇత్తఱి రావణుండు శత్రుసేన నెట్లు మార్కొనఁ దగును? జయించు టెట్లని మంత్రులతో మంతనంబు లాడెను. ఇందువచ్చి యాసేనను గెలిచితినని బొంకులాడె. నీవోడకుము. అని యాఅశీలంబలికిన సీత శాంతిల్లె.

౧౯౧. కొందఱికి యసాధ్యము. కన్నులఁగనఁదగి చేతులఁదాకఁదగిన తల నింద్రజాలమున నెవ్వరును జేయ లేరు. ఈకథ నమ్మరాదనియందురు గాక. మనంబునఁ గొంకుదురు గాక. యథార్థముగ నది యట్లుగాదు. యూరోపు దేశీయులును నిట్టి యింద్రజాలముల హిప్నొటిజమ్ (Hypnotism) అనుపేరఁ జూపుదురు. ఇట్టిమాయల సులభముగఁ జేయనగుననియు, యథార్థముగ నుండనివస్తువుల మనశ్శక్తిచేతఁ గల్పించిచూచువారికిఁ గనఁబడునట్లును, దాఁకువారికిఁ దాఁకునట్లును, జేసి మోహింపఁజేయుదురు. సీతకుఁజూపినతలయు నిట్లు కల్పితమని తెలియనగు. మనోబలముచే సీతను మోహింపఁజేసిన రావణుం డుండు దాఁక నదియుండె. వాఁడుపోయిన నది తటాలున నదృశ్యమయ్యెను. ఇక్కాలమునందును ఇట్లు కల్పించినదానిని మేమనేకపర్యాయములు చూచియున్నాము. కావున నీ పురాణకథలు కట్టుకథలనియు వానిలోఁ జెప్పినట్లు జరగ

నసాధ్యమనియు నెంచరాదు. నిజమనియు మనమిప్పుడు నిట్టివి నిదర్శనముగఁ జూడనగుననియుఁ దెలియఁదగు.

౧౯౨. అట రావణుండు మంత్రులతో నాలోచనము చేయుచుండ వాని మాతామహుఁడు మాల్యవంతుఁడు సంధి చేయుమని సహేతుకముగ నొక్కి వాదించెను గాని రావణుఁడు వినఁడు. పెనుఁగినుకతో వానిమాటలను ద్రోసివేసెను. ఇది యేటిబుద్ధి? రాముఁడు మనుష్యమాత్రుఁడు. క్రోఁతుల నెలుఁగుల గుంపుగఁ జేర్చికొని వచ్చినవాఁడు. నన్నుమార్కొన నతఁడు సమర్థుఁడే. రణరంగమున నేను సురలజయించనే. ఎవ్వని మ్రోల నాలమున నిల్చి పోరాడ దేవతలు చాలరో యట్టి రావణున కేల్లు భయము గలుగును? నన్ను రెండుగఁ జీల్చినను లొంగను. అని పురిని రక్షింపఁదగు సన్నాహము చేసి తాను త్తరగోపురమును గాచుచుండెను. సైన్యమును దీర్చి రాముండును బల్లిదుఁడైన శత్రువున కెట్టయెదుటఁ దనసైన్యముతో నిలిచె.

౧౯౩. మఱునాఁడు రేపకడ రాముఁడు సేనాప్రముఖులును సువేలాద్రి నెక్కి లంకాపురిని గలయఁ జూచుచుండ సుగ్రీవుఁడు రావణునిఁ బొడఁగాంచి తటాలున నుత్సాహము పొడమ రావణుఁ డుండు గోపురంబున కెగిరి వానికి

రీటమును బడఁడన్నె. అంత వారిద్దఱు పెనుఁగులాడి పెద్దయుంబ్రొద్దు భీకరంబుగఁ బోరాడియు మేలుసేయినేనని చూపలేకుండిరి. ఎట్టకేలకు బలవంతుఁడగు కపిరాజు లాఘవమున మెఱసి యసురరాజు నలయించి గంతులు వైచుచు మగిడి సంతసమున నిజస్నేహితులం జేరెను.

## అంగదరాయభారము.

౧౯౪. అంతట రామచంద్రుఁ డంగదుని రాయబారమంపెను. ఇది నావచనము. దీని రావణున కెఱింగింపుము. "భర్తను జేర సీతను బంపుము. కాదేని సీతభర్తతోఁ బోరాడుము." అని తెలిపి పంపిన నాకుమారుఁడు వెడలి రావణునిం గని యట్లు నుడివెను. దానం గనలి రావణుఁడు వీనిని వధింపుఁడనిన నలుగురు రాక్షసు లంగదుని బిగియం బట్టిరి. పట్టునఁ జిపుక్కుమని తప్పించుకొని ప్రాసాదాగ్రమున కెగసె. ఆ యుద్ధతిచే బిగువుసడలి వానింబట్టిన రాక్షసులు నేలంబడిరి. అంగదుండును నానగరుకప్పును బలిమిమైఁ దన్ని బ్రద్దలు చేసి మింటికెగిరి తనవారిని జేరెను. దానింగని వానరులు పోరికింగడంగిరి. చెట్లులగుట్టలం బెఱికి లంకాపురద్వారములఁ బొడుచుచు వాకిటి బంగరు పని సింగారముల నుగ్గు చేసిరి. అంత నిరువాగులవారును బ్రాణములపై నాశ లేక మొనసిపోరిన నెల్లెడల యుద్ధఘోషము వ్యాపించె.

### రామలక్ష్మణులు నాగపాశబద్ధులగుట.

౧౯౫. సూర్యాస్తమయమయ్యెఁ గయ్యము నిలువదయ్యె. విడువక చీఁకటి రాత్రిలోఁ బెనుఁగులాడుచుండిరి. అంగదుఁ డింద్రజిత్తునుదాఁకి వానిపై గ్రమ్మి కీర్తివడసెను. అంత నింద్రజిత్తు మంత్రబలంబునఁ దన నెదిరించు ప్రాయంపు వీరుని కదృశ్యుఁడై రామలక్ష్మణుల శరపరంపరలం గప్పె. ఆనాగాస్త్రంబులు ప్రజ్వలించుచు రామలక్ష్మణులఁ దగులుచు వారిం గఱచి కట్టివైచెను. కట్టువడి రాముఁడు మైమఱచి పుడమినొరగె. లక్ష్మణుండును వెంట భూమిపైఁబడియె. అదృశ్యుఁడగు నింద్రజిత్తు సంతోషించి పెలుచనఱచి దాశరథుల గెలిచితినని ప్రకటించియు భల్లూకాధిపతియగు జాంబవంతుని నొప్పించియు నాంజనేయాంగదాదుల గాయపఱచియు రామలక్ష్మణులు చచ్చిరని నమ్మించు నిజపురమునకరిగె. వాని విజయంబును గని రాక్షసులు జయార్భటు లొనరించిరి.

### సీత రామలక్ష్మణులంజూచి విలపించుట.

౧౯౬. ఇదిగదా రావణునకు జయమునఁ బుట్టెఁగు నను యము. రావణుండు రాక్షసాంగనలం బిలిచి మీరు సీతం గొని రణరంగమున కేగి కన్నులారం దనభర్త మృతుఁడై పడియుండునది చూపుఁడని చెప్పిపంపెను. వారలు పుష్పకంబుపై సీత నెక్కించుకొని రణరంగమును జేరిరి. ఆ

పుష్పకంబు ధనపతియగు కుబేరుని తేరు. ఈయద్భుతరథం
బును గుబేరునినుండి రావణుండు బలిమిం గొనియె. ఆరణ
రంగమందుఁ జచ్చినవారును, జచ్చువారును బడియుండిరి.
అచ్చట సీత బంగారు లేడిని నాకుఁగొనిరమ్మని తానంపిన
నాఁటనుండి దాఁజూడని వానిని బుడమిపైఁబడి యున్న
వానిని శరపీడితుని బ్రజ్ఞావిహీనుని విధ్వస్తకవచుని, సాయ
కచ్ఛిన్న సర్వాంగుని బ్రాణనాథుని జూచి దుఃఖార్త
యయ్యెను. ఏడ్చి యేడ్చి కన్నీరు గంటఁగార్చియుండియు
నాథుంజూచి బోరున నేడ్చెను. అక్కటా! ఎల్లరునన్నుంగని
నాథునితో రాజ్యమేలెదవని రే. కాలజ్ఞు లిట్లు పలికిరే.
శకునంబు లప్పగిదిఁ దోఁచెనే. వైధవ్యము ప్రాప్తించి దుర్గ
తిగలుగు సూచనలు గానరా లేదే. అవియన్నియు బొంకు
లయ్యెనే. రాముఁడు విగతదేహుఁ డయ్యెనే. అయ్యో!
యందఱిలోనఁ గౌసల్యాదేవి దుర్గతి యెక్కుడు. అనుఁగుఁ
గొడుకు రాకకై వేచియుండునే. అని పలుదెఱంగుల విల
పించుచుండె. ఇట విభీషణుండు రామలక్ష్మణులంగని తా
ను మృతులైరని నమ్మక మూర్ఛ తేరునందాఁక వారలఁ గా
చియుండ సుగ్రీవున కాజ్ఞాపించియుండె. వారట్లు
గాచుచుండుటం జూచి వివేకవతి యగు త్రిజటజానకి
నోదార్చుచు నిట్లనియె. చూడుమమ్మా! వీరు లా శరీరములఁ
గాపాడుచుండెదరు. భయంపడరు. సందియమందరు. అని

యెఱింగించిన సీత యూరడిల్లి యది యట్లయగుంగాక యనియె. వారు మగిడి లంకకుం జనిరి.

౧౬౭. అంతలో రాముఁడు తెలిసి కూరుచుండి దుర్బలుఁడై చుట్టు తిరిగిచూడఁ దనప్రక్కన ముద్దులతమ్ముఁడు భూమిపైఁ బడియుండె. వానింజూచి రాముఁ డుమ్మలికంబునఁ గడు వాపోయె. సీతను మరలఁ బొందిన నాకేమి ప్రయోజనము; నాప్రాణములు దక్కిన నాకేమి ఫలము గలుగును? అక్కటా! నేఁడిదె నాతమ్ముఁడు యుద్ధమున నోడి పడియుండెను. లోకమున వెదకినను సీతంబోలు నాతిం జూడవచ్చుంగాని లక్ష్మణునింబోలు తమ్ముని మిత్రుని బోటుబంటును జూడనగునే. అయ్యో! కౌసల్యా దేవితో నేమందును? కైకకేమని చెప్పుదు; పుత్రదర్శన కుతూహలయగు మాతల్లి సుమిత్రకేమి చెప్పుదు? శత్రుఘ్నునకుఁ దేజస్వియగు భరతునకు సౌమిత్రి నాతో వనమునకు వచ్చె. వానిని విడిచి నే మరలి వచ్చితినని నే నెట్లు చెప్పఁగలను. నాకుఁజూడ లక్ష్మణుఁడు సంగ్రామభూమిం బడి ప్రాణములఁ బాసినట్లున్నది. హా! లక్ష్మణా, నే విషణ్ణుండ నగుచున్నయెడ నన్ను నాశ్వాసించుచుంటివి. నేఁడు నీప్రాణంబులఁ దొఱఁగి నేను దుఃఖించుచుండ నోదార్చ నేరవు. నావెంట నీవడవికి వచ్చితివి. ఇప్పుడు నే నీతోడ

యమునింటికి వచ్చెద. అని శోకించి నేఁ దమ్ముని పార్శ్వమునఁ బ్రాణములు విడిచెద. మీరు తొలఁగి చనుఁడని సేనం బుత్తెంచె. ప్రేమాస్పదమగు రాముని హృదయము సీతావియోగముచే నొచ్చియుండె. తమ్ముని మరణంబునఁ దుత్తునియలై విఱిగె ననుటకు సందేహము లేదు.

౧౯౮. హా, హా, యప్పుడాకాశమున గాలి చలించిన శబ్దము వినవచ్చె. మెఱుపులు మిఱుమిట్లు గొలిపె. పెను ఱెక్కలు గొట్టుట తోఁచె. ఆపెనుగాలి మధ్యమున నగ్ని జ్వాలలంబోలి రభసమున వచ్చు నుల్కయో యనఁగ గరుత్మంతుఁడు విష్ణువాహనము పక్షికులరాజు పన్నగ కులవైరి వచ్చె. అటు వచ్చుచుండ మంత్రప్రయుక్తములగు నాగాస్త్రములు బుసకొట్టుచుఁ దొలఁగిపోయె. గరుడుని మొడలు సోఁక గాయంబులుమానె. అన్నదమ్ము లిద్దఱు బలంబినుమడింపఁ దేజోవీర్యసహితులై లేచి కూర్చుండిరి. రాముఁ డాశ్చర్యపడి నీవెవ్వండవని యడిగిన మహావీర్యవంతుండగు వైనతేయుండానందంబునఁ దనకన్నులు వెలుంగ నిట్లనియె. నేను నీసఖుఁడ. వెలుపల సంచరించు నీ ప్రాణంబునేన. గరుడుండ. అని రాముని నాదరంబున నిమురుచు వెండియు నిట్లనియె. సఖా! రాఘవా, శత్రువులం దేని వాత్సల్యము గలవాఁడా, నేనేగెద. నాకానతి

యిమ్ము. మన సఖ్యమెట్లు గలిగెనో యని యరయఁబో
కుము. జయలక్ష్మి నిన్నుఁ బొందినంతట మన చెలిమి
తెలియనగు. రావణుం జంపి సీతను జేకొందువు. అని గరు
డుండు చనియె. పాంచభౌతిక దేహంబునఁ జిక్కి రాముఁ
డు తన్నుఁ దా నెఱుఁగకుండె. వీరకుమారుండగు రాముఁ
డు విష్ణువనియు, లోకములం దెల్లఁ దనపై నెక్కి విహరిం
చు వాఁ డనియు గరుడుఁ డెఱుఁగు.

౧౯౯. పగతుఱు చచ్చిరంచు సంతసించుచుండు
రావణుఁడు శత్రుసైన్యమున దీనార్తస్వనంబు లుడిగి యా
నందనిర్ఘోషములు సెలంగంగని వ్యాకులచిత్తుఁడగుచు నా
యుత్సాహం బాకస్మికముగఁ గలుగఁ గారణం బరసిరం
డని వడిగల దూతలం బనిచె. వారు పోయి భయంబున
నడలుచు మగిడి వచ్చి రాక్షసేశ్వరా, నీకొడుకు మం
త్రబలంబునఁ బఱగించిన శరములనెడు మృత్యుపాశము
లకుం జిక్కియుండి విడిపించుకొని రామలక్ష్మణులు కట్టు
త్రాళ్లం ద్రెంచుకొని తిరుగు గజముల తెఱంగున రణ
రంగమునందు విచ్చలవిడిగ నిప్పుడు తిరిగెదరు. అనిన రా
వణుండు విషణ్ణవదనుఁడయ్యె. వైరు లిద్దఱు నాగాస్త్ర
ములనుండి విడిపించుకొనిరి. ఇఁక నా బ్రదుకు స్థిరమగునే
యని చింతాక్రాంతుఁడగుచు ధూమ్రాక్షుని బలశాలిని
బిలిచి ససైన్యముగ రాముని జంపి రమ్మని పనిచె.

౨౦౦. మరల సంగ్రామము భీమమయ్యె. అంత ధూమ్రాక్షుండు నాంజనేయుఁడు నెండొరులఁ జంపక విడువమని గలిసి పెనంగిన హనుమంతుఁడు శైలంబొక్కండెత్తి మొత్తిన నారాక్షసుఁడు నేలంగూలె. రాక్షససైన్యంబు మాగిడి లంకకుఁ బాఱఁగపులు జయంబున విజృంభించుచుఁ దఱిమిరి. అంతటఁ బెనుగోఱలుగల వజ్రదంష్ట్రుఁడంగదుఁడు రణమున నిలిచి యున్నయెడఁ జేరిన వారిరువురకు ఘోర యుద్ధమయ్యె. అంగదుఁడు జయించె. మఱియొక రాక్షసవీరుఁడు తలదెగి యిలఁబడియె. వాఁడు పడిన నకంపనుఁడు నిక్కజగడమునకు వచ్చె. జనస్థానమునుండి రామునివార్తఁదెచ్చిన యామేటిని హనుమంతుఁడు మార్కొని యొకచెట్టు పెకలించివైచి చంపెను. ఇఁక మరణవర్షముగురియు పోరికెవ్వరు మొనయుదురని రావణుఁడు శంకించుచు హతశేషులగు సేనానాయకులఁ గలయఁజూచె. వానిదృష్టి ప్రహస్తునిపైనిలిచె. ప్రహస్తుఁడు రావణుని ముఖ్యసేనానాయకులలోఁ జేరినవాఁడు. రణమున మొనసి మేలుగఁదేఱిన మేటిగాపునఁ బ్రహస్తుఁడిట్లనియె. సీతను భర్తకప్పగింపకయున్నఁ బోరువాటిల్లునని చూచి మరల నిచ్చుటమేలని మున్నెయెఱింగించితి. నన్నెన్నండును దానసన్మానప్రియవచనంబుల మన్నించెదవు.

నీకేద్ది మేలొనరించునో దానింగడంగి సేయకుందునే. నా
ప్రాణంబులెంత ? భార్యాపుత్త్రులెంత ? నేను దానిని గ
ణింపను. ఇదె చూడుము. నీకొఱకు రణయజ్ఞమున నా
ప్రాణముల వేల్చెద. అని యా రావణుని కూరిమిబంటు
చావునొడిగట్టుకొని వెలువడి విజృంభించి పోరె. తుదకు
నీలుండు పెనుగొండతో మోది వాని నలిపి చంపె. అంత
వాని దండు బెండుపడి చెదరి లంకకుం బాఱె.

౨౦౧. పిమ్మట రావణుండు మనంబున నోహో
యింద్రుని సేనను జెండాడిన ప్రహస్తుండు వైరిచే మడిసె.
నా వైరి నిఁక నిర్లక్ష్యము సేయరాదు. నేనే యుద్ధరంగము
సొచ్చెద. మున్ను ఛీ! కీశభల్లూకసేన యెంత ? దానిని
గూర్చుకొని నడుపుచున్న నరమాత్రులిద్దఱెంత? బలశాలి
రావణుఁడు వారిని మార్కొనునే. అని నిర్లక్ష్యము చేసితి.
నేనే యిప్పుడేగి వాఁని వారి సేనల నెల్లను దునుమాడెదనని
నిశ్చయించెను.

## రావణుని మొదటి యుద్ధము.

౨౦౨. లంకాధిపతి యుద్ధమునకుం బోవ వెనువెంట
నింద్రజిత్తు నికుంభుఁడు మొదలగు విశ్రుతవీరులుం బరివే
ష్టించి నడిచిరి. రావణుఁడు దివ్యాంబరాభరణభూషితుఁ
డై మహాతేజంబున దీపించి సూర్యునివలెఁ బ్రకాశించె.
వాని భాసురకాంతి రాముని కనుదోయికి మిఱుమిట్లుగొలి

పె. రావణుఁడును దళంబునుజూచి వెనుకకుంబోయి
సుఖంబుండుఁడని నియమించి తా శత్రుసైన్యమును రభ
సంబునఁజొచ్చి నిక్కంబుగ నక్కడ నవతరించిన యముఁడు
వోలె నాశముచేయుచుండె. సుగ్రీవుండు మూర్ఛిల్లి నేలం
గూలె. హనుమంతుఁ డెదిరించి తాఁకిన భళిరా మర్కటా!
నీవు నాకుందగువైరివి. అని పెనుదెబ్బనడచి హనుమం
తుని బలముడిగించెను. నీలుండును మాఱుకొని యుద్ధతి
తోఁబోరాడి చూపరులాశ్చర్యమొందఁ గొంతవడి బల్లి
దుఁడగు రాక్షసాధిపతి యాటోపంబు నివారించి నిలిపెను.
నిలిపియు నెట్టకేలకు నీలుండోడి మృత్యువు వాఁతంబడి
నట్లయి తప్పించుకొని నేలపైఁదొరలె. వానింగని లక్ష్మ
ణుఁడు మోహరించి పైకొని చిక్కనుక్కిన రావణుండు
వానిశక్తికి నచ్చెరువందె. ఇరువురు గాయములచేఁ గడు
నొచ్చియు విడువక పోరుచుండఁ దుదకు సౌమిత్రి భుజంబు
న నొక్క వాడి బాణంబు గాఁడిన నతండు నొచ్చె. చెచ్చెఱ
రావణుండు వానింబట్టికదలింపసమకట్టెంగాని నేరఁడయ్యె.
హిమవన్మేరుపర్వతముల బిట్టాడించిన రావణునకు సుమి
త్రాతనయుని గదలించుట యలవిగాదయ్యె. అయ్యా
పత్కాలంబున లక్ష్మణుండు విష్ణ్వంశమునఁ బుట్టినవాఁడు
గాఁ దన్నుం దెలిసికొనియె. ఆజ్ఞానబలముచేత జగద్రక్ష
కుఁడగు విష్ణువంతశక్తిగలవాఁడయ్యె. రావణుం డతనింగ

దలింపనేరక శ్రమపడుచుండ హనుమంతుఁడు రాక్షసాధి
పునిపైకెగిరి పిడికిటంబొడిచిన నతండు విస్మృతుఁడై ధా
త్రిపైఁగూలె. హనుమంతుఁడు లక్ష్మణుని నాయొత్తడి
నుండి యెత్తికొనిపోయె. అంత రాముండు రావణునిపై
నుఱకంబోయిన హనుమంతుఁడో రామా! నన్నెక్కి
పరాక్రమము నెఱపుమని వేఁడిన గరుత్మంతునిపైని విష్ణువో
యన హనుమంతునిపై నెక్కి పోరె. ఇట్లు రామరావణులు
ఘోరముగఁబోర రాముని భయంకర శరజాలమున రథర
థ్యసారథులు తుత్తునియలైరి. వెండియు రాముఁడశ
నిపాతంబునంబోలు కొండొకయమ్మురంబున నాఁటవైచిన
రావణుండు సొక్కుచుఁ దనవిల్లును దిగవిడిచె. మఱియొ
క్కమెఱుఁగుటమ్మున వాని మణిమయ కిరీటంబు రెండు
తునియలయ్యె. రాముఁడంతఁ దన బాణప్రయోగంబు నాపి
మృదుగంభీరస్వనమున విశదంబుగ నిట్లనియె. నీవు తేజో
వంతములగు మహాకార్యములను జేసితివి. నీచే నా సేనయం
దలి వీరశ్రేష్ఠులుపడిరి. నివు పరిశ్రాంతుఁడవైతివి. నేనిప్పు
డు నిన్ను మృత్యువశునిం జేయను. లంకకుంబొమ్ము. నీవు
ను నీవారును విశ్రమించిరండు. రథమెక్కి మగిడివచ్చిన
నాబలంబును జూపెదఁగాక. అని పుత్తెంచెను. అట్టి
యెడ రామునకుఁ దా విష్ణుమూర్తియనియు, రావ
ణుఁడు తనభక్తుండనియు స్మరణకు వచ్చెనో, భక్తుఁడు

శీఘ్రకాలమునఁ దన చరణారవిందములను మగిడి చేరఁ గోరెఁగదా యని తలఁచి కరుణాకటాక్షములు వికసించెఁగాఁబోలు. ఇదికలయో నిక్కువమో. ఆస్మరణంబున రామచంద్రుఁడు తియ్యందనమున నయ్యా! యింటికింబోయి విశ్రమించి రమ్మని పంపెనేమో.

## —॥ కుంభకర్ణుని మేలు కొలుపుట. ॥—

౨౦౩. అట్లు మృగరాజసదృశుఁడగు రాక్షసరాజు మృగరాజగర్వముడిగి ధైర్యముచెడి లంకంజేరి తనదుష్కార్యములచేఁ దాఁదెచ్చుకొన్న యనేకశాపముల స్మరించె. ఇట్లు భయంపడియుఁ గట్టకడగ నొక్కపరి తెగించి పోరనిశ్చయించి బంటులనంపి మహాబలశాలియుఁ దన తమ్ముఁడును నగు కుంభకర్ణుని మేలుకొలుప నియమించె. కుంభకర్ణుని నిద్ర మంత్రబలమునఁ గలిగె. వాఁడు పెక్కునెలలొక్కుమ్మడి నిద్రించు. వాఁడు మేలుకొన్నచో వాఁడు పేరాఁకలిచే లోకమును మ్రింగఁబూనును. కావున వాని యాఁకలిఁదీర్ప వానిని లేపకమున్న శాల్యన్నరాసులును, మృగమహిష వరాహసమూహములును వాని కన్నంబుగ కొండలుగాఁ జేర్చిరి. కాలుసేతులుసాచి కుంభకర్ణుఁడు పెనుఁగొండవలె సాగిలిపడి నిదురించుచుండె. మహామారుతమున కెనయై వానియూపిరి యెదుటనరుగువారి నెగురఁగొట్టుచుండె. అందుఁ జని రాక్షసబృందము భేరీ

వాద్యముల వాయించిరి. శంఖంబులొత్తిరి. కూసిరి. బొబ్బరించిరి. బండలచే గట్టిగ మోదిరి. నిద్ర తెలియక సుఖంబుగ నిదురించుచుండె. చుట్టుప్రక్కలనెల్లరుఁ దరంగములఁబోలి మ్రోగుచుండ వాఁడొకరుంను గదలకయుండె. అందుఁ గొందఱు వాని చెవులు కొఱికిరి. జలము గ్రుమ్మరించిరి. ఢక్కాల మ్రోయించిరి. కుంభకర్ణుఁడు నిదుర మేలుకొనఁడాయె. వేయిఏనుఁగులు కొండను దాఁకుచందంబున వానిం దాఁకిన నెట్టకేలకు నావలించుచు లేచె. వాఁడు లేచినఁజూచి యచటివారు భయంకరముగఁ దమపైఁబడునోయని భయమున వానితోఁబలుక నోడి చుట్టునఁ జేర్చియున్న యన్నరాసుల వానికి సైగతోఁజూపిరి. అంత వాఁడా రాసులపైఁబడి కబళించెను.

౨౦౪. అంత నాఁకలి దీరినఁ దన్నేల లేపిరని విస్మితుఁడై తన మ్రోల భయంబున వడఁకాడుచున్న వారిం గని నన్నేల మేలుకొలుపవలసె. రాజునకు సౌఖ్యమా. కాక ముప్పుమూఁడెనే. నాతోడుపాటు కావలసెనే. నా వంటివాని నెవరును అల్పకారణమున నిద్రనుండి మేలుకొలుపరు. అని యడిగిన వారు సంక్షేపమున నయ్యాలంకానగరము ముట్టడివేయఁబడినది. రాముఁడు నరమాత్రుఁడయ్యు దేవదైత్యదానవుల కెవరికి నలవిగాని పనులఁ జేసె. రావణుండు వానిచేఁజిక్కి ప్రాణములు గోలుపోనుండియు

వాఁడు పొమ్మని పంపిన మిగిలివచ్చె. అనినఁ గుంభకర్ణుఁడు రోషభీషణుండై నే రామలక్ష్మణులఁ గ్రోఁతిమూఁకలఁ జంపెద. అనుచో నొక్కకింకరుండు వచ్చి రావణుఁడు నిన్ను రమ్మనియెనని తెలిపినఁ గుంభకర్ణుఁడు కుంభిని గదల నడిచివచ్చి పర్వతమునుబోలి లంకకుఁ దరలె.

౨౧౫. రావణుఁడు తమ్ముని సంతోషమ్మున మన్నించి లంకాపురికిఁ బ్రాప్తించిన విపత్తుల సంగ్రహముగ నుడివి రాక్షసబలంబు పెల్లుగం జచ్చుటయు లంకం జుట్టియుండు వానరబలంబులు చూడంజూడం దఱుగకయుండుటయుఁ దెలిపి యిట్లనియె. మున్నెన్నండును సహాయమునుగోరను. ఇప్పుడు మనంబున భయంబుపుట్టె. అనినం దమ్ముఁడిట్లనియె. అన్నా ! యీదురవస్థ నీదుష్కార్యముచే నీవే తెచ్చుకొంటివి. అని దూఱినఁ గోపంబుగదుర నేను పెద్దవాఁడను. నన్ను సేవింపుము. కఱకులాడఁదగదు. గడచినది దూఱనేమగును? ఇప్పుడున్నపనికై శోధుపడవలయు. అనిన రావణునూఱడించి కుంభకర్ణుఁడు పగవారలఁ బరిమార్చెద. సంతాపంబు విడువుము. అతులమగు నాబలమును నమ్ముము. అని బంగరు కవచంబుదొడిగి కడింది యాయుధముల ధరించి యొక్క మహాశూలంబుఁ గొని యనికి వెలువడియె. ఇట్లుత్సాహంబునఁ బోరికివ

చ్చు పర్వతసన్నిభుఁడగు వాని నెదిరింపనోడి కోఁతులెల్ల నెల్లెడలఁ బాఱె.

౨౦౬. పాఱిన నంగదుఁడు కలగుండుపడక బెదరిన దళంబునుగూర్చి పోరికిఁ బురికొలిపె. అంతఁ గోఁతులు కుంభకర్ణునిప్పైఁ గవిసియు వానియపారబలంబు నెదిరింపనోర్వక వెండియుఁ జెల్లాచెదరైరి. అంగదుఁడు వారినిదెగడియుఁ గోపపూరితంబులగు వచనంబులాడియు మఱియొక్కతేప గుమిగూర్చినఁ గ్రోఁతులాకుంభకర్ణునితోఁ బెనఁగిరి. హనుమంతుఁడు వానిమార్గ్గాని మహాశైలంబుతో మోదినఁ వాడును గడునొచ్చియు హనుమంతుని వెడఁదవక్షంబునఁ బొడిచిన క్షణకాలం బాంజనేయుఁడు బలంబుడిగి విహ్వలుఁడయ్యె. అంత నంగదుఁడు తలపడి రాక్షసుని సొమ్మసిల్లఁజేసెంగాని వాఁడంతనలేచి యంగదుని మూర్ఛిల్లనేసె. దానింగని సుగ్రీవుండు చెనకినిలిచినఁ గుంభకర్ణుఁడు వానింబొడువ శూలంబెత్తి గిఱగిఱం ద్రిప్పిన హనుమంతుఁడు దానింబట్టి మోకాల మోపెట్టి విఱిచె. విఱిచిన విడువక కుంభకర్ణుఁడు శైలంబున సుగ్రీవునడచి మూర్ఛితునింజేసి జేసింగానక వానరసేనలు చీకాకు పడుఁగాక యనితలంచి వానిమోసికొని లంకకరిగె. అట్లులంకఁజొచ్చి పోవుచుండ సుగ్రీవుఁడు మూర్ఛతెలిసి క్రోఁతియాటలతోఁ దన్నుఁజెఱగొన్న రక్కసుని ము

కుక్క సెవులం బెఱికి ప్రక్కలంజించినఁ గుంభకర్ణుండు తన్నుఁ గుట్టినట్టి పురుగుం బోలె సుగ్రీవునిం బట్టి నేలం బాఱవైచి కాలంజఱమఁ బోయెను. అంతలో మహాలాఘవంబున నెగిరి యతఁడు తన సేనం జేరెను.

## కుంభకర్ణుని మరణము.

౨౦౭. అంతఁ గుంభకర్ణుఁడు కినిసి సంగరరంగమునకు మగిడివచ్చి మర్కట సంఘమును మ్రింగుచుండ లక్ష్మణుండు వాని కెదురేగి నిలిచి వానిని బాణముల నొంచె. ఆకడిందివిక్రమంబునకుఁ గుంభకర్ణుఁ డచ్చెరువంది దేవతాపరివృతుఁడై యైరావతం బెక్కి వచ్చు దేవేంద్రుఁడు నా మ్రోల నిలువఁడు. నీనికిం దొలఁగుట మేలని లక్ష్మణునటువిడిచి రాముసింగని వానిపై కురికె. ఉఱికిన రాముండు నూఱులవేవేగ నెఱపి వానియాయుధముల విఱిచియు వానిమొడలెల్ల నమ్ములు నాఁట నేసెను గాని దాన వాని బలము తగ్గకయుండె. వాని నొప్పింపనైనను జాలకయుండె. అంత వాఁడు భూరిభుజములచే గదనుద్రిప్పుచుఁ గవిసిన రాముం డొక కఱకుటమ్మునఁ బఱపి యాభుజమును ద్రుంప నాగదయు భుజమును నింగిని బాఱి పెక్కండ్రు కోఁతులపైఁ బడి చంపి పుడమింబడియె. రాముఁడు మఱి యొక బాణంబునఁ దక్కిన భుజమును ద్రుంచి యర్ధచంద్ర బాణములు రెంటిని బ్రయోగించి వాని పెందొడలు విఱిచి

న వాఁడు దొడ్డ మొండెము తలయును మిగిలి నోరు తెఱచి బొబ్బరించుచు నిలిచె. అంతనిలువక మెఱుఁగుఁదూపులు ప్రయోగించి వాని గొప్పతలను నఱికిన నది పర్వతమునుంబోలె నేలందొరలె. డొక్కయుఁ జేరువనున్న సముద్రమున నొక్కింతయు గోపురద్వారమున కడ్డముగ నొక్కింతయుఁబడియె. ఇట్లు కుంభకర్ణుఁడు దేహమువిడిచె. వాఁడు మహాబలవంతుఁడు. వానింజూచిన పారమార్థికవాసన లేమియు లేక యిహలోకవాసనలుమూర్తీభవించినట్లుండె. వాఁడు మడిసిన రావణునడియాసయు మడిసె.

౨౦౮. సోదరుని చావు విని రావణుఁడు శోకాక్రాంతమానసుఁడై మూర్ఛిల్లి తెలిసి పెలుచన విలపించె. ఓవీరా, శత్రుదర్పసంహారా, కుంభకర్ణా, మహాబలా, నన్నుంబాసి యమసదనంబును జేరితివి. ఇఁక నాకు రాజ్యమేల ? ఇఁక సీతతో నేనేమిచేయుదును. కుంభకర్ణుఁడు లేమి ప్రాణంబును గుడింపను. తమ్మునింజంపిన రాఘవుని యుద్ధమున నేఁజంపకున్న నాకు మరణంబు శ్రేయస్సగును. నాజీవితము వ్యర్థము. నేఁడే నే నాతమ్మునిఁ జేరఁబోయెద. అని యిట్లు కృపణాత్మునుఁ దమ్మునికై విలపించుచు శోకమున నేలం బడియె.

౨౦౯. మిగిలిన రాక్షసరాజకుమారులు రావణుని జేరి యూరడించి మేము శత్రువుల మార్కొని యపజ

యంబు దోలంగ జయంబుఁగొని యెదము. అని తెలిపి చెచ్చెర వానరులు శత్రుసేనపైఁగవిసినఁ గయ్యంబు భయంకరముగనయ్యె. ఇరువాఁగుల వారును బెక్కులు సాహసకృత్యములఁ జేసిరి. అంగ దాంజనేయు లపూర్వపరాక్రమంబు నెఱపిరి. మహోదర నరాంతకాది రాక్షసులును వారి కిసుమంతయు వెనుదీయరైరి. అట్లయ్యు నొకరి వెంబడి నొకరుగ రాక్షసవీరులు గూలిరి. పగవారిబంటుమగలు మిగిలి రణరంగమునందు విక్రమంబున వెలసిరి.

### అతికాయుని మరణము.

౨౧౦. అట్టియెడ దేవతలజయించి దానవులఁ బలుమాఱు పాఱఁదోలిన బలశాలి యగు నతికాయుఁడను రావణపుత్త్రుఁడు తండ్రిసేనయందలి శూరాగ్రేసరులు మడిసిన రోషంబున మైమఱచి బవరంబునఁ గరంబు మెఱసె. అంత శూరశిఖామణియగులక్ష్మణుండు విల్లెక్కుపెట్టి మార్కొనిన నతికాయుఁ డతని వారించి తొలఁగిపొమ్ము. నీవు బాలుండవు. కాలుంబోలు నాతో నేల పెనఁగెదవనిన నే బాలుఁడనైననేమి? వృద్ధుఁడనైననేమి? పోరిలో నీవుచచ్చెదవని లక్ష్మణుండు వానిపై మొనసిన నాద్వంద్వయుద్ధంబు భీమంబై యడరె. మంత్రపూర్వకముగ దివ్యాస్త్రప్రయోగ నిపుణతయందు సములగు నావీరు లిద్దఱు పెద్దయుంబ్రొద్దు సమముగఁ బోరిరి. ఎట్టకేలకు నేలొకో నాయ

మ్ములు వీనిం దాఁకి మొక్కపడి నేల వ్రాలుచున్నవని లక్ష్మ
ణుండు విచారించుచో వాయుదేవుఁడు వచ్చి శత్రువుపై
బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగింపుము. తక్కినయస్త్రంబులు
వానిం దాఁకవు. అనియె. లక్ష్మణుఁ డంతనభిమంత్రించి
బ్రహ్మాస్త్రంబును వైన నది యాకసంబున బుసకొట్టుచు
నతికాయుం గనిసె. అతికాయుఁడు దానిమరల్చి రెండుగఁ
ద్రుంపఁబూనిన నయ్యది యనివారితమై మంట లెగయుచు
వచ్చి వానికిరీటాలంకృతశిరంబుపై మొనసి ఛేదించిన
వానిపని ముగిసె. దానిం గని రాక్షసులు భయపీడితులై
పలవించుచు లంకకుం బాఱ హరిమొఱలు రోదసి నిండె.

## ఇంద్రజిత్తు రెండవయుద్ధము.

౨౧౧. ఇట్లయ్యు నింద్రుని జయించి యింద్రజిత్తను పేరు
వడసిన మేటి మగం డొక్కండు మిగిలియుండెను. రావణుం
డు దనవారందఱు నశించి యుండుటం జూచి చింతించు
చుండ శూరుండగు వానికుమారుఁడు వచ్చి తండ్రీ! యిం
ద్రజిత్తింకను బ్రాణములతో నుండఁడే. శోకింపకుము. అని
యుత్సాహము పుట్టించి యుద్ధమునకు వెడలెను. రణ
రంగమున నక్షతలతోడను బుష్పములతోడను అగ్నిని
ముందుగ వేల్చి రథంబును విల్లును అభిమంత్రించి యూరా
తి బలంబుపైఁ గవిసె. అందలి వీరవరుల వెదక మూర్కొ
ని సుగ్రీవుని, నంగదుని మఱియుఁ బెక్కండ్రను మూర్ఛల

ఘమునుంగఁ జేసి నేలం గూలిచె. మఱియు నగోచరుఁడై నా
నాదిక్కుల నమ్ములు పఱపి హనుమంతుఁడు జాంబవంతుఁ
డు నీలుఁడు లోనగు మేటిమగలఁ బడనేసె. అట్టియెడఁ జే
యున దేమియును లేకుండుటచే శ్రీరాముఁడు తాలిమి వ
హించుచు లక్ష్మణునకిట్లనియె. ఈశత్రువు బ్రహ్మాస్త్రంబు
ను బొందె. తానదృశ్యుఁడై మనపైఁబడెడు. శరీరమును
దాఁచిన వీని నెట్లు జయింపవచ్చు. తమ్ముఁడా, నామాటవిని
సహించియుండుము. నేఁ డితఁడు తనయమ్ముల నెల్లెడల నె
ఱపనిమ్ము. మనము మూర్ఛిల్లినట్లు నేలవ్రాలిన నీయసు
రారి యింటికి మగిడిచనును: అనియ భేద్యంబగు తాలిమి మి
గుల రామచంద్రుఁడు పలికె. వారు యుద్ధము సేయక నే
లపై వ్రాలిరి. అదిచూచి యింద్రజిత్తానందించుచు మంది
రము చేరి తండ్రికి సువార్త నెఱింగించె.

౨౧౨. అట విభీషణ హనుమంతులు యుద్ధ భూమి
యందుఁ బడుండుజీవులలో సజీవులెవరో యని యరయు
చు నేగి ఋక్షపుంగవుని జాంబవంతుని గనిరి. అతండు
మూలియు బ్రదికియుండె. బుద్ధిమంతుఁ డగుజాంబవంతుఁ
డు హనుమంతునకిట్లనియె. నీవు వాయువేగంబునం బోయి
హిమవంతమునఁ గైలాసప్రాంతమున నోషధి పర్వతమును
జూచి యందుండు [మృతసంజీవని, విశల్యకరణి, సావర్ణ్యకర
ణి, సంధానకరణి యను] నాలు గోషధరాజములం దెమ్ము.

అని ప్రార్థించిన వాయు పథంబున వాయువేగంబున హను
మంతుఁడు పఱచి హిమగిరిని జేరి కైలాసంబుఁ గాంచి యా
పుణ్యక్షేత్రమందలి వినోదములఁ బరికించి యచ్చట దేదీప్య
మాన ప్రకాశంబునఁ దేజరిల్లు మందుల కొండం గని యందు
జాంబవంతుఁడు చెప్పిన నాలుగు మందులఁ గానక కోపంబున
నాపర్వతంబును మూలమునుండి పెకలించి చండమారుత
ము చెట్టులఁ బాషాణముల రభసంబున నీడ్చుకొని పోవుచుఁ
బోవు చందంబున నాపర్వతంబును మోచికొని యాకసంబు
నవచ్చె. అట్లు మగిడి లంకను జేర నందలి యోషధుల వాసన
దాఁకినంత మాత్రమున మర్కటసైన్యము తేఱి తెలిసెఁ. గా
యంబులు గలవారి గాయములు మానె. చచ్చిన వారు
బ్రదికి కూరుచుండిరి. ఇంద్రజిత్తు పనియంతయు వమ్మయ్యె.
హనుమంతుఁడు గ్రమ్మఱ నాగిరిని గొనిపోయి యున్న
యెడనునిచి సంతుష్టుఁడై రాముని జేరవచ్చెను.

౨౧౩. నాఁటి రేయి సుగ్రీవుని బలంబు లంకపైఁ బడి
దాఁకినఁ గుంభనికుంభులను కుంభకర్ణుని కుమారుల నిద్దఱం
బిలిచి ముట్టడించు మూఁకల వెడలఁగొట్టిరండని రావణుం
డంపెను. వారు వానరులతో నతిక్రూరముగఁ బోరిరి. అందు
సుగ్రీవుండు నొచ్చియుఁ గుంభునిం జంపె. నికుంభుఁడు హను
మంతుని చేఁ జావునందె. అంత ఖరుని కొడుకు మకరాక్షుఁడు
తలంపడి కయ్యమొనరించి దండకారణ్యమునఁ దన తండ్రి

మడిసినట్లు రామచంద్రుఁడు విడిచిన యొక్క బాణంబునన
ప్రాణంబులు విడిచె. పిమ్మట రావణుఁడు మరల నింద్ర
జిత్తు నంపెను. అతం డగ్నిని వ్రేల్చి యదృశ్యుఁడై శత్రు
వుల కగపడక రణం బొనరించె. రామలక్ష్మణులు వానిని
గానక వాని బాణములు వచ్చు దిక్కులు గుఱిగా నమ్ము
లనేసిరి. ఇంద్రజిత్తు నానావిధమాయలఁ బన్నుచు మా
యామయమగు సీతవంటి రూపమును సృజించి దృశ్యుఁ
డై దాని కేశములం బట్టి తల దెగనేయఁబూనె. హను
మంతుఁడు కోపమునఁ దన్నుఁ దాముఱచి వలదు వల
దని వారించినను వినక పరిహసించుచు నింద్రజిత్తు దాని
శిరస్సు నఱికె. అక్కటా! సీత చచ్చెనని నమ్మి క్రోఁతులు
పాఱిరి.

## ఇంద్రజిత్తు లక్ష్మణునిచేఁ జచ్చుట.

౨౧౮. పాఱిన నిర్భరకోపంబున రేఁగి హనుమం
తుఁడు వానరసేనను జేర్చి రాక్షసులపైఁబడి పోరెను.
కొంతవడిఁబోరి సీతచచ్చె. ఇఁకఁ బోరుట నిష్ప్రయోజన
మనుచు యుద్ధము చాలించి రామునిఁ జేరి జానకి చావు
నెఱింగించెను. ఆవార్త విని రామచంద్రుఁడు మైమఱచి
వేళ్లు తెగిన వృక్షంబట్లు నేలంగూలె. లక్ష్మణుండు రాము
నోదార్చెంగాని రాముఁడూఱడిల్లక యుండ లక్ష్మణుం డిట్ల
నియె. రామా! ధర్మంబు నిరర్థకంబు. చూచితే నీయట్టి ని

ష్కళంకున కిట్టి యనర్థకంబులువచ్చె. నీధర్మంబెకాదే నీకీకష్ట
ములుదెచ్చె. అని చెప్పుచుండ విభీషణుండువచ్చి సీతవార్త
ను విని ఇది నిక్కంబుగానేరదు. సీతను రావణుఁడు తెచ్చి
నది చంపుటకుఁగాదు. వాని యుద్దేశ్యము వేఱుగనున్నది.
ఇంద్రజిత్తు మాయలుపన్ని యిదంతయుఁ జూపించె. అతం
డిప్పుడు హోమములు చేయఁబోయె. అదిముగిసిన నా
తఁడజేయుఁడగు. ముగియకమున్న వానినిజంపవలయు.
అట్లు సలిపినచో వాఁడు మడియునట్లు వానికి శాపముగ
లదు.అనిన రాముఁడు తమ్మునితో నీవు హనుమంతునితో
జాంబవంతునితోఁ బోయి మాయామంత్ర కోవిదుండగు
వానింజంపిరమ్మని పంపెను. అంతఁ దనయన్న కోరికను
దీర్ప లక్ష్మణుండు సంతోషంబునఁ జనియె. ఆసైన్య మిం
ద్రజిత్తు చేయు హోమమును రక్షించుచున్న రాక్షసు
లపై రభసముగఁ గవిసి పైకొనిరి. అంత నింద్రజిత్తు నిరా
శ చేసికొని చేయునదిలేక హోమమును ముగించక విడిచి
లేచి తన తలను మరణపాశంబునఁ దూర్చుకొనియె. అది
యెట్లన్న. లక్ష్మణుఁడు హనుమంతునిపైనెక్కి వానింగలి
సిన ఘోరంబగు ద్వంద్వయుద్ధము వెలసె. ఇట్లు దీర్ఘకా
లము క్రూరముగఁబోరియు నొక్కఁడేని వెనుదీయఁడయ్యె.
ఇంద్రజిత్తు తేరు తునకలయ్యె. వాఁడెక్కిన వేఱొండు తేరు
నట్లయయ్యె. ఒకం డభిమంత్రించి యస్త్రములం బ్రయో

గింప మఱియొకఁడు వానినుపసంహరించు. ఇట్లిరువురును బోరుచుండఁ దమదోర్బలంబును నస్త్రవిద్యాకుశలతయు సంపూర్ణముగ వినియోగించిరి. ఎట్టకేలకు లక్ష్మణుం డైంద్రాస్త్రమునుగొని రాముఁడు ధర్మాత్ముఁడేని సత్యసంధుఁడేని నీవు రావణకుమారునిజంపుమని ప్రయోగింప నది ఇంద్రజిత్తు శిరంబును ఖండించె. దేవతలజయించినవాఁడును బలవంతుఁడగు తనతండ్రికి రక్షకుఁడునునగువాఁడిట్లు మడిసె. ఇట్లు వానిశరీరము నేలంగూలియుండఁ గళంకముగనుండిన యాకాశము తేజోవంతమయ్యె. నిర్మలోదకంబులఁ బ్రవాహంబులుపాఱ భూలక్ష్మి చిఱునవ్వులనవ్వినట్లుండె. పుష్పవర్షముగురిసె. దేవతలెల్ల సంతసిల్లిరి. ఋక్షమర్కటసైన్యము లక్ష్మణునిచుట్టుముట్టిబొబ్బలుపెట్టి గర్జనలుచేసిరి. వీరుఁడగు దశరథకుమారుని బెలుచన పొగడిరి.

౨౧౫. అతికష్టమగు నావార్తవిని రావణుఁడు గుండెలుపగిలి పేరడలుపోఁక నిశ్చేష్టితుఁడై యంతలోన దెలిసిలేచి కేవలపాపకర్మునిరీతిని బగఁదీర్చెదనని దారుణనిశ్చయముచేసె. నాగాదిలిపట్టి వనచరుల వంచనచేయ మాయచే సీతరూపమునుగల్పించి దానినిజంపి సీతయే యనిచూపించె. ఆమంగళకార్యమును దథ్యంబుచేసెదఁ. క్షత్రియమిత్రుఁడగు రామునకు భర్తురాలగు సీతనుజం

పెద. అని ఖడ్గంబుఁగొని సీతనుజంపఁబూని యుద్ధత్రితో నశోకవనమునకుంబాఱె. అంత వానియమాత్యులలో నొకఁడు సుపార్శ్వుండనువాఁ డెంతయు సాహసిం చి దోషపూరితుఁడగు వాని కడ్డపడి నివారించుచు వలదు వలదు. ఈపాపిష్ఠి కార్యము సేసి నీకి క్రినిఁ జెఱుచు కొనకుము. అనదయైన మానిసిని జంపకుము. దానినాథు ని జంపుటొప్పదే. అంత మైథిలి నీదగును. అని వారించిన రావణుఁడు నిలిచి విన్నఁదనంబున మరలి యిల్లు చేరెను.

## మూలబల యుద్ధము.

౨౧౬. ఇట్లు రావణుఁడు దుఃఖించుచుఁ గూరుచుం డియుండ వాని సైన్యము సాహసంబును విడువక మరలఁ దరలిరి. రావణుఁడు వారికి నిట్లాజ్ఞాపించె. మీరు రాము నొక్కనినే మార్కొనుఁడు. వాఁడు మీచేఁజావఁడేని యె ల్లి నేన నాశముచేసెద. అనిన వారట్లు చేయఁబూనిరి. వారు రామునివెదుక నవసరములేదయ్యె. ఎల్లెడలఁ దాన యై రాముఁడేయగపడెను. సంగ్రామభూమిలో రాములు వేల కొలఁదిగనుండిరో యనఁదోఁచె. ఇందునందు నతిజ వంబునఁ దిరుగుచుఁ గన్నుల నిలిపిచూడ నెందున్నదియుఁ దెలియనట్లును, ఒకసారి చూచువారికిఁ గనఁబడకయుండ మాయమైనట్లునుండె. లంకలోని రాక్షసస్త్రీలు భర్తల ను సోదరులను బుత్త్రులను బోఁగొట్టుకొని యేడ్చుచు

రాక్షస నాశకారణమగు స్త్రీయొకతె పుట్టునని తాము తొల్లివిన్నమాటను స్మరించి యదియే సీతయని విలపించిరి. రోదన ధ్వనులతోఁ బురమెల్ల నిండియుండె.

౨౧౭. ఆయార్తనాదంబులు విని కినిసి రావణుఁడుతన బంధువులును నాయకులును జచ్చియున్నందునఁ గసిదీర్చువాఁడై రథమునకు గుఱ్ఱములఁ గట్టించుఁడు. ఆయుధములు గొనితెండు. అనియాజ్ఞాపించి హతశేషులగు శూరులతో యుద్ధమునకు వెడలె. వెలువడుచో దుర్నిమిత్తంబులు దోఁచె. వాని కోపంబునకును, దేజస్తిమిరములకుఁ గలుగఁ బోవు పోరునకును నడలినట్లు భూమియంతయు వడఁకె. కడపటి పోరుకైకదా శ్రీరాములవతరించినది. అధర్మమునంతయుఁ జేర్చుకొని యేలు వానితోఁ బోర సమయము వచ్చె.

## రావణుని రెండవ యుద్ధము.

౨౧౮. రావణుఁడు ఘోరంబుగఁ బైఁబడి యురవడించినం జూచి కోఁతులమూఁక విచ్చిపాఱె. అయినను సుగ్రీవుం డెక్కటికయ్యమున మహోదర విరూపాక్షులం జంపె. అంగదుఁడు మహాపార్శ్వుని నోడించె. రావణుండు పురము వెడలు తఱి వాని రథంబు నెక్కివచ్చిన మువ్వురు నాయకులు మడిసిరి. ఈనష్టముచేఁ గోపము హెచ్చి రావణుఁడు రాములతోఁ మాఱ్కొనినంత వారి ద్వంద్వ

యుద్ధముత్కటమయ్యె. ఒక్కని నొక్కండు నొప్పింపనేరం
డయ్యె. ఒకనియమ్ముల వేఱొకండుపసంహరించె. వార
స్త్రవిద్యయందును గౌశలమునందును సము లగుటంజేసి
వారియస్త్రంబు లన్నియు మొక్కలైపడియె. అట్టియెడ
లక్ష్మణుండు రావణుని సారథిపైం గవిసి వధించె. విభీష
ణుండు తేరిగుఱ్ఱములం గూల్చె. ఐనను ధైర్యము వదలక
రావణుండు తమ్ముని మూర్కొన భూమిపైకి లంఘించిన
లక్ష్మణుండు శూరుండై విభీషణునకడ్డము సొచ్చె. నొచ్చి
న రావణుండు విభీషణునిపైం బ్రయోగించిన శూలంబు
లక్ష్మణునిం దాంకె. ఆశూలంబు బుస కొట్టుచు నాకసం
బున వచ్చుచుండ రాఘవుండు చూచి తమ్ముని గావ
వానికి స్వస్తియగుం గాక యిది కీడింపకుండుం గాని యది ని
ష్ఫలమయ్యె. రాముండు ప్రేమచేం బన్నిన కవచంబును
రాక్షసుని రోష దీప్తి భేదించె. శూలంబు లక్ష్మణుని

## లక్ష్మణ మూర్ఛ.

దాంకిన వాండు మూర్ఛిల్లి నేలంబడె. వాని వీక్షించియు
నది విషాదమునకుం గాలంబు గాదని రాముండు రావణు
నిపై మొనసెం గాని యంతలోన నట లక్ష్మణుని వక్షం
బున నాంటిన శూలమును గోంతులు పెఱుకంజాలక యు
న్నంజూచి కయ్యంబు చాలించి తమ్ముని రక్షణార్థము

పోయెను. అంతఁ దన్ను రక్షించుకొనకుండిన రాముని శరీరమునపై రావణుండు శరవృష్టిని గురిసె. క్షణకాలమున శూలము నూడఁదీసి రాముఁడు మగిడి శత్రువును నతి రౌద్రంబుగఁ దాఁకిన రావణుండు వెఱగు పడి పారెను. రాముఁ డంత లక్ష్మణుని కడ కరిగి వాఁడు చచ్చెనని యెంచి యార్తధ్వనుల విలపించె. ఇఁక నాప్రాణమేల? లక్ష్మణుఁడు నొచ్చి రణరంగమునఁ బడియున్నవాఁడు. ఇఁక నాకు యుద్ధమేల? దేశదేశములందు భార్యలఁ బడయవచ్చు. దేశదేశముల మిత్రులఁ గనవచ్చు. కాని తమ్మునిఁ జూడనగు దేశము గానరాదు. హా, హా! తమ్ముఁడా, పురుషసింహుఁడా, బల్లిదుల మేటి మగండా, ఏలరా, నన్నెడఁబాసి పెఱలోకములఁ ద్రిమ్మరియెదవు? తమ్ముఁడా, నీకై విలపించు నాతో మాఱుమాటాడవేల? లెమ్మా. ఏలయిట్లు పడియుండెదవు? కన్నువిచ్చి నన్నుఁ జూడుమా, అనినవనరుచుండు సుషేణుఁడు లక్ష్మణునందుఁ బ్రాణచిహ్నములంజూపి రామునోదార్చి హనుమంతు నంపి యొక్క మంత్రౌషధిని దెప్పించి నలిపి ముక్కునఁ బిండిన సౌమిత్రి తెప్పిరిల్లి లేచె. అంతరాముఁడు సంతోషించి శోకంబుట్టునను బ్రియంబున నక్కునం గ్రుచ్చిపట్టి యోహో! చచ్చియు నదృష్టవశంబున మరలఁ బుట్టె

తివి. నీవు లేకుండినఁ బ్రాణంబును జయమ్మును సీతయు నిరర్థకంబులని యేడ్చె.

౨౧౯. లక్ష్మణుం డనవరతము రాముని యశంబును గోరువాఁడు గావున రావణుండు జయింపఁ బడకుండ రాముఁడు నాకుపచారము సేయుచుండెఁ దగునే యని యప్రియమంది రాక్షసుని నాశముచేసెద నన్నమాటు జరపవేయని రాముని వేఁడెను.

## రావణ వధ.

౨౨౦. రఘునందనుఁ డంతటఁ గ్రిమ్మఱ రావణుని వెదకుచు నేగె. వాఁడును వేఱొండు తేరెక్కి వచ్చిన నింద్రుఁడు మాతలిసారథిగ నడుపు తనరథంబును దనకవచంబును విల్లును బాణములను శూలమునిచ్చె. ఇట్లు వారిరువురు సమానబలులై తమయరదంబులందుఁ గూరుచుండి పోరిరి. రావణుఁడు బాణములు వైచిన నవి యగ్నిమయసర్పములయిన వానిని జంపు గరుడరూపములు దాల్చిన బాణములఁ బ్రయోగించి రాముఁ డుపసంహరించెను. అట్లయ్యు రావణుఁడు రాముని పైఁబడి నొక్కిన దేవతలు తల్లడిల్లిరి. సముద్రము కల్లోలమందె. సూర్యునికాంతి మందమయ్యె. రావణుఁడు వజ్రతుల్యమగు శూలంబు వైవ నదిరాముని బాణంబులచేఁ జెడక మించి యగ్నిశలభంబుల దహించునట్లు వానిం దహించె. రాముఁ డంతఁ

గోపానల దీపితాంతరంగుఁడై యింద్రశక్తిం బ్రయోగిం చి రావణుని శూలమును ఖండించి శరవర్షము గురిపించి న దిగ్భ్రమఁ జెంది రావణుండు పోరనేరక నిలిచె. వాఁడు దుర్బలుఁడగుటఁ జూచి రాముఁడంత యుద్ధమును నిలిపె. వానిసారథి తేరును రణరంగమునుండి తొలఁగించి కొని పోయె. అంతలో రావణుఁడు తెలిసి లేచి యతి రోషం బున వానిని దూఱుచు నోరీ! నేను యుద్ధముచేయు కో రికచే దహింపఁ బడుచుండఁ బగవానియెదుట నన్నుఁ బి ఱికివానిగఁ జేసితివి. రాముఁడెరుగకమున్న సమరభూమిఁ జేరవేవేగ రథమును మరలించితోలుము. అని యాజ్ఞాపిం చె. అట పోరుఁజూడనచ్చిన యగస్త్యమహర్షి రాముని దరియవచ్చి యాదిత్యదేవతాకమగు నాదిత్య హృదయ మహామంత్రమును జపింపుమని బోధించిన రాముఁ డట్లు చేయువాఁడై చిత్తము నేకాగ్రముగఁ జేసి తనశక్తినంత యు వినియోగించి జపించె. తదనంతరము రామ రావణు ల యరదంబులు రెండు నొండొంటిని నీలమేఘమును బో లి తాఁకిన నాఘోషము మేఘ గర్జనం బయ్యె. శరాగ్ని జాలంబులు మెఱపుఁదీఁగెలయ్యె. గ్రద్దలు గుమిగూడె. న క్కలఱచె. చండమారుతము వీచె. ఆకాశమున మబ్బు గ్రమ్మె. వారొండొరులఁగలియ నితరులందఱు యుద్ధంబు చాలించి కోఁతులును రాక్షసులును ఆమహాహావంబును

జూచుచుఁ గదలక నిలిచిరి. వారి యరదంబులు రెండును మండలవీథి గిఱగిఱఁ దిరిగె. వారొండొరులఁ గడచిపోరఁ జూచిరి. శరములు సోనవానవలెఁ గురిసె. రాముని దివ్యశరంబున రావణుని శిరంబొక్కండు తునిఁగి పడినఁ దత్క్షణంబ వేఱొండు తలయచట మొలిచె. ఇట్లెన్నియో పర్యాయములు తలలు తెగఁ దలలు మొలుచు చుండె. అట్లయ్యు రావణుఁడు వెనుదీయక పోర నాభీమసంగ్రామమ్మేడహోరాత్రములు విడువక చెల్లె. ఎట్టకేలకు రాముండు తనకుంగలయుత్తమోత్తమాస్త్రంబును గ్రహించె. ఆయస్త్రంబును సర్వభూతసారమునుగొని బ్రహ్మసృజియించి యింద్రునకిచ్చె. అది బలంబున యమునింబోలియుండె. రాముండు దాని వైదికమంత్రముల నభిమంత్రించి ప్రయోగించిన నది రావణుని వక్షస్స్థలమధ్యమును దూఱి వచ్చె. అంత నాయుధములు రావణుని చేతులనుండిజాఱె. వాఁ డరదంబుపైఁ గూలి యందుండి నేలకుం దొరలె. తామసాధిపతి యిట్లు తనువు దొరఁగె. రాముఁడవతరించిన పనిముగిసె. అప్పుడు విభీషణుఁడు వేఁడిన రాముఁడు సాభిప్రాయములగు వచనముల నిట్లనియె. మా వైరంబు మరణంబున ముగిసె. మా పని తీరె. నీకుంబోలె నాకును రావణుఁడు ప్రియుఁడు. వానికుత్తరక్రియలఁ గావింపుమనియె.

## విభీషణ పట్టాభిషేకము.

౨౨౧. ఉత్తరక్రియలు చెల్లినంత రామచంద్రుఁడు విభీషణుని లంకాధిపత్యమునకు నభిషేకించి యాంజనేయునిం బిలిచి నీవేగి సీతనరసిరమ్మనియె. ఆపరమభక్తున కిది కాదేసంతోష సమయము. తొల్లియాదేవి పెనుసంకటములఁ జిక్కియుండ నా దేవి సాన్నిధ్యమునకుఁ బోయియుండె. ఇప్పుడు ఆనందంబున సాన్నిధ్యమునొంది జయవార్తను దెల్పి దేవీ, రావణుండు చచ్చె. ఇఁకనీక్షేమము నిరపాయమయ్యెననిన సంతోషమున మేనుమఱచి సీత ప్రత్యుత్తరం బీయకుండియు నంతన తెలిసి స్నిగ్ధములగు మృదువచనంబులవాని సంభావించి కొనియాడె. అంత హనుమంతుఁడు దేవీ, నిన్ను బాధలు పెట్టిన రాక్షస స్త్రీలఁ జంపనానతీయవే యనిన సీత మెల్లన వాని వారించి వీరు కేవల భటులు. రాజాజ్ఞకులోఁబడి నడిచిరి. అది యట్లుండఁ గష్టములన్నియు మనము చేసికొన్న దాననే వచ్చును. మనల్ఁ గష్ట పెట్టు వారు నిమిత్తమాత్రులై వచ్చుచున్నారు. మనము వారియెడఁ గారుణ్యముచూపుట ధర్మము. పగదీర్చుకొనరాదు. అని భక్తప్రియుఁడగు భర్తనుజూడవలెఁతు నని హనుమంతుని రామచంద్రుని కడ కనిపిన నతండరిగి సీత పలుకుల రాఘవున కెఱిఁగించెను.

౨౨౨. శ్రీరాముఁ డించుకసే పూరకుండి ధ్యానించి నిట్టూరుపు నిగుడించుచు సీతను రాజకీయాలంకారసంయుతను గాఁ జేసి తోడుకొనిరమ్మని విభీషణు నియమించిన హర్షంబున రాక్షస రాజుచని రామసందేశమునుసీత కెఱింగించెను. సీతయువిని రాక్షసాధిపా! నేను స్నానమైనను లేకయే నాభర్తను జూడఁ గోరెదననినన తండుమందస్వరంబున నీభర్త రాముని యాజ్ఞానుసారము గావించుట తెస్సయనియె. సీతయు నట్లయగుంగాక యని వినయంబునఁ బలికి స్నానమొనరించి దివ్యాంబరాభరణములఁ దాల్చి రాజకీయాలంకారములఁ జేసికొని శిబికనెక్కిన నాదేవిని భర్తను జేరఁ దోడి తెచ్చిరి. అట రామచంద్రుఁడు సమాధినిష్ఠుఁ డై యుండి కన్నులు విచ్చిచూచి విభీషణా సీతను చేరువకుఁ గొనిరమ్మనియె. అట్టియెడఁ జట్టుముట్టి గుంపులుగఁ జూడవచ్చిన జనుల విభీషణుండు తొలఁగఁ ద్రోచిన రాముఁడు వానిని వారించి వారలనుండనిమ్ము. వారెల్లరు నావారెకదా. వైదేహిని శిబిక నుండి దిగి రమ్మనుము. మేము కలియుట నెల్లరుఁ జూడవలయు నని నియమించెను.

౨౨౩. రాముని గంభీర వాక్యముల తాత్పర్య మెఱిఁగి లక్ష్మణసుగ్రీవహనుమంతు లిది చిరకాల మెడఁబాసిన భార్యాభర్తలు కౌతుకంబునఁ గలియుటయే గాదని యుల్లములఁ దల్లడిల్లిరి. విభీషణుఁడు కొనిరాఁ బాదచా

రిణియై సీత రాముని డాసె. ఆదేవి దివ్యాంబరములం
గట్టుటం జేసి వాడిన మోమును గృశించిన దేహమును
జక్కఁగ వెల్లడి యయ్యెను. ప్రేమహర్షములచే సౌమ్య
వదనంబు తేజరిల్లె. నిజమనః కమలంబునకు సూర్యుఁడగు
నమ్మహానుభావుని జూడఁ దమకమున నాఁకొన్నభంగిఁ
గన్నులు రామునందె నిలుకడఁగో నిలిచియుండె. అంత
రాముఁ డల్లన విశదముగ నిట్లనియె. శాంతాత్మురాలా !
రణమున శత్రువులఁజంపి నీపగవాని జయించితిని. ఒక్క
పెట్టునఁగో నాయవమానమును నాశత్రువును నాశనము
చేసితి. అని సంగ్రహముగఁ దాఁ జేసినపనిం దెలిపె. సీత
చింతాక్రాంతయై మృదునయనములఁ గన్నీరు దొరుగఁ
దనపతిని ఱెప్ప వేయక చూచుచు మనంబున నివి యె
క్కడియుపచారములు? భార్యకు స్వాగతవచనంబు లిట్టి
వియగునే, యని తలంచెను. తన ప్రియకాంత యగు
సీత సమీపించుచుండఁ జూచి గాఢముగ యోచించి
“తులువయగు రావణుని యింట నొక్క సంవత్సరంబు సీత
యుండె. అదియనింద్యచరిత్రయనినిరూపించకమున్న దాని
యందలి గాఢప్రేమకు లోఁబడి దానిని గ్రహించిన నన్ను
రాజునుగాఁ బాటించు ప్రజలకుఁ జెడ్డత్రోవను జూపినవాఁ
డనగుదు. నాకామమును ప్రధానము చేసి ప్రజలమేలు
ను సత్ప్రవర్తనమును రక్షించుటను విడనాడినట్లగును.”

అని యెఱింగి గాఢమగు తనయాశ నడంచుకొని సీతతోఁ గఠిన వాక్యముల నిబ్బరమున నిట్లనియె.

౨౨౮. "రావణుఁడు చేసిన యపరాధమును దండించితిని. నీకై శ్రమపడితిని. యుద్ధము చేసితిని. నీవు చిరకాలము పరగృహమున వసించితివి. రావణుఁడు తొడలపై నిన్నెక్కించుకొనియె. మదనాతురదృష్టితో నిన్ను నతఁడు చూచెను. నీయిచ్చ మెయి నరుగుము. నీకిష్టమగు చోట వసింపుము." అని

౨౨౯. తననిష్కళంక చారిత్రమును ప్రాణేశ్వరు నికై తాఁబడిన పాటులన్నియుఁ, జిరకాలము తానను భవించిన వేదనలును, దననిశ్చల పాతివ్రత్యమును నెఱుంగు సీత దీని కేమననేర్చు? ఆఁమదిగాన కొంతసేపు కన్నీరు విడిచి యేడ్చె. పిదపత్తి కాన్పున వేవేగ ధైర్యంబుఁ బూని యిట్లనియె. ప్రాణనాథా! ప్రాకృతపురుషుఁడు ప్రాకృతాంగనలఁ బలుకుచందమున నికుంబోలని కఠినవాక్యములేల పలికెదు? నేను నీతలంచు నట్టిదానను గాను. నన్ను నమ్ము ము. నాశీలముసాక్షిగా సత్యమాడెద. నాథా! నాదేహంబు నొరుండంటెఁగాని నేను బరవశనై యుంటిని. నేనుక్కటియుం జేయను. నాహృదయము నాయధీనము. అది నీయందవర్తించును. నా శరీరమునకో నేనేమిచేయుదును? అది పరాధీనమయ్యె. నా యధీనమున లేకయుం

డె. పెద్దకాలంబు మనము కూడియుంటిమి. నీవు నన్నె
ఱుంగ నోపవేని నిశ్చయముగ నే నెప్పటికిని జెడినదాన
నగుదు. ఇక్కడికి రాకమున్న త్యజింప రాదే. అట్లయిన
నీ ప్రాణమున కపాయము గలుగకుండు. నీ మిత్రులకును
ను భారంబు లేకయుండు. హనుమంతునితో నిట్లు చెప్పి
యున్న నే నప్పుడ ప్రాణంబుల విడుచనే. సర్వజనుల శీ
లము లెఱుంగు నీవు నాశీలము నేల గమనింపవు? అని ప
లికి లక్ష్మణుని దెసఁ దిరిగి దృఢంబుగఁ దడఁబడక యిట్ల
నియె. సౌమిత్రీ! నా కొక్క చితిం బేర్చుము. అదియే యీ
విపత్తునకు మందు. నిష్కారణముగ నిందుకు లోఁ బడి
జీవింప నిచ్ఛయించను.

## సీత యగ్నిలోఁ బ్రవేశించుట.

౨౨౫. అనిన సందియమ్ముతో లక్ష్మణుండు రా
మునిం గని రాముసైఁగవలన భావ మెఱింగి చితిం బేర్చె.
ఎల్లరు రాముం జూడను, వారితోఁ బలుక నోడిరి. రా
ముఁడు యమునివలె నిలిచి మాటాడకయుండె. అంత సీత
రాము ననుజ్ఞనుగొన మాటాడక యతనికి వలగొని వచ్చి
కావు మని యడుగక కరుణింపుమని సంజ్ఞలనైనఁ జూపక
యగ్నిం జేరి పావకా! లోకసాక్షీ, నాహృదయము రాము
ని నెప్పు డెడఁబాయదు గాన నన్నుఁ గావుము. లోక
సాక్షీ, శుద్ధచారిత్రను, నన్ను రాముఁడు నీచురాలిని

గఁ దలంచుఁ గాన నన్నెల్లభంగులఁ గావుము. అని ప్రార్థించి వినయంబును, అతుల గాంభీర్యంబును ప్రకాశింప దీపించుజ్వాలలలోఁ బ్రవేశించెను. మంటలు సుడివడి యావరించిన నాదేవి బంగారమ్మును బోలి తేజరిల్లె. అంతలోన నాజ్వాలలకాంతిచే నా దేవి మఱుఁగుపడి యగోచరయయ్యె. ఎల్లరు హా హా నినాదంబు లొనరించిరి. అగ్నిజిహ్వాలు విజయంబు నొందెనో యన మించి ప్రజ్వలించె.

### బ్రహ్మాదులను రాముఁడు చూచుట.

౨౨౭. అంత రాముఁడు మరల సమాధిం గూరుచుండె. అపుడు బ్రహ్మయు శివుఁడు, వరుణుఁడు, యముఁడును గనఁబడిరి. దేవగణంబున విష్ణువేల లేఁడని చూచుచున్న రామునకు నిట్లనిరి. ఓ యీశ్వరా, దేవోత్తమా, నీ వేల నిన్నెఱుంగవు. నీవు సర్వలోకరక్షకుఁడవు. జ్ఞానవరేణ్యుఁడవు. అగ్నిఁ బ్రవేశించిన సీత నేల రక్షింపవు. ప్రాకృతుండవుపోలె వైదేహి నేల యుపేక్షించెదవు. అనిన రాఘవుఁ డిట్లనియె. నేను మానవుఁడ నని యెఱుంగుదు. దశరథ సుతుఁడగు రాముఁడ. నేనెవ్వఁడను. ఎందుండి వచ్చితిని. పితామహా వివరింపవే. అనిన బ్రహ్మయిట్లనియె. నీవు నారాయణుఁడవు. చక్రగదాధరుఁడవు. పురుషోత్తముఁడవు. విష్ణువు. ఋషుల కాశ్రయుండవు. లోకంబుల కాధారంబవు. సీత లక్ష్మి. రావణుని జంప మ

నుష్యదేహము ధరించితివి. నీవనియయ్యె. సంతోషము న దివంబునకు మగిడిరమ్ము.

౨౨౮. అని బ్రహ్మపలికిన నగ్ని దేవుఁడు జ్వాలల లోనుండి యావిర్భవించె. సీత యా దేవుని యంకతల మునఁ దేజరిల్లె. అగ్ని శాఖలు రాజసింహాసనము నఁ గ్రాలు తోరణము వలె తన ప్రభువుఁ జుట్టి గ్రాలె. అట్లు తోఁచి యగ్ని దేవుఁ డిట్లనియె. రామా, యిదె నీ వైదేహి. ఏ పాపం బీదేవిం బొరయదు. రాక్షస సంఘము చుట్టుముట్టి గాచియుండియు నేప్రొద్దు నీయందె యీ దేవి మనస్సు నిలిచి భక్తితో నుండెం. ఈదేవి నిర్మలచిత్త. పాపము దీనిం బొరయదు. కావున మైథిలిని మరలఁ గైకొనుము.

౨౨౯. అనిన రాముఁడు మరల ధ్యానము చేసి యిట్లనియె. ఈ శుభాంగి దీర్ఘకాలము రావణుని యంతఃపురంబున నుండెఁ గావున నెల్లరుఁ జూడ నిట్లు పునీతఁ జేయవలసె. ఇట్లు సేయక జనక తనయను నేను గ్రహించి యుంటినేని దశరథ సుతుఁడగు రాముఁడు కామ వశుఁ డనియు ధర్మమును దెలియఁ డనియు లోకులందురు. జనకాత్మజ భక్తితో నాయందు మనస్సు నిలుపునది య నియు నితరులఁ దలంపనిదియనియును బూర్ణముగ నే నె ఱుంగుదు. సముద్రము చెలియలికట్టను గడువ నేరనట్టులు

నిజ పాతివ్రత్యముచే రక్షింపఁబడును. సీతను రావణుండం టనేరఁడు. ప్రజ్వలించు నగ్నిశిఖంబోలి డాయరాని మైథిలిని జెనక నేరఁడు. రావణు నంతఃపురమున నుండియు నా దేవి మనస్సు చలించనేరదు. సీత మఱియొకరిది గాదు. ప్రభ భాస్కరుని దగునట్లు సీత నాది. ముజ్జగంబుల యెదుట సీత పునీతయయ్యె. కావున నా దేవిని నేను త్యజింప నేరను. ధర్మవంతుఁడు కీర్తిని విడనాడునే. అని సీతను జేకొనియె. ఇట్లు మరల సీతారాములొండొరులఁ గూడిరి.

అని యెఱింగించి తదనంతర కథాకర్ణన కుతూహలు లైన మాణవకుల కనివసంతమాంబ యిట్లనియె.



## అష్టమాధ్యాయము.

---

230. శ్రీరాముని దేవతలు వీడుకొనుచో మహేశ్వ రుఁడు శ్రీరామా ఈసమయమున నీసంతోషమును మా తోఁగూడ ననుభవింప వచ్చియుండు మీతండ్రి దశరథుని దర్శనము సేయు మనుటయు రాముఁడట్లు చేసె. దశర థుఁడు రామునిఁ గౌఁగిలించుకొని తండ్రీ నీవియోగము వలన స్వర్గము నాకు సుఖంబీఁ జాలకున్నది. అని వెండి యు నీవనవాసకాలము గడిచె. నీమాట చెల్లె. రాజ్యప్ర

తృప్తిచెందినవాడవై తమ్ములతో దీర్ఘాయువు కమ్ము. అని దీవించిన రాముడు తండ్రీ నాయందు కోపంబునం గైకను, ఆమె కొడుకుతోడం ద్యజించితివి. ఆశాపమును మరల్పుము. అనిన దశరథుండు అట్లగుం గాక యని లక్ష్మణునిం జూచి నీవు భక్తితో సీతారాముల శుశ్రూషం గావించితివి. అని యాశీర్వదించి సీతంగని యిట్లనియె. వైదేహీ, రాముడు నన్నుం ద్యజించె నని వానియెడ నలుగుట నీకొప్పదు. నీహితంబును గోరి నీకు శుద్ధిగావింప నిట్లొనరించె. బిడ్డా, నీసుశీలమును స్థిరపఱుప నీవు చేసిన యీకార్యము దుస్సాధ్యము. నీవు చేసిన యీమహాకార్యము స్త్రీవర్గమున కంతకును గీర్తికరమైనది. అని దశరథుండు చనియె.

౨౩౧. అంత నింద్రుండు రామునిం జూచి వరంబడుగుము. నీమనస్సునం గోరునది యిచ్చెద ననవుడు రాముడు దేవేంద్రా! నాకై యుద్ధము చేసి చచ్చిన క్రోతులకు భల్లూకములకు మరలం బ్రాణమీయవే. వీరు సంచరించు స్థలములం దెల్ల ఫలంబులును మూలములును బుష్పములును విమలజలమును నిండియుండుం గాక. అని ప్రార్థించిన నింద్రుం డట్ల యగుంగాక యనియె. అంతం గ్రోతులు నెలుంగులును గాయంబులుమాని లేచె. సురలు రాముని నయోధ్యకుం జని రాజ్యాభిషిక్తుండవు కమ్మని పనిచి దివంబున కరిగిరి.

౨౩౨. మఱునాఁడు శ్రీరామచంద్రుఁడు అయోధ్య
కుం బయనమయ్యె. విభీషణునిం బిలిచి యుద్ధమున విక్ర
మంబునఁ బోరిన సైన్యమునకు బహుమతు లొసంగ నియ
మించి పుష్పకంబును రప్పించె. ఆదివ్య విమానము రావ
ణుఁడు తనసహోదరుఁడగు కుబేరునొద్దనుండి తెచ్చె.
అది స్వర్ణమయము. రత్నఖచితము. మధురస్వనఘంటా
జాలములతో రాజిల్లునది. పై యంతస్తును క్రింది యి
ల్లును వేదికలపై గృహములును గలిగి పర్వతముం బో
లె గొప్పదై యొప్పు. కామగమనముగల యీ దివ్య వి
మానమున రాముఁడు సీతాలక్ష్మణులు నెక్కిరి. విభీ
షణ సుగ్రీవులును వారి పరివారమును వెంట రాఁగోరి
వారు నెక్కిరి. ఇట్లు వాయు మార్గమునఁ బోవుచో రాముఁ
డు సీతను చూడుము. యుద్ధభూమియిది. ఇది సైనికులు
నేను సముద్రము దాఁటి విడిసిన రేవు. ఇది కిష్కింధ.
సుగ్రీవుని రాజధాని. అని చూపుచుఁ జనియె. సీతకోరిక పై
కిష్కింధయందు విమానమును నిలిపి వానరశ్రేష్ఠుల భా
ర్యలంగొని మరలఁ బ్రయాణమైరి. అటుపోవుచో సీతను
వెదకునపుడును, వనవాసకాలమందును విశేషకార్యము
లు జరిగిన స్థలములను రామచంద్రుఁడు సీతకుఁ జూపుచుఁ
బోయెను. ఇట్లు చని, లంకనుండి వెలువడిన యేనవదివసం

బున నయోధ్యను బొడగని విమానమును నిలిపి మునీంద్రు నాశ్రమంబు విడిసిరి.

233. భారద్వాజుని వలన నంతయుఁ గుశలం బని తెలిసి రాముఁడు హనుమంతునిబిలిచి నీవేగి నారాక గుహునకును భరతునకుఁ దెలుపుము. భరతుఁడీవార్తనువిని మోదమందునో ఖేదమందునో దీనిని జక్కఁగ నరయుము. చిరకాలము రాజ్య మనుభవించెఁగాన వానిమనస్సు మాఱియుండ నగు. భరతునకుఁ బ్రియంబేని రాజ్యము వాని యందె నిలుపందగు. అని పనిచినఁ బవనతయుఁడతిత్వరితగతిం జని యాశుభవార్త గుహున కెఱింగించిన గుహుఁడు హృదయమున నానందమందె. అంత మారుతి భరతునిజేర నేగె. అయోధ్యాపురంబునకు వెలిగఁ గ్రోసెడుదూరమున నాశ్రమమున నున్నవాని, వాడి వరుగై మునివృత్తినిదాల్చినవానిని, నన్నకు గుఱుతుగనుండు పాదుకల నెప్పుడు తనముం దునుచుకొని యుండువాని నమాత్యసైనికులతోఁ గూడియుండి లోకుల నెల్ల రక్షించువాని భరతునిజూచి హనుమంతుఁడు నమస్కరించి తటాలునఁ దనవార్త నెఱింగించెను. భరతుఁడు చిరకాలోపవాసముచే దుర్బలుఁడైయుండెఁ గాన నావార్తను విని హర్షమున మూర్ఛిల్లిపడియె. అంతన తెలిసి యిందువచ్చిన నీవు దేవుఁడవో, మానవుఁడవో యనుచు హర్షమున నన్నవృ

త్తాంతములఁ బరిపరివేఁడి తనయన్న నెప్పుడుచూతునో
యని పైఁబైఁ గోర్కెలనెఱపె. హనుమంతుఁడు జరగిన
వృత్తాంతమును దెలుప భరతుఁ డాకథామృతమును గ్రో
లిగ్రోలి రాముఁ డతిసమీపమున నున్నవాఁడనియు రేపు
వానిఁ జూడనగుననియు విన్నంతనె హా, చిరకాలము
నకు నాకోరిక యీడేరెనని యప్రయత్నముఁగ నఱచె.

### భరతుఁడు రాముని జూడఁ బయనమగుట.

౨౩౮. అంత రాజురాకకు సిద్ధము చేయ నియ
మించి భరతుఁడు భరద్వాజాశ్రమమునకుఁ బయనమ
య్యె. అప్పు డయోధ్యయం దెల్ల హర్షంబుచేఁ గలకల
ము పుట్టె. వేలకొలఁది దండుచేరి భరతుని వెంటవచ్చె.
కౌసల్యా సుమిత్రలును దక్కుంగల దశరథుని భార్యలు
నయోధ్య నుండి వచ్చిరి. భరతుఁడు పాదుకల వెంటఁ గొ
ని నడిచె. వారు చని యాకాశంబునఁ బుష్పకంబును గ
నిరి. కనిన వెనె శ్రీరాముఁడదె శ్రీరాముఁడని ఘోషలు పు
ట్టె. పెక్కేఁడు లెడ పడియున్న యన్నదమ్ములొండొ
రులఁ జూచి యానందించిరి. భరతుఁడు రాముని పాద
ములకు మ్రొక్కిన లేవనెత్తి రాముఁడు భరతు న
క్కునఁ జేర్చి కౌఁగిలించి పరస్పర కుశలం బడిగిరి. అంత
ట నలుగురన్నదమ్ములు సుగ్రీవు నతి ప్రియంబున గార

వించి నీవు మాకై దవవాఁడ వని పేర్కొనిరి. రాముఁడు కౌసల్యాదేవి పాదంబులకు మ్రొక్కి సుమిత్రా కైకల నట్ల మన్నించె. అంత భరతుఁడు పాదుకంబుల రామ పాదములకుఁ దొడిగి యిట్లనియె. నీవు నా స్వాధీనముం దుంచిన నీరాజ్యము మరల గ్రహింపుము. ఇదె యిచ్చితి. నీవు మరలి యయోధ్యకు వచ్చి రాజగుట నేను నేఁడు చూచుటం జేసి నాజన్మము కృతార్థమయ్యె. నామనోరథము నెఱవేఱె. నీకోశకోష్ఠాగార పురబలంబు లరయుము. నీయనుగ్రహముచే దీని నంతయుఁ బదంతలు గాఁ జేసితిని. అని భరతుఁడు తనమీఁది భారమును దీర్చుకొనె. రాజ్యమును విడుచుచో రాజ్యమును బొందిన వారలకంటె నెక్కుడుగ సంతోషించెను.

## శ్రీరామపట్టాభిషేకము.

౨౩౫. వెనువెంట నమ్మహోత్సవము మోదంబునఁ గదలి యయోధ్యం జేరం జనియె. రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు రాజవైభవంబుల రాజిల్లిరి. సీతయు వానరశ్రేష్ఠుల భార్యలును రత్నభూషణముల శోభిల్లిరి. ఎల్లరకు నెక్కుడై రాముఁడు లావణ్యమునఁ బ్రాలె. వానిం జూచి యెల్లరు హృదయోత్సాహ మందిరి. ఇట్లు మహోత్సాహమున నగరమును బ్రవేశించిరి. తొల్లి పదునాలుగేఁ

డుల నాఁడు నగరమునుండి రామునితో వెలువడిన పౌరశ్రేష్ఠు లనేకులు నేఁడు రామునితోఁ బురప్రవేశము చేసిరి. ఆదుఃఖ నిర్గమనం బెక్కడ? ఈశుభాగమనం బెక్కడ? అట్లు మహావైభవంబునఁ బురముఁ జేరిన మఱునాఁడు వసిష్ఠుఁడు రత్నమయసింహాసనమున సీతారాములఁ గూర్చుండఁజేసి రాముని రాజుగ నభిషేకించి వంశానుగతమగు రత్నఖచిత కిరీటమును రామచంద్రు శిరంబున నమర్చెను. దశరథ కుమారుఁ డగు రాముఁడు తన రాజ్యమును బొంది యయోధ్యరాజుగ నభిషేకింపఁ బడెనని సురలు పుష్పమాలిక లంపిరి. గంధర్వులు పాడిరి. అప్సరసలాడిరి. పుడమి పంటలనిండియుండె. ఎల్లరు సంతసించిరి.

౨౩౬. ఆయభిషేక మహోత్సవమున రాముఁడు నిజ సుందరికి నతులాభరణములనిచ్చె. అందు దివ్య ముక్తాహార మొక్కటి. సీత యాముక్తాహారమును మెడనుండి తీసి భావగర్భితముగ మగనిని వానరులంజూచె. రాముఁడు చిఱునవ్వునవ్వుచు భామినీ. సౌభాగ్యవతీ. ఎవ్వనికొసంగ ముదమయ్యెనో వానికీ ముత్తెములదండ నిమ్మనియె. సీత యంత హనుమంతునిదెసఁ దనచేయి సొప్పాగఁ జూఁచి నేనొంటరినుండి దుఃఖించుచుండ శ్రద్ధతో నాకడకు వీఁడు వచ్చెనని వానికా యమూల్యహారము నిచ్చె.

౨౩౭. అంత రాముఁడు లక్ష్మణుని యువరాజుగ నుండి తనతోఁగూడి రాజుగఁ గూర్చుండు మనిన వాఁడొల్లక నేను నీతోఁ గూడి రాజునై యేల నాకుం బ్రియంబు గాదు. నీకుఁ గేవల పరిచరుఁడనై యుండుటయే నాకుఁ బ్రియంబనియె. అంత భరతుని యావరాజ్యంబున కభిషేకించిరి. రాముఁడు పదునొకండు వేలేండ్లు రాజ్య మేలెం గావున.

౨౩౮. క. ఎలమియుఁ గలిమియు నెల్లెడ
నెలకొనె; జనమానసముల నెమ్మదనరె; భూ
తలమునఁ బతిసుత శోకా
ర్తులు లేరఁట ముదిమినిండ బ్రదుకుట జనముల్.

క. కఱవును జ్వరమును వానల
కొఱఁతయు హత్యలును నాఁచి కోలులు లే వె
త్తెఱఁగున వర్షాతపములు
తఱి తప్పక చెల్లుఁ జెల్లుఁ దద్దయుఁ బంటల్.

క. లేమియు రేపటి వగయు వి
రామముఁ బొరయనిభయంబుఁ గ్రమ్మెడు నెగులుల్
దా మొఱుఁగక లోకులు స్వ
ర్గామోదమున మన భూమి యానందించెన్.

౨౩౯. ప్రాచీన గ్రంథానుసరణిగ నీయుద్ధకాండాంతమున గ్రంథము పఠించు వారికిం గలుగు ఫలస్తుతి యుండుటం జేసి పూర్వమున వాల్మీకిమహర్షి చేసిన రామాయణమీకాండముతో ముగిసెనని యనేకుల మతము.

యుద్ధకాండము సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.



# ఉత్తర కాండము.



౨౮౦. వాయుత్తరకాండము ప్రసిద్ధమగు వాల్మీకికృత రామాయణమునందలిది కాదని యెంచెదరు. దానియందలి విషయములనుబట్టి కొందఱట్లనుకొనియుండవచ్చును. అనింద్రితులును శ్రేష్ఠాస్పదులును నగు సీతాలక్ష్మణులకుఁ దుదకువచ్చినగతులు బాహ్యదృష్టికి దుఃఖకరములుగఁ దోఁచవచ్చును. ఇట్లయ్యు నుత్తరకాండము మనకుఁ దెలియఁజేయఁదగిన విషయములతో నిండియున్నది. పూర్వకథయందలి కార్యగతులకు త్తరకాండమునఁ గారణంబులు తెలియుచున్నవి. ఇందు గహనమగు కర్మగతి పోవుమార్గము నిదర్శనముగఁ జూపఁబడియున్నది. కర్మముగాదే సర్వలోకాధారమగు భగవత్సంకల్పమును మనకు వ్యక్తముచేయుచున్నది. ఈయనాదియగు కర్మమంతట వ్యాపించియున్నది. దానినుండి యుత్తమోత్తముఁడగు నీశ్వరుఁడు మొదలధమాధమమగు కీటము పర్యంతము నెవ్వఁడియును దప్పించుకొనఁజాలరు.

౨౮౧. ఈకర్మ మెల్లెడలఁ జెల్లునదియును ముఖ్యాంశ మీ యుత్తరకాండమునందు బోధింపఁబడియున్నది.

దానికి లోఁబడనిది బ్రహ్మాండమున నేదియు లేదు. ఈగ్రంథమువలన దేవతలు మానవులు రాక్షసులు నసురులు నెల్లరొక్కరీతిగ దానికి లోఁబడుట తెల్లమగును. దానికి లోఁబడకుండు టెట్లగును? జగన్నిర్వాహ వ్యాపార మహాప్రవాహము దొకకల్పము వెంట మఱియొకకల్పమువచ్చి బ్రహ్మాండమును లోకములును బుట్టి పెరిగి లయించుచుండ నెచటచూచిన నీకర్మగతి వెల్లడియగుచుండు. ఎల్లరును దాని వశవర్తులై మెలఁగుచున్నారు. దానినెవ్వరును దప్పించుకొననోపరు. దానిని గడచ నెవ్వరికిని శక్యముగాదు. మఱికొన్ని యంశములతోడ నీయంశమును బోధింప విష్ణువు రాముఁడగును. బ్రహ్మాండమునకంతటికి విష్ణువుతో నెడఁబాయకయుండు లక్ష్మీదేవి సీతగను బ్రాకృతులై యీలోకమునకువచ్చి మనుష్యులవలె వర్తించిరి. వారిసంకల్పమే కర్మరూపముగఁ బరిణమింపఁబడియున్నదిగాదే. వారు కర్మస్వరూపులే గావున నందఱిలో వారే దానిని బాగుగ ననువర్తించుచుందురు. ఇట్లుండ దుర్గుణబీజములనునాఁటి యుగములకొలఁది వృద్ధినొందించుటకంటె నాబీజములు శీఘ్రముగ నశించునట్లు మానవులకు రాఁదగిన బాధల నన్నింటిని రానిచ్చి కర్మమంతయు ననుభవించి దానిని బూర్ణముగఁ దుదముట్టించు నట్టి మహానీయులుగాక మఱియెవరు సమర్థులగుదురు?

## రామున కగస్త్యుఁడు రావణవృత్తాంతమును జెప్పుట.

౨౮౨. ఉత్తరరామాయణకథ యెట్టిదనిన వినుండు. శ్రీరాముఁ డయోధ్యాపురిలో రాజ్యపరిపాలనము చేయుచుండ నగస్త్యాదిమునిసత్తము లనేకులువచ్చి రామా, రావణుని జయించితివి. అంతబలశాలియగుతండ్రిని మించిన యింద్రజిత్తును గెలుచుట దానికంటె నెక్కుడు. అని రామునితో సంతసంబునఁ బలికిరి. అంత రాముఁడు రావణునిశక్తులకుఁ గారణంబడిగిన నగస్త్యుం డిట్లనియె. తొల్లి ప్రజాపతిసుతుఁడగు పులస్త్యుండు తపస్సుచేయుచో నప్సరసలును నరకన్యకలును నచట నర్తనాది క్రీడల పలుపుటం జేసి వానితపస్సునకు విఘ్నంబగుచుండ నేనుం డుస్థలమున కతిసమీపమునకువచ్చిన కన్య వేఁకటియగును గాకయని శాసించెను. దాని నెఱుంగని యొకకన్య ముని పెట్టియున్న మేర మీఱివచ్చినంత దాని నెఱింగి, దాని తండ్రి పులస్త్యునిం జేరి తనకూఁతు భార్యగా గ్రహింపుమని ప్రార్థించెను. మునీశ్వరుండియ్యకొని దానిం బెండ్లియయ్యె. అదియుఁ దపస్సుచేయుచున్న పతికి వినయమున శుశ్రూష పలుచేయుచుండి మునియనుగ్రహంబున నుత్తముఁడగు పుత్త్రునిగనియె. అతఁడు విశ్రవసువను నామంబునొంది యధ్యయనపరుండును దపోనిరతుఁడయ్యెను. వానికి భర

ద్వాజముని తనయవలనఁ గుమారుండుపుట్టి వైశ్రవణుఁ
డనంబరఁగి మహాతపస్వియయ్యె. బ్రహ్మ వానికి వరంబి
చ్చెద నడుగుమనిన వైశ్రవణుండు ప్రజలభరించి రక్షించు
శక్తి నియ్యవేయని ప్రార్థించె. బ్రహ్మ వానిని నాలవలోక
పాలునిగఁ బ్రతిష్ఠించి ధనేశ్వరునిం జేసి పుష్పకవిమాన
మిచ్చె. వానికి నివాసంబుగఁ దొలుత విశ్వకర్మచే నిర్మి
పఁబడి యక్కాలమున విజనంబైయున్న లంకాపురి నిచ్చె.

౨౮౩. పెండియు విశ్రవసు వొక్కనాఁడగ్నిహోత్ర
ముచేయుచుండువేళ సుమాలియను రాక్షసరాజునకుఁ గు
మార్తె కైకసియనునది సంతానాభిలాషిణియై యాతని నిష్ఠ
కుం జెఱుపు సేసె. అంతవిశ్రవసుఁడు నీకుబిడ్డల నిచ్చెదఁగాని
నాయత్నంబుఁ జెఱచినందుచే నీపిల్లలలోఁ గనిష్ఠుఁడొ
క్కఁడే ధర్మనిష్ఠుఁడగు. తక్కినవారలు రాక్షసులయ్యెదరు.
అని చెప్పె. కైకసికి దశాననుఁడును, కుంభకర్ణుఁడును,
శూర్పణఖయు, ధర్మాత్ముఁడగు విభీషణుఁడును బుట్టిరి.
ఒక్కనాఁడు వైశ్రవణుఁడు విహరించుచుండఁ గైకసి
వానిని దశాననునకుం జూపి యిదె మీయన్నను జూచితే.
వానివిధంబున నీవు పాటుపడి యట్టి యాధిక్యమును
బొందుమాయని యాజ్ఞాపించె. అంత దశవదనుఁడు తన
యిద్దఱు తమ్ములతోఁగూడి తాపసవృత్తి నవలంబించె.
తపంబున నాహుతిగా దశాననుఁడు తన తలల నొక్కొక్కొ

క్కుటికఁ దొమ్మిదింటిని వ్రేల్చియు మిగిలిన యొక్కశిరంబు నఱుకనున్న బ్రహ్మ వారలకుఁ బ్రత్యక్షమై వరంబిచ్చెద ననుగుమనియె. దశాననుఁ డమరత్వమును గోరెను. దాని నియ్య శక్యముగాదనిన వాఁడు విహగోరగ సురయక్షదైత్య దానవ రాక్షసులచేఁ జావకయుండఁగోరె. తదితరుల నరకుగొనఁడయ్యె. ఆవరంబిచ్చి వెండియువాఁడు గోరిన రూపములఁదాల్ప శక్తినిచ్చి వాఁడగ్నిలో వ్రేల్చినతలలు మగిడి వానికొసంగె. విభీషణుని వరంబడుగు మనుడు వాఁడు నామనము ధర్మంబున నిశ్చలమై దృఢముగ నిలుచుఁగాకయనిన బ్రహ్మయు నట్లగుఁగాక యని యతఁడడుగకుండినను వానికమరత్వమిచ్చెను. అంతఁ గుంభకర్ణుని వరంబడుగుమనిన సరస్వతీదేవి వానివాక్కునావేశించి యనేకసంవత్సరములు నిదురింపఁ గోరెదనని వానిచే నడిగించెను. బ్రహ్మ వాని కట్లు వరంబిచ్చెను. నాపూర్వయుద్ధకాండమునఁ జెప్పినట్లు కుంభకర్ణుఁడాశ్చర్యముగ నిదురించె.

## కుబేరునోడించి రావణుఁడు పుష్పకమునుగొనుట.

౨౨౨. వైశ్రవణుఁడు లంకయందుఁ జేరఁబో నది విజనంబైయుండెఁగాని యంతకుము న్నందు రాక్షసు లుండిరి. దశాననుఁడు దనమాతామహుఁడగు సుమాలి ప్రేరణచే లంకను దనకిమ్మని వైశ్రవణు నడిగిన నుదారచిత్తుఁ

మునుండి యీడ్వఁ జూచిన మహాదేవుం డవలీలగాఁ దన కాలి బొటనవ్రేల నణఁగఁద్రొక్కె. వాని బాహువులందుఁ జిక్కిన వాఁ డఱచుచుఁ బడియెట్టకేలకు నీలకంఠునకు విధేయుఁడైన హరుఁడు వానిని విడిచి వాఁడు రావము చేసెఁ గావున రావణుఁ డను పేరిచ్చి పంపె.

౨౮౫. ఇట్లు గర్వభంగ మొందియు భయము లేక భూమిని జీకాకు పఱచుచు నొక్కనాఁడు హిమవంతంబున కుశజని యం దతిసౌందర్యమున నొప్పు తపోనిష్ఠయగు కన్యకను జూచెను. ఆమె దా విష్ణువున కర్పింపఁబడితి నని యెఱింగించినను వినక దుర్బుద్ధితో దానిం బట్టిన నామె బలవంతముగ విడిపించుకొని చితిఁ బేర్చి నేను మాతృగర్భమ్మునఁ బుట్టక పుడమికి మరల వచ్చి నీకు వధం బేఁ గూర్చెద నని శపథంబు చేసి చితి కగ్గిఁ బెట్టి దానిపై ముడిసె. కృతయుగంబు నట్లు జరగె. ఆ కన్యయే త్రేతాయుగమున జనకుండు పొలము దున్నుచుండ నాఁగటిచాలున సీతయై పుట్టె.

౨౮౬. ఇట్లు రావణుఁడు జయంబులు గొనుచు భూలోకంబు నందలి రాజుల నందఱఁ దనతోఁ బోరాడుఁ డటు గాదేని పరాజితుల మని యంగీకరింపుఁ డని నిర్బంధించుచుండె. అనేకులు వానికి విధేయులైరి. అయోధ్యాధిపతి యిక్ష్వాకు కుల సంభవుఁ డనరణ్యుఁడు పోరి రావణునిచే హతుఁడై పడి మహాత్ముఁడగు నిక్ష్వాకు వంశమున

దశరథ నందనుఁడగు రాముఁడను నొకఁడుపుట్టి నీప్రా
ణంబులఁ గొనునని చెప్పి మృతుండయ్యె. ఇట్లు రావ
ణాసురుఁడు దానే చేసికొన్న దుష్కార్యములచేఁ దన
మృతికి వి త్తనము వేసి ఫలమును దా ననుభవింప వలసి
వచ్చెను.

—: యమ రావణుల యుద్ధము. :—

౨౮౭. రావణుండెందేని తిరుగువాఁడొక్కచో ము
నిపుంగవుని నారదునిం గనిన నతం డిట్లనియె. ఓ రావణా
ముందె కడునిడుములకుఁ బాల్పడియుండు మానవుల నీవు
గాఱింపకుము. యముఁ డెల్లర నిగ్రహించు. నీవు యముని ని
గ్రహింపుము. అనినఁ బ్రహృష్ట మానసుండై రావణుండు ద
క్షిణ దిక్కునకుంజని తన్నెదిర్చిన యమభటులఁ దును
ముచుఁ జనుచుండ యముండు దరదనొక్క మృత్యురూప
మునఁ గాలదండ ధరుండై వానిమొగమునకు వచ్చె. వానిం
జూచి రావణుని పరివారము పరుగెత్తి వాని నొంటరిగ వి
డిచి చనియె. అట్లయ్యు రావణుండు వెనుదీయక సర్వసం
హారకుండగు కాలునితోఁ బోరెను. ఇట్లేడు అహోరా
త్రములు పోరి తుదకు యముండు వానిం జంపఁ గాలదం
డమెత్తిన బ్రహ్మ ప్రత్యక్షమై యముని వారించి ప్రాణ
భయము లేకుండ నేను రావణునకు వరమిచ్చితి. నావచ
నముల బొంకు చేయకుము. నీకాలదండమును నీవ స్వ

బడి నెత్తుటఁ దోఁగె. అంత వానిం గని బలి యిట్లనియె. ఇది నా పెద్దలలోఁ జేరిన హిరణ్యకశిపుని కుండలము. విష్ణువు నరసింహుండై వాని వధించె. ఇఁక నీవే యోచింపుము. నీచేఁ గదలింపరాని కుండలమును ధరించిన దైత్యుని జయించిన హరిని నీ విట్లు మార్కొనియెదవు. ద్వారమున నీవు చూచినవాఁడు విష్ణువే. హరి నారాయణుఁడు లోకరక్షకుఁడు. అనిన విని రావణుఁడు హరిం జూడ ద్వారమునకుం బోయెను బ్రహ్మకైన హరి వానిం జంపఁ గోరక యదృశ్యుండయ్యె. రావణుఁడు సుఖంబున నేగె. ఇట్లనేక సాహస కార్యములు రావణుం డొనరించె. వాని మీఁదుం దీరని యనుమానోఁ జనుప్పుఁడు. ముఖ్యముగ నందొక్కచో వానికి వినోదమ్మా సీతకుం గోడయ్యె. దానివినుండు. అట నాఁడు సుందరీమణింగని దానిం బొందఁగోరిన నాయబల నన్నుఁ బొందనుమ్ము. నేనియున్న కొమారునకు భార్యనగుట దాన నమ్ము ముట్టిననీ దానిం బొందెను. అంత నైశ్రవణుని సుతుం డొగి నన్నుఁ గోరిన వడఁతిని జెఱచితి వేని నీవు స్త్రీసంగమము నెఱుఁగ వని శాపంబిచ్చెను. ఆశాపంబు సీత కనుకూలమాయెను.

—: రావణుఁ డింద్రునిఁ జెఱగొని పోవుట. :—

౧౯౦. రావణుఁడు సురలపై దండెత్తి చనుచోఁ దన పుత్త్రుని మేఘనాదుని దోడ్కొని యేగెను. అప్పుడు

రాక్షసులకును దేవసైన్యమునకును మహారణంబు ఘోరంబుగఁ జెల్లెను. రాక్షసులు పరాజయంబునందు సమయమువచ్చిన మేఘనాదుఁడు రాక్షసులఁ జేరఁగూర్చి మాయాబలంబున నంధకారము చేఁగప్పి సురల యుక్కడంచిన దైత్యాధిపుఁడగు పులోముఁ డింద్రసుతుని కొనిచనియె. అంత నింద్రుఁడు వెలువడి రావణునిపైఁ గవిసిన మేఘనాదుఁడు వాని మార్కొనియె. ఇంద్రుఁ డతనిదెసఁ దిరిగిన వాఁడదృశ్యుఁడై పోరి సురపతినలయించి మాయాబలంబున వానిం గట్టి లంకకుం జెఱఁగొని పోయె. వేలుపులంత బ్రహ్మను ముందిడుకొని లంకకువచ్చిరి. పితామహుండు మేఘనాదునకు ఇంద్రజిత్తను పేరొసంగి యింద్రునకు మాఱేమిగోరెదవనిన నతఁడమరత్వం బడిగె. అదిచేకూరదు. వేఱొండువరమును గోరుమనిన నింద్రజిత్తిట్లనియె. యుద్ధమునకు మున్ను నేనగ్నిని వేల్చిన నందుండి తేరును గుఱ్ఱంబులును వెడలిన నాయరదంబుపై నేను నిలిచినచో నమరత్వం బుండుఁగాక. హోమంబు ముగింపక కయ్యంబునకుఁ గడంగిన మృతిం బొరయుదుంగాక యని వరంబడిగె. ఇట్లు మేఘనాదుఁడు తనమరణంబునకుఁ దానె విత్తనము నాటుకొనియె. ఇట్లోడి చెఱఁగొనఁబడిన కారణంబున నింద్రుండును గౌతమసతియగు నహల్యపైఁ జేసిన దోషంబునుండి ముక్తుండయ్యె.

౨౮౯. ఇవి మొదలగు కారణములనుండి రామాయణమందుఁ జెప్పఁబడిన కార్యములు ఫలరూపముగాఁ బరిణమించినవి. ఆ గ్రంథమందలి తక్కుంగల కథలను జెప్పెద.

—రాముఁడు చారులవలనఁ బౌరవార్తల నాలించుట.—

౨౯౦. ఒక్కనాఁడు సాయంసమయమున సంధ్యాదిదేవకార్యములు జరిగినపిమ్మట సీతతో స్త్రీప్రియం బెయ్యది నేఁ గావించెద నని యడిగిన సీత గంగాతీరమున వసించు ఋషులఁ జూడ నతికుతూహలము గలదని చెప్పె. అంత రాముఁ డెల్లి యేర్పాటుచేసెద నని రాముఁ డచటనుండి తన చెలికాండ్రు తమలోఁ దా మిష్టాగోష్ఠిగ మాటలాడుచుండ నచ్చటికరిగె. అందు మాటాడుచు నగరంబుల దేశంబుల జను లాడుకొనువార్త లేమి? నాతమ్ములంగూర్చి భార్యనుగూర్చి కైకనుగూర్చి యేమనియెదరు? అనిన భద్రుఁడు జనులు మంచివార్త లనేకము లాడెదరు. రావణుని వధనుగూర్చి యెంతయు నసుకొందురు. అని యనుచుండ భద్రుఁడు చెప్పురీతిని సంశయించి బాగుగఁ బరీశీలించి రాముఁ డిట్లనియడిగె. శుభము లేని యశుభము లేని జనులమాట లన్నింటిని దెలుపుము. వానినెఱింగి జనులకయిష్టములగునవి సవరింపనగు. అనిన జనులు కలిసినచో వారు మాటిమాటికాడు నప్రియంబులం జెప్పెద. నీచేసిన సేతుబంధనంబును, రావణవధయు నద్భుతకార్యము

అని హాని జెందకుండ రావణునింట నుండిన సీతను నీవు గ్ర
హింపు మెట్లని యూరకుండెను. సీత రావణుని తొడపైనె
క్కెను. నాడు రాక్షస స్త్రీలకాపున నానెను నని చె.
అట్లయ్యెనేని మేమును దమభార్యల చెడునడతల సహింప
వలయు. 'యథా హి కురుతే రాజా ప్రజాస్తమనువర్తతే'
అని యందురు. అనిన మిక్కిలి నొచ్చి రఘునందనుం డెల్ల
రకు నిది నిక్కంబే యని యడుగ నొక్కరొక్కరు దైన్యము
తోఁ బ్రజ లిట్లాడుదు రనిరి.

౩౫౯. రామచంద్రుఁ డంతఁ బ్రణిధుల వీడుకొలిపి
తమ్ములఁ బిల్పించి వారిని కౌఁగిలించి కన్నులనీరునిండ
మీరే నా సర్వస్వము. మీరే నా ప్రాణమని పలికి
కూరుచుండ నియమించి లోకాపవాదముల వినిపించి యి
ట్లనియె. ఏనెట్లు సీతను మన్నించుచుంటినో జనులును రాము
నిం ద్యచరిత్రలగు భార్యల మన్నింపవలసె నను న్యాయ
మును వాదించెదరు. ఇది లోకమున సుశీలమునకు భంగ
కరముగదా. నేఁడొల్లి లంకయందు వెనుదీసినదియు సీత
యగ్నిప్రవేశము చేసి దోసము లేదని నిరూపించినదియును
మీరెఱుంగుదురు. సీత శుద్ధయనియు, నిష్కళంకయని
యు నా యంతరాత్మయెఱుంగు. అట్లయ్యు మానము
సుఖంబునకంటెఁ బ్రాణమునకంటెను బ్రియతరము.

కావున నాభార్యను విడువవలయు. లక్ష్మణా! సీతను
వాల్మీకియాశ్రమమునకుఁ గొనిపొమ్ము. సీత యిచ్చటికిఁ
బోఁగోరినది. సీత యందయుండుఁగాక. అనుడు లక్ష్మణుండు
మాఱాడఁబోయిన సైఁగతోఁ దత్కాలున వారించి యే
మియుఁ జెప్పకుము. నన్నేమడుగకుము. సీతనుగొని పొ
మ్ము. అని యాజ్ఞాపించె. ఇట్లు రామచంద్రుఁడు దాఁ
జేసిన త్యాగములలో గొప్పదగు త్యాగముచేసెను.

౨౫౨. రామచంద్రుని కార్యముల మొండుగఁ గొంద
ఱాక్షేపించి దూఱుదురు. అపనిందలుచేయువారి దుర్బు
ద్ధికినోడి భార్యను దిగనాడుట తగదని పెక్కండ్రు
రామునిపై నిందమోపుదురు. రాముఁడు భార్యను నిర్దో
షియని నిరూపించి సంరక్షించుటకుఁగాఁ బడినపాటుల
వలన రామునకామెయందుఁగల గాఢానురాగము విశద
మగుచున్నది. ఐనను సీతకుఁ దానెట్లు భర్తయో యట్లు
ప్రజలకుఁ బ్రభువు. కావునఁ బ్రజాపాలనమునఁ దాను
జరపఁదగు ధర్మము ధర్మములన్నింటిలో మొదటిది.
ఆధర్మములు భార్యాభర్తల కిరువురకును సమానము.
వారు రాజునురాణియు నగుటచే వారు నడచురీతిని లో
కులు ననువర్తింపఁగా లోకమందు సుశీలమునకు వృద్ధి
యు హానియుఁగలుగు. వారు కూడియుండిరేని వారి

మానమునకుఁ గళంక మేమాత్రమైనను రాకతీరదు. వారినిజూచి స్త్రీలు సన్మార్గమును దప్పుటకెడమిచ్చును. కావున ధర్మమును గాపాడుట శ్రేష్ఠమని చూపుటకు వారు వేఱుగనుండుటకంటె నెక్కుడగు నిదర్శనమును వారేమిచూపఁగలరు? ఇట్లు రామచంద్రుఁడు ధర్మచింత చేసి నిశ్చయించెను. రాముఁడును దాను నొక్కటియై యుండుటంబట్టి సీతయు నట్లె నిశ్చయించెను. రాముఁడు సీతను ద్యాగముచేసెను. అది రామునకుంబోలె సీతకును విషప్రాయమయ్యు సీతయు నొడంబడి తానును రాముని తోసరిగ త్యాగముచేసెను. అదియెట్లనిన. లక్ష్మణుండు సీతను వాల్మీకియాశ్రమంబునకుం గొనిపోవఁ దనకిచ్చిన యాజ్ఞను గద్గదస్వరంబున నుడివిన సీత పలికినపలుకులను వినుఁడీ శిష్యులారా! సహజముగ దిగ్భ్రమముచెంది దుఃఖముతో మొట్టమొదట కొన్నిమాటలాడెను. తరువాత లక్ష్మణునితో నిట్లనియె. ధర్మాత్ముఁడగు రామున కిట్లనుము. "రాఘవా, సీత సుశీలయనియు, నీయందు నిశ్చలమగు భక్తిగలదియనియు నీహితము సీతయుఁ గోరునదియనియు నీకుందెలియును. అపకీర్తికి భయమంది నీవిట్లుచేసితివని నేనును బాగుగ నెఱుఁగుదును. నీవేనాకుఁ బరమశరణ్యుఁడవు. కావున నీకువచ్చు నపవాదమును దూషణయుఁ దొలఁగించుట నాకు ధర్మము. అని లక్ష్మ

ణుఁడు వెడలిపోయినంత మానవులందఱుంబోలి సీత దుఃఖంబునఁ గుందుచు నేలం గూలె.

## సీత వాల్మీకియాశ్రమమున నుండుట.

౨౫౩. మునిపుత్త్రులాయార్తనాదముల విని వాల్మీకి నామెనుగావ రమ్మనిపిలిచిరి. వేగిరముగ మునీశ్వరుఁడువచ్చి మధురవాక్యముల సీత నోదార్చి నాయాశ్రమము నియిల్లుగభావింపుము. అని పలికి తనతోనుండు తన శిష్యురాండ్రగు యోగినులచెంతకుం గొనిపోయి సీతను స్నేహగౌరవములతోఁ గాపాడుఁడని నియమించెను అచట నివసించి సీత యిద్దఱుకొడుకులంగనియె. వారలకు వాల్మీకి కుశలవు లను పేరు లిడియె. వారును మునిసంఘమున సుగుణోన్నతిఁగాంచి యౌవనమునఁ గ్రాలిరి.

౨౫౪. లక్ష్మణుఁడు తాఁజేసిన దుఃఖకార్యమునకు సంతాపమున మఁగిడి చనుచోఁ దనదుఃఖమును గడుఁగూర్చు సుమంత్రునితోఁ జెప్పిన నాఁ డిట్లనియె. పూర్వమే దుర్వాసుఁడు దశరథునితో రాముఁడుం భార్యను భ్రాతలను విడనాడు ననియె. దశరథుఁడు దానిని రహస్యముగఁ గాపాడుమని నాతో నుడివెను. అదివివరించెదను. ఒక్కనాఁడు దుర్వాస మునిని

మకొఱకుఁ దుర్వాసుఁడా యి నా పుత్త్రులకు రాఁగలఫల
ములఁ దెలుపవేయని యడిగిన నాఋషి త్రొల్లి దేవాసుర
సంగ్రామమున నసురులు భృగుపత్ని శరణముఁ జొచ్చిననా
మె వారలఁ గాచుచుండె. దానికి విష్ణువు గినిసి చక్రంబున
దాని శిరస్సును దెగవేసె. అంతభృగువు నీవు మానిసివై
కొన్నేండ్లు భార్యావియోగము నొందుమని శా
పమిచ్చె. విష్ణువు రావణుని వధించి శాపం బనుభవించెదఁ
గని యాశాపము స్వీకరించి యుండెను. విష్ణువే రాము
డాయెను కాని తాను బహువేలేండ్లు పాలించి సీతవ
లనఁ గాంచిన యిరువురు బుత్త్రులను నయోధ్యకుఁ బట్టము
గట్టును. అని దుర్వాసుఁడు పలికె. అనిన సుమంత్రుని వచ
నములకు మిగుల సంతసించి సౌమిత్రి యయోధ్యఁ జేరి
రాముఁడు దుఃఖసాగరమున మునిఁగియున్నంగని దుఃఖ
ముమాని లెమ్ము. రాజధర్మమును జరపుము. అట్లుకా
నిచో లోకహితార్థము సీతంద్యజించితి వది వ్యర్థగాదే.
అని బోధించెను.

═ శత్రుఘ్నుఁడు లవణాసురుం జంపుట. ═

౨౬౫. పిదపఁ గొద్దికాలమునకు శత్రుఘ్నుని మధు
రాజ్యమునకుఁ బట్టము గట్టెను. ఆదేశమున లవణుండను
నసుర ప్రజలఁ బీడించుచుండెను. వానితో యుద్ధముచేసి
రాజ్యమాక్రమింప శత్రుఘ్నుఁడు దండుతో వెడలెను.

మార్గమునఁ దన సేనను ముందుపంపి తా వాల్మీకి యాశ్రమంబున వసించెను. వాఁడచటనుండ సీత కిరువురుపుత్త్రులు పుట్టిరి. అందుండి యేడు దినములునడిచి శత్రుఘ్నుఁడు మధునగరమును జేరెను. అప్పుడు మునివరులు శత్రుఘ్నున కిట్లు హెచ్చరిక చేసిరి. శివుఁడొక్కశూలం బితని తండ్రి కిచ్చె. తండ్రివలన నీతండు పొందఁబడసె. ఆశూలంబు ప్రయోగించినచో నది చంపకమానదు. అది లేకుండినఁగాని వానిఁజంప శక్యముకాదు. వానిచేతిలోనదియుండునందాఁక వానినిజయింప నెవరికి నలవిగాదు. వాఁ డాశూలంబునఁ బగతుర భస్మముచేయును. అనినవిని ఆహారమునకై ప్రభాతంబున లవణుఁడు పురినుండి వెడలిన శత్రుఘ్నుఁడు వాఁడు పురమునకు మగులఁజేరకమున్న వానినడ్డగించి యుద్ధమునుగోరెను. లవణుఁడు తనయాయుధములఁ దేఁగోరెదనన్న శత్రుఘ్నుఁడు వానినప్పుడె పోరుమని నిర్బంధించె. వారిద్దఱు పోరిన శత్రుఘ్నుఁడు పడియు లవణుండు నగరమును జొచ్చుటకు మున్నులేచి వానిం దాఁకి విష్ణు నిర్మితమగు దివ్యశరంబున వానింజంపె. అంత శత్రుఘ్నుఁడు మధునగరమున నిలిచి చక్కఁగఁబాలించెను. అట్లు పండ్రెండు వత్సరములు గడిచిన నన్నను రామునిం జూచు కుతూహలంబునఁ బ్రయాణమాయెను.

౨౫౬. ఏడుదినంబు లరిగి వాల్మీకియాశ్రమంబును బ్రవేశించె. ఆ మునిశ్రేష్ఠుండు శత్రుఘ్నున కతిథి పూజలు గావించి గారవించెను. నాఁటిరేయి భోజనంబగుడు సంగీతముతోడ రామచరిత్రంబును గానము చేయఁబడియె. శత్రుఘ్నుఁడు పరమానందమున మునిఁగియు సంకోచమున మునిపుంగవు నేమియు నడుగకుండె. మఱునాఁడు తరలి యయోధ్యంజేరి నేనీతోనుండెదనని రామునిం బ్రార్థించిన రాముఁ డంగీకరింపక సప్తరాత్రంబులుండి నీ రాజ్యమ్మునకు మగిడి పొమ్మనుఁడు శత్రుఘ్నుఁడు దీనుఁడై యానతికీతి మరలి మధునగరమునకుం బోయెను.

## రాముఁ డశ్వమేధయాగమును జేయుట.

౨౫౭. కొంతకాలము పిదప రామచంద్రుఁడు అశ్వమేధయాగము సేయ నిశ్చయించిన నయ్యజ్ఞమునకు ననేక మునులతోడఁగూడి వాల్మీకివచ్చెను. వారిశిష్యులలో రాజవైఖరి నొప్పియు మునివేషములతో నిద్దఱు కుమారు లుండిరి. ఆకుమారులంగని వాల్మీకి మీరు నేనురచించిన శ్రీరామచంద్రుని చరిత్రమగు రామాయణమును నేనేర్పినవిధమున గానముచేయుఁడు. ధనమున కాశపడకుఁడు. ఎల్లచోటుల దానిని బాడనగు. రాజుకోఁన భయపడక వారిమ్రోలఁ బాడుఁడు. అని నియమించె. అట్లుకుశల

వులు పోయి పాడుచుండిరి. రాముఁడు వారిపాటలు విని దానినంతయు వినఁగోరి మహాసభం జేర్చి యాబాలురఁ బాడమనియె. వార లిరువదిసర్గలఁ బఠించిన నెల్లరుల్లసిల్లిరి. వీరలిద్దర రత్యద్భుతముగ రాముని పోలిక నున్నారు. మునివేషమున నుండుటయే రామునకు వీరికిని భేదము. అని వారొండొరులతోఁ బ్రజ లనుకొనుచుండిరి. రాముఁ డప్పుడు లక్ష్మణా వీరికిఁ బదునెనిమిదివేల సువర్ణంబు లిమ్మనినఁ గుశలవులు మేమువనవాసులము. సువర్ణముతో మేమేమి చేయఁగలము. అనిన నరపతి విస్మయము నొంది యీకావ్యము నెవ్వరు చేసిరని యడిగిన బాలురు వాల్మీకి యీగ్రంథమును జేసెను. అమ్మహర్షి దర్శనమునకు వచ్చితివేని దానినంతయు విననగునని చెప్పిరి.

౨౫౦. ఇట్లు రామాయణకథను వినుచుండఁ బెక్కు దినములు గడచెను. ఎట్టకేలకుఁ గమనీయ తేజోవంతులగు నా గాయకులు వైదేహీపుత్త్రులని రామచంద్రుఁడు విని సీత వనవాసంబున నిష్కళంకయై యుండెనేని నియమమునుమతి మోయి వచ్చి బహిరంగముగఁ దన నిష్కల్మషత్వమును గుఱించి శపథముచేయునగు నని వాల్మీకిమునికిఁ జెప్పిపంపిన నా ఋషి యంగీకరించెను. అంత మహాసభ చేరిన వారి నడుమకు వాల్మీకియును, వారివెంట సీతయు వచ్చిరి. సీత కన్నీళ్లు చం

దమున మాహాత్మ్యమును సొంపును గలిగియుఁ గృశించి దుఃఖాకులనైయుండెను. వాల్మీకి తన తపస్సు నొడ్డి గంభీర వచనంబుల జానకి నిష్కళంక యనియు, గంభీరులగు వీరు కుశలవులు నీకుమారులనియుఁ బ్రమాణమ్ముగఁ బలికిని రాముఁ డిట్లని పల్కెను. నీవచనములు నాకుం బ్రమాణములు. నే వేఱు ప్రమాణమును గోరను. కాని జానకి యీసభయెదుట తాను పరిశుద్ధురాలనని తానే పల్కనేని నెంతయుఁ దనియుదు. అనుఁడు వైకుంఠపు ముద్దుల రాణి పాపినుల యెదుటఁ దన సుశీలమును గూర్చి ప్రమాణముచేయ నంగీకరించె. బ్రహ్మను ముందిడుకొని దేవతలందఱు నలుదిక్కులనుండి వచ్చిరి. దేవతలను జూచి రాఘవుం డిట్లనియె. "మునిశ్రేష్ఠా! మహాత్ములగు ఋషివాక్యంబుల కల్మషంబులు. కావున నీవచనంబులనె మైథిలి శుద్ధచారిత్ర యని నేనెంతును. కాని యిచ్చటి కెల్లరు సీత మాటయిచ్చునని చూడవచ్చిరి. కావున వారి యెదుటఁ దాను సుశీలయని నిదర్శనముగఁ జూపిన నాకెంతయుఁ బ్రియంబయ్యెడు."

### సీతను భూదేవి తోడ్కొనిపోవుట.

౨౭౯. అనిన జనకతనూజ సీత సురనరులు విన నిట్లు పలికెను. ఆపలుకులు మృదువులై విస్ఫుటధ్వనితో

నామహాసభయందు ప్రమోగె. తనపై నపవాదమును మోపిన వారియెడ నపారమగు కనికరంబునఁ బరితపించుచు నీక భూమిపై నుండనొల్ల నను నిశ్చయమును జూపె. * "నేను రామేతరు నెవరిని నామనస్సునం దెన్నఁడును దలంపను. దానిశీల్యబలమున వసుంధరాదేవి నాకెడ మిచ్చుఁగాక. నేను నిత్యము మనోవాక్కాయ కర్మముల రాముని మేలు ప్రార్థించితి. ఆకారణమున వసుంధరాదేవి నాకెడమిచ్చుఁగాక."

౨౬౧. అని ప్రార్థించిన నేలచీలి భూదేవి దివ్యసింహాసనమునఁ గూరుచుండి వచ్చి చేతులు సాఁచి సీతను జేరువకుఁ దీసికొని తనసింహాసనమునఁ గూరుచుండఁజేసె. బళిరా! ఎంత బాగుగఁ జేసితివి సీతాయని కొనియాడుచు వేలుపులు సీతపైఁ బూలవానఁ గురిసిరి. ఆరత్నఖచిత సింహాసనము పుష్పములతోనిండి భూమిలోనికి దిగెను. ధరణీజాతయగు సీత దాఁ బుట్టినచోటఁ బ్రవేశితమయ్యె.

౨౬౨. సీత యిట్లు పోవుచుండ రామచంద్రుఁడు పలుకకుండెను. పిమ్మట రాముని చక్కఁగఁ గన్నను దొరగి

* రామస్వామిపదాంబుజంబు లవి నారాధ్యంబు లేనిక్ సదా
రామాఖ్యన్ జరియింతు నేనిఁ దగు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలన్
రాముం డప్పని దాన నోటయి యాథార్థ్యంబు చేని నాశ్లి గదా
భూమీ యీ రయిడఁ ద్రోవఁ జూపి ననుఁ గొంపోవమ్మ నీలోనికిన్.

పాకె. పునస్సమాగమము కలుగుటజే సీత విడిచిపోయె. ఇఁకఁ బుడమిపై సీత సుందరాకారము చూచు నయనోత్సవము రానేరదు. ఓ దేవీ! నాసీతను నాకిమ్ము. అనుచుఁ దట్టితుదకు నాకు సీతను మరలఁ గొనితెమ్మ యని కూయిడె. ఆకూయి సీతను జేరదయ్యె. సీత భూమియందలి శబ్దములు విన రాని స్థానమును జేరియుండె. అది యాశబ్దముల కతీతము. శాంతిస్వరూపము. అంత బ్రహ్మ యిట్లనియె. ఓ రామా, నీవు సంతాపముఁ బొందఁ దగదు. విష్ణువువలనఁ బుట్టితివని మరల స్మరింపుము. సీత స్వభావముగ సిద్ధ విశుద్ధశీలయనియు నెప్పుడు నీయనుచారిణియనియు నెఱుంగుము. సీతను మరల స్వర్గంబునఁ గూడెదు. అనిన రాముఁడు ప్రసాదము సేసి సీతకై విలపించుచు రాతిరి పుచ్చె.

౨౬౨. అదిమొదలు మనోవ్యథతో రాముఁడు రాజ్యమును బాలించెను. పునర్వివాహ మొల్లఁడు. కనక విగ్రహ మొకదానిని నగరున నిలిపి నిత్యనైమిత్తిక విధులందు దానిని సీతాస్థానమున నుంచుచుండె.

౨౬౩. రాముఁడు భూమిని విడుచు సమయ మాసన్నమగుడుఁ దనవంశమున ముందు జరగు పనులకు నేర్పాటులు చేసెను. భరతలక్ష్మణ కుమారులను జేరువ నున్న రాజ్యముల నునిచె. ఈయేర్పాటులు చేయుచుండఁ

గాలపురుషుఁడు తాపస రూపమున వచ్చి రామునితో నే
కాంతమున సంభాషింప వేఁడి వెండియుఁ దమపలుకు చో
వడును వచ్చు వానిని వధింపవలయునని ప్రార్థించె. అం
దులకు రాముఁ డొడంబడి లక్ష్మణునిం గావలియుంచె.
అంతఁ గాలపురుషుఁడు రామునితో నీవు విష్ణుమూర్తివి.
భూలోకమున నీవుండవలసిన కాలము గడచినది. ఇఁక భువి
నుండిన నుండుము. స్వస్థానమునకు వచ్చిన రమ్ము. అనిన
రాముఁడు చిఱునవ్వుతో నేనును దానినే తలంచుచుంటిని.
నీవునువచ్చితివి. నా స్వస్థానమున కరుగవలఁతు ననియె.

లక్ష్మణుఁడు మృతినొందుట.

౨౬౮. ఇట్లు సంభాషించుచుండ దుర్వాసుండు
వచ్చి రామునిం జూడవలయు ననిన లక్ష్మణుం డయ్యా,
రాజు కార్యాంతరమున నుండు వాఁడు. నిలుమవే యని
వేఁడిన కోపముతో దుర్వాసుఁడు నీ పిపుణంబున నేగి
రామునకు నా రాక నెఱింగింపవేని నిన్ను నీతోఁబుట్టువుల
ను నీవంశమును రాజ్యము నంతయు శపింతు ననియె. సౌ
మిత్రి తనలో నెల్లర చేటు పాటిల్లుటకంటె నా యొకని
చావుమేలనుకొని రాముని కడ కేగి మునిరాక నెఱింగించె
ను. రాముఁడు మునివరునకు సత్కారము చేసియుఁ గాలున
కిచ్చినమాటను స్మరించి దుఃఖించెను. పిమ్మట లక్ష్మణుం
డు రామునిగని కాలుని కిచ్చిన మాటను స్మరించి నిమా

టను జరపవేయనిన రాముఁడు సభంగూర్చి వారలకావిష
యము నెఱింగించెను. సభలో వసిష్ఠుఁడు రామునకిట్లనియె.
మాటనుబొంకు సేయరాదు. ప్రతిజ్ఞ చెడిన ధర్మము నశించు.
ధర్మముపోయిన లోకములు నశించు. త్రిలోకముల క్షేమ
మునుజూచి లక్ష్మణు నెడఁబాటున కోర్చి లోకములరక్షిం
పుము. అనిన నందఱు దాని కంగీకరించిరి. అంత రామచం
ద్రుఁడు ప్రియతముఁడగు లక్ష్మణునకిట్లనియె. లక్ష్మణా!
విరోధముగ నడుపఁ బోలదు. కావున నిన్నుఁ ద్యాగము
చేసెదను. సాధువులకుఁ ద్యాగము వధయు నొక్కరూ
పయగు. అని శాసించిన లక్ష్మణుండు మరలి యయోధ్య
చెంతనుండు సరయువు తీరంబున కరిగి తపంబొనరించి త
నువుఁ దొఱంగి దివంబున కేగిన దేవతలు విష్ణువు చతు
ర్థాంశంబని పూజించిరి. ఇట్లు లక్ష్మణుఁడు తన నిష్కలంక
భక్తికి ఫలముగ శాంతినొందెను. తానెప్పుడు ననుగమిం
చు రామునకు స్వాగతం బొసంగ నాస్థానమును రాము
న కంటె ముందుగఁ జేరి వారి రాకకై వేచియుండెను.

౨౬౯. లక్ష్మణుండు చనిన రామచంద్రుఁడు భర
తునకుఁ బట్టముగట్టి లక్ష్మణుని వెంటనంటి పోవఁ దలంచి
న భరతుఁడు దానికి సమ్మతింపక కుశలవుల సింహాసనా
సీనులం జేయుము. శత్రుఘ్నునకు మనగమనము నెఱింగిం
పుము. అనిన వల్లెయని రాముఁడు తనసుతులకు రాజ్య

ము పంచియిచ్చి శత్రుఘ్నుని బిలిపించెను. అయోధ్యాన
గరమునందున్న జనులు లోకత్యాగముచేసి గాదిలి రాజుతో
నడవులకేనియుఁ జావునకేనియు ననుగమింప నిశ్చయించి
రి. శత్రుఘ్నుండును జీవితకాలమందు బలె మరణంబు
నందును భ్రాతలవెంట నరుగ నిశ్చయించి తనసింహాసన
మునఁ గుమారు లిద్దఱనునిచి యయోధ్యకు వచ్చెను. అ
ప్పుడు చూడుఁడీ. కోఁతిదండు, భల్లూకానీకములును, గు
మిగూడె. సుగ్రీవుఁ డంగదునకు రాజ్యమప్పగించి వచ్చె.
విభీషణుండును భక్తుఁడగు హనుమంతుఁడును జాంబవం
తుఁడును వచ్చిరి. అంత రాముఁడిట్లనియె. సుగ్రీవుఁ డిచ్చ
మెయి నాతోరానగును. విభీషణుఁడు హనుమంతుఁడు
ను భూలోకమందు నందాఁక నిందె యుండవలయును.
జాంబవంతుఁడును సహచరులేడుగురును గలియుగాంత
మువఱకు భూమి నుండవలయును. మిగత కోఁతులును
భల్లూకములును పార్థివశరీరముల నుండు దేవతలను నా
రవతరించిన కార్యము ముగిసె. కావున నాతో రానగునని
రాముఁడు నియమించెను.

## రామ నిర్యాణము.

౨౬౬. మఱునాఁడు రేపకడ వారందఱునుదరలిరి.
వసిష్ఠుఁడు మహాప్రస్థానికవిధిని యథావిధిగఁ జేసెను. రా

ముఁడు దక్షిణపార్శ్వంబున సీతయై పుట్టిన శ్రీదేవియు సవ్య పార్శ్వమున వసుంధరాదేవియు నుండఁ బురము వెడలినఁ దమ్ము లనుగమించిరి. రామునితోడ నిర్యాణ మొందనిశ్చ యించి పౌరమహాసంఘము సుఖముగ నిశ్చింతతో వారి వెంట వెడలెను. అట్లు సరయువును జేరిన బ్రహ్మ సర్వదేవ పరివృతుఁడై తోఁచెను. అంత రాముఁడు సరయువు నీరం బులోఁ దిగుచుండ బ్రహ్మస్వాగతంబిడుచు నిట్లనియె. ఓ విష్ణుమూర్తీ! రమ్ము. నీకు భద్రంబగుత. సర్వభూతశ రణ్యా! మనసున కగోచరుఁడవు. నీ తొల్లింటిపత్నియగు మాయయే నిన్నెఱుంగు. అన్యులు నిన్నెఱుంగరు. నీవు కోరినరూపమునఁ దేజరిల్లి రమ్ము.

౨౬౭. అనిన రాముఁడు మహాతేజోవిరాజమానుఁ డై విష్ణురూపమునఁ దమ్ములతోఁగూడఁ బ్రకాశించిన నె ల్లరు నమస్కరించిరి. ఎల్లయెడల మహాశాంతి నిండియుం డె. రామచంద్రుఁడు తనచుట్టును బ్రేమకిరణములఁ బఱపు చుఁ జావునకని తనవెంట వచ్చినవారిని కరుణాకటాక్ష ములఁ గలయఁజూచి బ్రహ్మతో వారలకు స్వర్గంబున సు ఖస్థానము లుంచుమని పలికి యిట్లనియె. వీరు నాభక్తులు. నాకు మాన్యులు. నాకై ప్రాణంబులు త్యజించిరి.

౨౬౮. ఇట్లెల్లరు నానందస్థానమును బ్రవేశించిరి. దియే ధర్మము. రామచంద్రుఁడు మరణమునకు నరుగు తలఁచి తత్స్నేహమునఁ బ్రాణత్యాగము చేయువార ల్గలంబగు జీవితములఁ గాంతురు. అతనితోడి యానంద మను బొందుదురు.

పరమేశ్వరార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ.

---

మ. కడఁకన్ సంతతముం జగత్ప్రభవయోగక్షేమ సంకల్ప మే!
ర్పడఁ దద్ధారణమూలబంధమగు ధర్మంబుల్ విభాగించి చా
ప్పడు వేళన్ బ్రభవంబుఁగూర్ప గురులన్ బ్రహ్మాదిమన్వాదులం
బోడమం జేసెడు నద్వితీయు సకలాపూర్ణున్ దలంతున్ మదిన్.

ఉ. శాలి శకంబులెక్కిడఁగఁ జంద్రదగంబులు నాగములన్ సిజా
పాలుఁడు సౌమ్యయందమరఁ బ్రాజ్ఞవిధేయుఁడ విండ్లచెర్వుగో
పాలకనామధేయుఁడ స్వభాషగడించితి బాలబోధకుం
బోలఁగ రామచంద్రుకథ భూవర ధర్మనిదర్శన ప్రథన్.

శ్రీ రామాయణసారము

సంపూర్ణము.

